అపరాధ పరిశోధన అనుబంధం—124

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అలీబాబా 40 దొంగలు

రచన: అజీజ్

## దేశద్రోహులు

రచన: ప్రతాప రవిశంకర్

## విదేశీయులు-విగ్రహాలు

రచన: టెంపోరావ్

## వనభోజనాలు

రచన: బి. రాజేశ్వరి

కళ్యాణదుర్గం - అయిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —124
ఏప్రిల్, 1984
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# అలీబాబా 40 దొంగలు

అజీజ్

"చెల్లాయ్!" పిల్చాడు కిరణ్.

"అన్నయ్యా!" అంటూ వచ్చింది జ్యోతి.

"కారు డ్రైవర్ కావాలని పత్రికల్లో ప్రకటిస్తే అనేక అప్లికేషన్స్ వచ్చాయి. వాటిలో నాలుగు సెలక్టు చేసి, ఈ రోజు ఇంటర్వ్యూకు రమ్మని కబురంపాను. ఉదయం పదవుతోంది. అవతల నేను అత్యవసర మీటింగ్ అటెండ్ కావాలి. ఆ ఇంటర్వ్యూ సంగతేదో నువ్వే చూడు" అంటూ చకచక బైటికి నడిచాడు కిరణ్.

జ్యోతి నెమ్మదిగా వెళ్ళి, హాలు పక్క ఆఫీస్ రూంలో కూర్చుంది. పదిన్నర దాటాక వచ్చి చెప్పాడు నౌఖరు ఇంటర్వ్యూ కోసం అభ్యర్థులు వచ్చారని.

"ఎంతమంది?" అడిగింది జ్యోతి.

"ఇద్దరేనమ్మా!"

"నలుగుర్ని రమ్మంటే ఇద్దరే వచ్చారా! మంచిదే. నాకూ తలనొప్పి తగ్గుతుంది. ముందు వచ్చిన వ్యక్తిని

పంపు లోపలికి."

నౌఖరు వెళ్ళిన రెండు నిమిషాల తరవాత, స్ప్రింగ్ డోర్స్ తెరుచుకుంటూ లోనికి వచ్చాడో యువకుడు. పళ్ళికిలించి, "నా పేరు పచ్చిపులుసు పీతాంబరమండి. తండ్రి పచ్చిపులుసు ఏకాంబరం, తల్లి నాంచారమ్మలకు పుట్టిన ఏకైక నలుసుని. వయసు ముప్ఫై, బరువు యాభై, పొడవు మూడడుగుల ఐదంగుళాలు.... సారీ.... ఐదడుగుల మూడంగుళాలు. పొట్టివాణ్ణయినా కారు తోలడంలో గట్టివాణ్ణే!

ఎంతటి ఘోరమైన ఆక్సిడెంట్ జరిగినా చెక్కు చెదరను. ఏడేళ్ళ హెవీలైసెన్స్‌తో, పదేళ్ళ ప్రత్యేకానుభవంతో మీ వద్దకు వచ్చాను ఉద్యోగార్థం!" అన్న అతని వాగ్ధాటికి ఖంగుతిని, వెంటనే తేరుకుంది జ్యోతి.

"అయ్యా, ఏకాంబరం!"

"పీతాంబరమండి!"

"ఏదో ఒక అంబరంగానీ నువ్వు నడుపుతున్న జీపు ప్రమాదకరమైన ఘాట్ రోడ్ మీంచి కిందికి వస్తోందనుకో. ఏ కాస్త పొరపాటు జరిగినా అది రోడ్డు పక్క అగాధంలోకి జారిపోతుంది. ఆ స్థితిలో హఠాత్తుగా జీపు బ్రేకులు ఫేలయ్యాయి. అదే క్షణంలో ఓ అందమైన అమ్మాయి రోడ్డెక్కుతూ అడ్డం వచ్చింది. అప్పుడేం చేస్తావు నువ్వు?"

"వెంటనే జింకలా జీపులోంచి దూకి ఆ అమ్మాయిని కాపాడతాను."

"అంటే, జీపును వల్లకాట్లో వదిలేకా?"

"డబ్బు తగలేస్తే అలాటి లక్షాలొంభై జీపులు దొరుకుతాయిగానీ, అంత అందమైన అమ్మాయి ఎక్కడ

దొరుకుతుందండీ?"

"నీ దృష్టిలో యజమాని జీపుకన్నా, అందమైన అమ్మాయే మిన్న అన్నమాట!"

"అంతే కదండి.... హిహిహీ!"
హాహా

"మా క్కావలసింది ప్రాణంకన్నా ప్రియంగా మా కారు చూసుకునే డ్రైవరు. నీలాటి అమ్మాయిల పిచ్చి ఉన్న పచ్చిపులుసు పీ తాం బ రా లు కాదు. వెళ్ళిరా బాబూ!"

"అది కాదండి....మరే....మరే...."

"ఏ సంగతీ తరవాత తెల్పుతాం! ముందు బైటికెళ్ళి, ఆ రెండో అతన్ని పంపు."

బిక్క మొహంతో ఫైలందుకుని, బైటికి నడిచాడు పీతాంబరం.

రెండు నిమిషాల తరవాత, "మే ఐ కమిన్?" అన్న కంఠం విని, "ఎస్!" అంది జ్యోతి టేబిల్ మీది కాగితాలు చూస్తూ.

స్ప్రింగ్ డోర్స్ కిర్రుమన్న శబ్దం! లోన అడుగు పెట్టిన అడుగుల చప్పుడు విని తలెత్తింది జ్యోతి. అంతే! దిగ్భ్రాంతితో ఆమె కళ్ళు విప్పారాయి. "ఆ..కా..శ్! ను....వ్వా!" అంది నోరు తెరుస్తూ.

"జ్యో....తీ!ఇది నీకా ఇల్లా"అన్నాడతను అప్రతిభుడై.

"ఔను ఆకాశ్ ....నువ్వు....ఈ డ్రైవర్ ఉద్యోగం కోసం...."

"ఔను జ్యోతీ!"

"ఫస్టు క్లాసులో యెమ్మెస్సీ పాసైనవాడివి....ఆ ఉన్నత చదువుకు తగ్గ ఉద్యోగమే దొరకలేదా నీకు?"

వేలతంగా నవ్వాడతను. "మన దేశంలో కేవలం

ఉన్నత డిగ్రీలు ఉన్నంతమాత్రాన సరిపోదు జ్యోతీ! వాటితో బాటు మరికొన్ని ప్రత్యేకతలు కూడా వుండాలని స్వానుభవంతో తెలుసుకున్నాను. నావంటి పేదవాడి వద్ద ఆ ప్రత్యేకతలు ఎక్కణ్నించి వస్తాయి?

బాల్యంలోనే తండ్రిని కోల్పోయిన నన్నూ, చెల్లాయినీ కంటికి రెప్పలా కాపాడుతూ, ఒంట్లోని ప్రతి రక్తపు బొట్టునూ చమట బిందువుగా మార్చి, నన్ను చదివించి, ఇప్పుడు తను పడ్డ ప్రయాసంతా బూడిద పాలైందే అని మాతాశురాలైన నా తల్లినీ, చెల్లాయినీ యెలా పోషించను?

ఆమె కన్నీటి ఋణం యెలా తీర్చుకోను? అందుకే... అందుకే ఈ ఉద్యోగంలో చేరడానికి సిద్ధపడ్డాను. యెప్పుడో స్నేహితులవద్ద నేర్చుకున్న డ్రైవింగ్ తీసి పెట్టుకున్న లైసెన్సూ యిప్పుడు ఈ విధంగా పనికి వచ్చాయి."

జ్యోతి హృదయం ఆవేదనాభారంతో అర్ద్రమయింది. కాలేజీ రోజుల్లో అతడిని తను యెంతగానో ఆరాధించేది.

ఐతే, సదా తన చదువుసంధ్యల్లో మునిగి తేలే ఆకాశ్ ఆమె అభిమానాన్నీ, ఆపేక్షనూ యెన్నడూ గుర్తించ లేదు. రాత్రింబవళ్ళూ తనకోసం శ్రమిస్తున్న తల్లి స్వేద బిందువులకు తగిన మూల్యాన్ని సంపాదించాలనే తపన తప్ప అతనికి మరో ధ్యాస ఉండేదికాదు.

చివరికి ఫైనలియర్ పరీక్షలు రాసి, విద్యార్థులంతా తమ తమ గూళ్ళకు చేరే రోజు కూడా, స్త్రీ సహజమైన సిగ్గూ బిడియాలు జ్యోతి మనసులోని భావాలను అతని ముందు వ్యక్తం కానివ్వకుండా అడ్డుతగిలాయి. మూగ నోములోనే అతనివద్ద వీడ్కోలు తీసుకుని ఇల్లు చేరింది.

ఆ తరవాత, అతని ఆచూకీ తెలుసుకోవాలని చేసిన ప్రయత్నాలన్నీ విఫలమై, నిస్పృహాలో నిర్లిప్తంగా వున్న ఈ తరుణంలో హఠాత్తుగా అతని ఆగమనం ఆమెను విచలితం' చేసి వేసింది.

"శ్రమకు తగిన ఫలితం ప్రాప్తించకుంటే ప్రతి మనిషీ నిస్పృహతో కృంగిపోవడం సహజం! నువ్వు పడ్డ శ్రమకు ప్రత్యక్ష సాక్షిని నేను. అందుకే, నువ్విలా నిస్పృహ పడటం నేను సహించలేను. నీ చదువుకు తగిన ఉద్యోగం దొరుకుతుంది ఆకాశ్.

నగరంలో మాకు నాలుగు కంపెనీలున్నాయి. వాటిలో ఒకటి వివిధ రసాయనాలూ, మందులూ తయారుచేసే కెమికల్ ఫ్యాక్టరీ. అందులో పోస్టు ఖాళీ వున్నా, లేకున్నా నీకోసం ఓ పోస్టు సృష్టించబడుతుంది. ఈ రోజే మాట్లాడతాను అన్నయ్యతో. నా కోరిక నేదీ ఆయన నిరాకరించరు" అంది జ్యోతి.

"నీ అభిమానానికి కృతజ్ఞుణ్ని. కానీ, స్వయంకృషి తోనే మా జీవితాలకు సరైన పునాదులు వేసుకోవాలని నా అభిమతం! ఒకరి సహాయ సహకారాలతో...."

"నీ భావాలూ, ఆదర్శాలూ హర్షించతగ్గవే ఆకాశ్! కానీ, అవి ఇంతవరకూ నీకు ఓ జీవనోపాధి చూపలేక పోయాయని స్వానుభవంతో తెలుసుకున్నావు కదా? బెట్టు చెయ్యక ప్లీజ్, ఈ స్నేహితురాలి సలహా కాదనకు ఆకాశ్!"

ఆలోచించి తలూపాడతను. "సరే, నీ మనసు నొప్పించడం నాకిష్టంలేదు. అలాగే కానివ్వు" అన్నాడు నిట్టూరుస్తూ.

# 2

“నే చెప్పాలా? అన్నయ్యా నా అభ్యర్థనేదీ కాదనడని. కెమికల్ ఫ్యాక్టరీలో అసిస్టెంట్ కెమిస్టుగా నీ ఉద్యోగం ఖాయమైంది. అంతేకాదు, మా ఇంటి వెనక తోటలో ఓ ఔట్ హౌస్ ఖాళీగా వుంది. ఈ మహానగరంలో తగిన సౌకర్యాలు గల ఇల్లు దొరకడం చాలా కష్టం! అందుకే దాన్ని మీకు కేటాయించాము” అంది జ్యోతి మర్నాడు ఆకాశ్ ని కలిసి.

తల్లీ, చెల్లాయితో వారి ఔట్ హౌస్ లో మకాం, పెట్టి, ఆ నూతనోద్యోగంలో నిలదొక్కుకునేసరికి నెల రోజులు పట్టింది ఆకాశ్ కు. వాడిపోయిందనుకున్న ప్రేమ పందిరి, అతని ఆగమనంతో మళ్ళీ నూతన చిగుళ్ళు తొడిగింది జ్యోతి మనసులో.

తన ఉద్యోగం తప్ప మరేమీ పట్టించుకోని తత్వం అతనిది. అహర్నిశలూ అతని ఆలోచన తప్ప మరో ఊసులేని ఆరాటం ఆమెది. సాయంత్రం అతను ఫ్యాక్టరీ నించి ఇంటికి బైలుదేరే సమయాన కార్లో గేటుముందు ప్రత్యక్షమౌతుంది. కంపెనీ నెపంతో అతన్ని కారెక్కించుకుని, బీచికో, సినిమాకో, పార్కుకో తీసికెళ్తుంది. గంటల తరబడి కూర్చుని కబుర్లు చెబుతుంది.

“మనం సహాధ్యాయులం! మంచి మిత్రులం! ఒప్పుకుంటాను. అంతమాత్రాన నా స్థితి మరచి నీతో చనువు పెంచుకుని, విధి గీచిన అగ్ని రేఖలు దాటి, నీ అభిమాన పాత్రుణ్ని కావాలనుకోడం అత్యాశే అవుతుంది.

అలాగే, శ్వేతమనస్కురాలివైన నువ్వు నా వంటి అర్భకుణ్ని ఇలా అందలమెక్కించడం యెన్నడూ సహించదు సమాజం! సంఘంలో యెంతో పరపతీ, ప్రతిష్ట

ఉన్న కుటుంబంమీది. నలుగురూ నాలుగు విధాలా చెవులు కొరుక్కుంటారు. నా కారణంగా మీ కుటుంబం సమాజం దృష్టిలో చులకన కావడం నేను సహించలేను" అన్నాడు ఆకాశ్ ఒకరోజు.

"నువ్వన్న తారతమ్యాలూ, అగ్నిరేఖలూ, విధీ, దైవం గీచినవి కావు ఆకాశ్! సంకుచిత మనసుతో మనం గీసుకున్నవి. సమయం వచ్చింది గనక, ఇన్నాళ్ళూ నాలో అణగారి వున్న భావదీపాలను వెలిగించి, ఆ కాంతిలో నా మనః ఫలకంపై ముద్రవేసుకున్న ఓ సుందరరూపాన్ని చూపుతాను నీకు.

లోకం ఏమన్నా, సంఘం ఈసడించినా, కుటుంబం తృణీకరించినా ఆ రూపాన్ని నేను ఆరాధించడం మానను ఆకాశ్! ఇంకా అర్థం కాలేదా? దాంపత్యమనే పవిత్ర బాంధవ్యంలో మనం ముడిపడటం నీకిష్టంలేదా?"

క్రొత్త తెరువు చూపిన మనిషి, ఆశ్రయం యిచ్చిన మనిషి, అంత దీనంగా తన సాహచర్యాన్ని అర్థిస్తుంటే, కొవ్వొత్తిలా కరగకపోవడం యెవరి తరం? ప్రేమను ప్రేమించడం, ద్వేషాన్ని ద్వేషించడం మానవ నైజం!

అదే స్పందనకు గురైంది ఆకాశ్ హృదయం! ఉత్తుంగ తరంగంలా పొంగిపొరలింది అతనిలో ప్రేమామృతం! అలా రూపు దిద్దుకుంది వారిమధ్య నూతనాధ్యాయం!!

# 3

"చెల్లాయ్! నీతో మాట్లాడాలి. ఇలా రా!"

జ్యోతి గదిలోకి రాగానే తలుపు మూసి వెనుదిరిగాడు కిరణ్. "పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగుతూ యెవ్వరూ తనని చూడటం లేదనుకుంటుందిట. ఆ పిల్లి సంగతెలా వున్నా, నీ పిల్లి చేష్టలుమాత్రం లోకమంతా

చూసి గుసగుసలాడుకుంటోంది.

లోకం సంగతటుంచి, ఈ రోజు సముద్రం ఒడ్డున మీ ఆటలూ, పాటలూ కళ్ళారా చూసి నిర్ఘాంతపోయాను. యుక్త వయసు వచ్చాక, స్త్రీ పురుషులు పరస్పరం మనసులు ఇచ్చి పుచ్చుకోడం సృష్టి సైజం!

ప్రేమించడం తప్పు కాదు. ఒప్పుకుంటాను. ఐతే, అందులోనూ యుక్తా యుక్తాలు యోచించడం వివేక లక్షణం! పొట్ట కూటికోసం మన పంచన చేరి బ్రతికే నౌఖర్నా నువ్వు ప్రేమించింది? ఛ ఛ! వాడికీ, మనకూ ఎందులో సామ్యం?"

"తగిన సమయం చూసి, నేనే ఈ విషయం నీతో ప్రస్తావించాలనుకుంటున్నానన్నయ్యా! ప్రేమించడం తప్పు కానప్పుడు, మనుషులు ఏర్పరుచుకున్న ఈ తారతమ్యాలూ, అగాధాలూ, అడ్డు గోడల గురించి ఆలోచించడం తప్పుకాదా? మంచి మనసుకుండవలసిన లక్షణాలన్నీ పుణికి పుచ్చుకున్న అతను పేదవాడిగా పుట్టడం నేరమా అన్నయ్యా?"

"కావచ్చు. కానీ, ఈ సమాజంలో బ్రతుకుతున్నప్పుడు అది ఏర్పరచిన కొన్ని కట్టుబాట్లకూ, పరిధులకూ, అవరోధాలకూ, మర్యాదలకూ మనం తలవంచక తప్పదు. నువ్వు చేసిన ఏ తప్పునో కప్పిపుచ్చడానికీ, తప్పించుకోడానికీ అటువంటి అప్రయోజకుడికిచ్చి నిన్ను కట్టబెట్టామని రేపు లోకం కోడై కూసే నేను తలెత్తుక తిరగగలనా? పరువుగా బ్రతగ్గలమా?"

"మన మనసులో మాలిన్యం లేనప్పుడు లోకం గురించి యెందుకాలోచించాలన్నయ్యా? అటువంటి సమాజం ఏర్పరిచిన కట్టుబాట్లని నేను త్రెంచివేస్తాను. తారతమ్యాలని

తారుమారు చేస్తాను. అగాధాలని పూడ్చివేస్తాను. అడ్డుగోడల్ని కూల్చివేస్తాను. నా తుది నిర్ణయం అదే!" అంటూ గబగబ గడిలోంచి బైటికి నడిచింది జ్యోతి.

4

"ఆకాశ్ బాబూ!"

"ఎవరూ?"

"నేనండి. బ్రహ్మయ్యను."

అప్పుడే భోజనాని కుపక్రమిస్తున్న ఆకాశ్ అలాగే లేచి బైటికి వచ్చాడు.

"కిరణ్ బాబుగారు మిమ్మల్ని తొరగా పిల్చుకు రమ్మన్నారండి."

"అలాగా!" అంటూ రిస్టువాచీ చూసుకున్నాడు ఆకాశ్.

రాత్రి ఎనిమిది గంటలు. తల్లితో చెప్పి, నౌఖరు వెంట భవనంవైపు నడిచాడు ఆకాశ్. అతన్ని మేడమీది కిరణ్ గదివద్ద వదిలి వెళ్ళిపోయాడు నౌఖరు.

కాలుగాలిన పిల్లిలా గదిలో పచార్లు చేస్తున్న కిరణ్ అతన్ని చూడగానే సాదరంగా లోనికి ఆహ్వానించి, "నిన్ను డిస్టర్బ చేసినందుకు సారీ ఆకాశ్! చాలా ముఖ్యమైన పనుండి పిలిపించవలసి వచ్చింది. విద్యానగర్ వీధిలో నివసించే నా స్నేహితుడికి అత్యవసరంగా యాభై వేలు అవసర మయ్యాయట. నాకు తలపోటుగా వుంది. అందుకే నిన్ను పిలిపించాను."

"దానికేం, ఇచ్చివస్తా నివ్వండి."

"అతని పేరు మోహన్‌కుమార్. అదుగో, బల్లమీదుంది డబ్బు బ్యాగ్. అందులోనే అతని విజిటింగ్ కార్డు కూడా ఉంది. దానిపై అతని ఇంటి అడ్రసు ఉంటుంది.

కారు చెల్లాయి తీసుకెళ్ళింది. నువ్వు టాక్సీలో వెళ్ళిరా! అతను యెదురుచూస్తుంటాడు. ఇందర, టాక్సీ ఖర్చు!" అంటూ పర్సుతీసి, వందరూపాయల నోటు అందించాడు కిరణ్.

తలూపి, బల్లమీది నల్లబ్యాగ్ అందుకుని బైటికి నడిచాడు ఆకాశ్.

వీధిలో యెదురైన టాక్సీ యెక్కి, "విద్యానగర్ స్ట్రీట్!" అన్నాడు డ్రైవర్‌తో.

టాక్సీ కదిలాక, బ్యాగ్ జిప్ లాగి, నోట్లకట్టలు తడుముతూ, విజిటింగ్ కార్డు బైటికితీశాడు. దాని ఆధారంతో మోహన్‌కుమార్ ఇల్లు చేరుకుని, టాక్సీ దిగి, "ఇక్కడే వుండు. ఇప్పుడే వస్తాను. మళ్ళీ వెనక్కి వెళ్ళాలి" అన్నాడు డ్రైవర్‌తో.

"సారీ సార్! నాకు వేరే పనుంది. అటు రావడం కుదరదు" అన్నాడు డ్రైవర్.

మీటర్ బిల్ యిచ్చేసి, మోహన్‌కుమార్ యింటి కంపౌండ్ గేటు తెరిచాడు ఆకాశ్. మెయిన్ రోడ్డు పక్కనే ఉంది ఇల్లు. చాలా చిన్న కంపౌండు అది. తలుపు మూసివుంది. కాలింగ్ బెల్ వత్తాడు. లోపల కాలింగ్ బెల్ మోగుతున్న శబ్దం, ఆ నిశ్శబ్ద వీధిలో చాలా స్పష్టంగా వినిపిస్తోంది.

పదినిమిషాలు గడిచినా యెవ్వరూ వస్తున్న అలికిడి లేదు. మరోసారి నొక్కాడు బెల్. తలుపు తెరుచుకోడం అటుంచి, లోపల మనుషులున్న సవ్వడి కూడా లేదు. పడుకున్నారా! గట్టిగా తట్టాడు తలుపుని. అంతే! కిర్రుమంటూ తెరుచుకుంది.

"మోహన్ గారూ!" పిల్చాడు.

# 13

జవాబు లేదు. మళ్ళీ పిల్చాడు. నిశ్శబ్దం! ఆశ్చర్యంతో లోన అడుగుపెట్టాడు ఆకాశ్. అది చిన్న సైజు హాలు. దాని కిరుపక్కలా రెండు గదులు. ఓ మూల మేడమీది కెళ్ళడానికి గుండ్రని ఇనపమెట్లు.

"మోహన్‌జీ...." పిలవబోతూ చటుక్కున ఆగిపోయాడు.

మేడమీంచి వినిపిస్తోంది సన్నని మూలుగు. గబగబ మెట్లని సమీపించి చెవులు రిక్కించాడు. సందేహం లేదు. యెవ్వరో మూలుగుతున్నారు బాధగా! ఆలస్యం చెయ్యకుండా మెట్లెక్కి పైకి వెళ్ళాడు. రెండే రెండు గదులున్నాయి పైన. మూలుగు వినిపిస్తున్న గది తలుపు తెరిచి వుంది. అందులో అడుగుపెట్టి స్థాణువైపోయాడు ఆకాశ్!

సోఫాలో అడ్డంగా ఒరిగి వున్నాడతను. పాతికేళ్ళ యువకుడు. కడుపులో పిడివరకూ దిగి వుంది కత్తి! ధారగా కారుతోంది రక్తం!! మొహమంతా చెమటలు పట్టి, అతికష్టంమీద కళ్ళు తెరిచి చూస్తున్నాడు. ఆకాశ్‌ని చూడగానే అస్పష్టంగా ఏదో గొణిగాడు.

షాక్‌లోంచి తేరుకుని, గబగబ సోఫాని సమీపించాడు ఆకాశ్. "ఎవరు? యెవరు చేశారీ పని?" అడిగాడు అతన్ని పొదవి పట్టుకుంటూ.

మళ్ళీ ఏదో గొణిగాడతను. అర్థంకాలేదు. అతని కడుపులో మకాం పెట్టిన కత్తి పిడిపై చెయ్యివేసి, గట్టిగా లాగాడు బైటికి. ఏదో అనాలని నోరు తెరిచాడా యువకుడు. అంతే! పక్కకి వాలిపోయింది అతని తల!! ఆకాశ్ గుండె ఝల్లుమంది!!!

అప్పుడే కిందినించి యెవ్వరో మెట్లెక్కి పైకివస్తున్న

బూట్ల చప్పుడు. చటుక్కున లేచినిల్చున్నాడు ఆకాశ్. ఆలోగా రానేవచ్చారు వాళ్ళు. పోలీసులు!

సోఫాలో పడున్న శవాన్నీ, టీపాయ్‌మీద బ్యాగ్‌నీ, రక్తసిక్త హస్తాలతో కత్తి పట్టుకుని నిల్చున్న ఆకాశ్‌నీ మార్చి మార్చి చూసి, సాలోచనగా తలూపాడు యిన్‌స్పెక్టర్. "ఈ ఇంట్లోంచి పెద్దగా ఆర్తనాదాలు వినిపిస్తున్నాయని దారినపోయే దానయ్య యెవరో ఫోన్ చేస్తే, క్షణాలమీద వచ్చేశాం! నీ దురదృష్టం మా అదృష్టం కలిసివచ్చి, పారిపోకముందే మా కంటబడ్డావు!"

"నే .... నేను .... నేను చంపలేదతన్ని!" వణికింది ఆకాశ్ కంఠం.

సాలోచనగా తలూపుతూ టీపాయ్‌మీది బ్యాగ్ తాకకుండా జాగ్రత్తగా జిప్ లాగాడు ఇన్‌స్పెక్టర్. అందులో వున్న నోట్లకట్టలూ, విజిటింగ్ కార్డూ చూడగానే తలెత్తి. "హత్యకు కారణం ఇంత స్పష్టంగా కనిపిస్తోంటే నీ మాటలు నమ్మడానికి మేమేం చవటలమనుకున్నావా? సార్జంట్! కఫ్స్ తగిలించు అతని చేతులకి" అన్నాడు కటువుగా.

# 5

అశనిపాతమైంది ఊహించని ఆ సంఘటన ఆకాశ్ తల్లికీ, చెల్లాయికీ, జ్యోతికీ, బెయిలుపై అతన్ని విడిపించడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమవడంతో, అతని నిర్దోషిత్వాన్ని నిరూపించడానికి పేరుమోసిన ఓ క్రిమినల్ లాయర్ని నియమించింది జ్యోతి.

కోర్టులో ప్రారంభమైంది విచారణ. ఆకాశ్‌కు తాను డబ్బిచ్చి మోహన్‌కుమార్ ఇంటికి పంపలేదని కిరణ్ ప్లేటు ఫిరాయించేసరికి, నిర్ఘాంతబోయాడు ఆకాశ్!

అప్పుడు తెలిసివచ్చిందతనికి, జ్యోతి జీవితంలోంచి తనను శాశ్వతంగా తుడిచి పెట్టడానికే ఆ పన్నాగమంతా అమలు చెయ్యబడిందని!

బ్యాగుమీదా, కత్తిమీదా ఆకాశ్ వేలిముద్రలు తప్ప మరెవరి వేలిముద్రలూ లేవు. దాంతో మోహన్ కుమార్ని చంపి, ఆ డబ్బు కాజేయడానికి ప్రయత్నించింది అతనేనని నిర్ణయించి, శిక్ష విధించింది కోర్టు. యావజ్జీవ శిక్ష!

సంకెళ్ళతో అతన్ని కోర్టు బైటికి తీసికెళ్ళి, వ్యాన్ యెక్కిస్తుండగా తల్లీ, చెల్లాయీ, జ్యోతీ వెక్కి వెక్కి ఏడ్చారు.

"విధి వక్రించినప్పుడు జీవనగతులు తారుమారవక తప్పవు జ్యోతీ! నాకోసం నువ్వు పడ్డ తాపత్రయం, చేసిన సాయం జీవిత పర్యంతమూ మరవలేనివి. ఇక నా అన్నవారు మిగలని నా తల్లీ, చెల్లెలి గతి ఏమౌతుందో అన్న క్షోభే నన్ను కృంగదీస్తోంది.." అన్నాడు ఆకాశ్ డగ్గుత్తికతో.

"నా కంఠంలో ప్రాణం వుండగా వారికే ఆపదా రానివ్వను ఆకాశ్! అలాగే, నీ నిర్దోషిత్వాన్ని నిరూపించేవరకూ నేను నిద్రపోను" అంది జ్యోతి ఉద్వేగంతో.

ఆకాశ్ను మోసుకుంటూ సాగిపోయింది పోలీస్ వ్యాన్.

అతని తల్లినీ, చెల్లెలినీ యథాప్రకారం తమ ఔట్ హౌస్లో ఉండటానికీ, తమ ప్రాపకంలో బ్రతకడానికి యెలాంటి అభ్యంతరం చెప్పలేదు కిరణ్.

చెయ్యని నేరం! యావజ్జీవ కారాగారం! కంటిముందు బ్రతుకంతా అంధకారం! అటు ఆత్మీయుల భయం! ఇటు ప్రతిక్షణం గుండెలో ప్రజ్వరిల్లుతున్న ప్రతీకారం! ఎలా పడుతుంది కునుకు?

అర్ధరాత్రి జైలు గదిలో గోడకానుకుని, శూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తున్నాడు ఆకాశ్. సాటి ఖైదీలు చెల్లా చెదురుగా పడుకుని ఆదమరిచి గురకలు పెడుతున్నారు.

అంతలో, యెవరో తన పక్కన చేరినట్టు తోచి, తృళ్ళిపడి తల తిప్పాడు.

ఖైదీ నెంబర్ 525. "వచ్చినప్పట్నించీ చూస్తున్నా! రాత్రిళ్ళు నిద్రపోకుండా యెందుకలా కూర్చుంటావు? ఏమిటి ఆలోచిస్తుంటావు? ఇక్కడ ఉన్న వాళ్ళంతా విధి వంచితులే! నేరమనేది ఎవరూ బుద్ధిపూర్వకంగా చెయ్యరు. పరిస్థితులు! పరిస్థితులే మనిషి చేత చేయిస్తాయి. చివరికి ఇక్కడికి చేరుస్తాయి.

వీళ్ళందరికీ ఐనవాళ్ళూ, ఆత్మీయులూ లేరా? బాధ్యతలూ, భవబంధాలూ లేవా? ఐనా, అన్నీ మరచి, పరిస్థితులతో రాజీపడి, ఎలా నిద్రపోతున్నారో చూడు! రేపు నువ్వూ అలాగే రాజీపడక తప్పదు. అనవసరంగా ఆలోచించి, ఎందుకు మనసు పాడుచేసుకుంటావు? పద. పడుకో!" అన్నాడు సానుభూతితో.

నిట్టూర్చాడు ఆకాశ్. "నేరం చేసి వుంటే, దానికి తగ్గ శిక్ష పడిందికదా అని మనసును జోకొట్టుకోవచ్చు. ఏ నేరమూ చెయ్యని నేను, వయసుమీరిన తల్లికీ, పెళ్ళి కావలసిన చెల్లికీ ఏకైక ఆధారమైన నేను, యావజ్జీవ శిక్షకు గురై, పరిస్థితులతో ఎలా రాజీపడమంటావు."

ఆ ఖైదీ కనుబొమలు ముడిపడ్డాయి. "తొలిసారి చూసినప్పుడే నా అంతరాత్మ ఎందుకో నిన్ను నేరస్థుడిగా అంగీకరించలేదు. నిరపరాధివైన నీకు అంత పెద్ద శిక్ష ఎలా పడింది? అభ్యంతరం లేకపోతే చెబుతావా నీ కథ?"

గుదిబండలా గుండెమీద పేరుకున్న ఆవేదన ఒకరి ముందు వెళ్ళబోసుకుంటే, రవంత సాంత్వన చేకూరుతుందంటారు. జరిగిందంతా అతనికి వివరించాడు ఆకాశ్.

"నా మీద కుట్రపన్ని ఆ హత్యానేరంలో ఇరికించిన వ్యక్తి యెవరో తెలిసిపోయింది నాకు. ఒక్క గంట, కేవలం ఒక్క గంట, ఈ ఖైదులోంచి బైటపడే అవకాశం లభిస్తే చాలు. వాడి అంతం చూసి, నిజమైన నేరస్థుడిగా తిరిగి వస్తాను."

"ష్..కాస్త మెల్లిగా మాట్లాడు" అంటూ పడుకున్న మిగతా ఖైదీలవైపు చూశాడతను.

"ఇక్కడ కొందరు ఖైదీలు జైలర్ తరఫున గూఢచారులుగా వ్యవహరిస్తుంటారు. పాటి ఖైదీల మాటలు విని జైలర్‌కు చేరవేస్తుంటారు. ఇక్కణ్నించి బైటపడటానికి నువ్వెంత ఉబలాటపడుతున్నావో, అంతకు రెట్టింపు నేనూ ఆరాటపడుతున్నాను.

ఈ విషయంలో అన్నిటికీ తెగించగల నీలాంటి సహచరుడికోసం ఎదురు చూస్తున్నాను. నా పేరు తెలుసుగా నీకు? భగీరథ్! నీ పేరు ఆకాశ్ కదూ?"

తలూపాడు ఆకాశ్. ఆ తర్వాత ఇద్దరూ నిద్రకుపక్రమించారు—

మర్నాడు ఖైదీలందరు కొండలమధ్య బండరాళ్ళు

తొలుస్తున్నారు. గునపంతో ఓ రాయిని పక్కకి తొలి గించిన ఆకాశ్ కళ్ళు నేలమీద నిలిచిపోయాయి. రాయి కిందినించి పొడవాటి, లావుపాటి నల్లని తేలు ఇవతలికి వచ్చి అటూ యిటూ పాకుతోంది!

భగీరథ్ వెంటనే దాన్ని చంపడానికి చిన్న రా యందుకున్నాడు.

"ఆగు!" అన్నాడు ఆకాశ్.

"ఏం?"

ఆకాశ్ పలకలేదు. గునపం మొనతో చిక్కుడు గింజని పోలిన తేలుకొండీని తోకనించి వేరుచేసి, చుట్టూ కలయచూశాడు జాగ్రత్తగా. మిగతా ఖైదీలూ, సెంట్రీలూ యెండలో చమట్లు కక్కుతూ తమ తమ గొడవల్లో మునిగి వున్నారు.

తలమీది టోపీతీసి, తేలుమీదవేసి, జాగ్రత్తగా దాన్ని టోపీలోకి చేర్చి, సందులేకుండా టోపీ అంచుల్ని దగ్గరగా మడతబెటాడు ఆకాశ్.

"ఏం చేస్తావు దాన్ని?" అడిగాడు భగీరథ్ ఆశ్చ ర్యంగా.

"చెబుతాను. ఓపికపట్టు" అన్నాడు ఆకాశ్ టోపీని ఓ మట్టిపెళ్ళ మాటున ఉంచి అంచుపై రాయి పెడుతూ.

## 7

అర్ధరాత్రి జైలు గాఢ నిశ్శబ్దంలో మునిగివున్న వేళ, సెంట్రీలు రైఫిళ్ళతో గస్తీ తిరుగుతున్న వేళ ఆకాశ్, భగీరథ్ జైలుగది తలుపు దగ్గర ఒదిగి ఎదురు చూడ సాగారు. లోపల మిగతా ఖైదీలు గురకలు పెడుతూ నిదరపోతున్నారు. గదిముందు వరండాలో లైటు వెలుగు తోంది.

అంతలో ఓ సెంట్రీ ఇటే వస్తున్నట్టు బూట్సుల చప్పుడు విని, సిద్ధంగా వుండమన్నట్టు కన్ను గీటాడు ఆకాశ్. బూట్ల చప్పుడు క్షణక్షణానికీ దగ్గరవుతోంది. టోపీలో సిద్ధంగా వున్న తేలును కటకటాల మధ్య నించి, సరిగ్గా వరండామధ్య పడేశాడు ఆకాశ్.

అదే క్షణంలో సెంట్రీ వచ్చాడక్కడికి. "సార్! తేలు!" అరిచాడు భగీరథ్.

నిదర మబ్బులో వున్న సెంట్రీ అంత చేరువలో అటు వంటి తేలు చూడగానే త్రుళ్ళిపడి, తలుపు దగ్గరికి జరిగాడు. అంతే! అతని కంఠం చుట్టూ చెయ్యి బిగించి, తలుపుకు వత్తాడు భగీరథ్. రెప్పపాటులో అతని భుజాని కున్న రైఫల్ ఊడలాక్కుని, గొట్టాన్ని తలుపుకవతల తాళానికానించి ట్రిగ్గర్ వత్తాడు ఆకాశ్!

"ధన్!" మన్న శబ్దంతో జైలుగోడలు దద్దరిల్లాయి.

రైఫల్ బోల్టు వెనక్కి లాగుతూ వరసగా రెండు మూడు గుండ్లు పేల్చాడు. తాళం ఊడిపడింది. అప్పటికే ఇటు ఖైదీలూ, అటు సెంట్రీలూ అదిరిపడి హాహాకారాలు ప్రారంభించారు. చెవులు చిల్లులుపడేలా మోగసాగింది ఎమర్జెన్సీ సైరన్! జైలు నాలుగు మూలలా కళ్ళు చెదర గొట్టే సెర్చి లైట్లు వెలగసాగాయి. తలుపు తెరిచి బైటి కురికారు, ఆకాశ్, భగీరథ్‌లు.

ఇతర ఖైదీలు కూడా ఎగిరి గంతేసి బైటపడ్డారు. ప్రారంభమయ్యాయి తుపాకీ కాల్పులు. కన్ను మూసి తెరిచేలోగా అంతవరకూ నిశ్శబ్దంగా ఉన్న జైలు వాతా వరణం తుపాకుల మోతతో భీకర రణరంగంగా మారి పోయింది.

ఆకాశ్, భగీరథ్‌లు పరుగెత్తసాగారు. చేత రివా

ల్వర్ పట్టుకుని పరిగెత్తుకొస్తూ కనిపించాడు జైలర్! తుపాకీ అతనికి గురిపెట్టి, ట్రిగ్గర్ నొక్కాడు ఆకాశ్. రైఫిల్ పేలలేదు. గుళ్ళు ఖాళీ!

అతన్ని దగ్గరికి రానిచ్చి, రైఫిల్ని భగీరథ్ కందించి, చిఱుత లా జైలర్ మీదికి లంఘించాడు ఆకాశ్! ఆ మెరుపు దాడికి జైలర్ పిస్తోలు ఎగిరి క్రిందపడింది!

వెంటనే దాన్ని హస్తగతం చేసుకోగలిగాడు ఆకాశ్. అంతే! పిస్తోలు జైలర్ కు గురిపెట్టి, ట్రిగ్గర్ నొక్కేశాడు. గావుకేకతో గుండె పట్టుకుని నేలకూలాడు జైలర్!

జైలు సిబ్బందిలో కలకలం బైలుదేరింది. ఆ అవకాశాన్ని జారవిడవకుండా, చాటుమాటున నక్కుతూ, సింహద్వారాన్ని సమీపించారిద్దరూ. అక్కడి కాపలా సిబ్బందిపై పిస్తోలు కాల్పులు జరుపుతూ, ఆ గందరగోళంలో గేటుదాటి, చీకట్లోపడి పరుగులంకించారు.

"జైలర్ గారు చనిపోయారు. ఆ పక్కల్ని వదలకండి. కాల్చిపారెయ్యండి" వెనక సెంట్రీల అరుపులు. పరిగెత్తుకొస్తున్న బూట్ల చప్పుళ్ళు. జీపులూ, మోటర్ సైకిళ్ళూ స్టార్టవుతున్న శబ్దాలు!!

రొప్పుతూ, రోజుతూ ఎంతో ప్రయాసమీద వారికి చిక్కి ఇచ్చి, నగరం వెలపల ఓ పాడుపడ్డ ఇంటిని చేరుకోగలిగారిద్దరూ. మొండిగోడలమధ్య కూలబడి, ఎంతోసేపు మౌనంగా ఆయాసం తీర్చుకున్నారు.

తరవాత మెల్లిగా తలెత్తి అన్నాడు ఆకాశ్. "ఈ రాత్రి ఎలాగో వారి బారిన పడకుండా తప్పించుకోగలిగాం! తెల్లారేలోగా పోలీసులు వేటకుక్కల్లా మన కోసం గాలించడం ప్రారంభిస్తారు. పత్రికల్లో మన ఫోటోలు పడితే, ఆటు సామాన్య పౌరులు కూడా మన

పాలిట ప్రమాదకరంగా పరిణమిస్తారు. ఏం చేద్దాం?"

"భయపడకు బ్రదర్! పోలీసుల గాలి అటుంచి, నీపైన ఈగ గాలికూడా సోకకుండా కాపాడే పూచీ నాది. సరేనా?"

"అదే, ఎలా అని?"

"చెప్పక తప్పదన్నమాట! సరే, అలీబాబా నలభై దొంగల గురించి విన్నావా నువ్వు?"

నవ్వాడు ఆకాశ్. "నేనే ఏమిటి? ప్రపంచంలోని ప్రతివాడూ వినివుంటాడా కథ!"

"ఆ కథ గురించి కాదు నేననేది. అలీబాబా నలభై దొంగలనే పేరుతో ఈ మధ్య ఓ ముఠా పెద్ద పెద్ద బ్యాంకుల్ని, రైళ్ళనీ, ఇళ్ళనీ దోచుకుంటూ, పెద్ద ఎత్తున స్మగ్లింగ్ కార్య కలాపాలు చేస్తూ, ఇంతవరకూ పట్టు బడకుండా దేశంలో తీవ్ర సంచలనం రేపుతోందే? దాని గురించి మాట్లాడుతున్నాను."

"అదా! తెలుసు! ఏం? దానికీ, నీకూ యేమిటి సంబంధం?"

"నేను ఆ ముఠాలోని ఒక సభ్యుణ్ని!"

దిగ్భ్రాంతితో ఆకాశ్ కళ్ళు విప్పారాయి. "మరి జైల్లో ఎలా పడ్డావ్?"

"ఖర్మకాలి! ఓ అర్ధరాత్రి సముద్రం ఒడ్డున స్మగ్లింగ్ సరుకులతో చేరిన లాంచీలోంచి సరుకుల పెట్టెలు దింపు తుండగా, పెద్ద ఎత్తున పోలీసులు దాడి చేశారు మామీద. ఆ పోరాటంలో ఓ సభ్యుడు మరణించాడు. నేను గాయ పడి నేల కొరిగాను. మిగతా సభ్యులు తప్పించుకో గలిగారు.

మా ముఠా రహస్యాలు చెప్పమని పోలీసులు ఎంత

హింసించినా నేను నోరు విప్పలేదు. మా ముఠా నాయకుడి పేరు అలీబాబా! అతని అసలు పేరేమిటో, మనిషి ఎలా వుంటాడో కూడా మేమెరగం!

అంతే కాదు. సాటి సభ్యుల మొహాలుగానీ, పేర్లుగానీ పరస్పరం ఎవరికీ తెలీవు. అందరూ ముసుగుల్లోనే కలిసి పనిచేస్తారు. అందరూ నెంబర్లతోనే పిలవబడతారు. అందులో నెంబర్ వన్ అలీబాబా కుడిభుజం! నెంబర్ టూ ఆయన ప్రియురాలు మర్జీనా!!

సభ్యులందరివద్దా పాకెట్ ట్రాన్స్‌మీటర్లుంటాయి. కావలసిన సభ్యుల్ని ముఠా స్థావరానికి పిలిపించాలనుకున్నప్పుడు అలీబాబా పిలుపు వినిపిస్తుంది వాటిలో. వెంటనే స్థావరానికి వచ్చి, తన ఆదేశాలు అందుకోమని. ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప నలభైమంది ఒక్కసారి ఎప్పుడూ స్థావరంలో గుమిగూడరు.

నలభైమందికి మించి ఎట్టి పరిస్థితిలోనూ ముఠాలో ఒక సభ్యుణ్ని కూడా ఎక్కువ చేర్చుకోరు. అందులో సభ్యత్వం అంత సులభంగా దొరికేది కాదు. అసమాన ధైర్యసాహసాలూ, తెలివితేటలూ, తెగింపూ వున్నవారికే అందులో స్థానం లభిస్తుంది. ఎవరైనా శాశ్వతంగా జైలుపాలైతే, లేదా పోలీసు కాల్పుల్లో మరణిస్తే ఆయా ఖాళీల్లో కొత్త సభ్యుల్ని చేర్చుకుంటారు.

అంతకిమించి సభ్యుల సంఖ్య ఎట్టి పరిస్థితిలోనూ నలభైకి దాటదు. మరణించిన, లేదా జైలుపాలైన సభ్యుల కుటుంబాలకు వారి జీవిత పర్యంతమూ పెద్ద సంఖ్యలో పెన్షన్ ముడుతూ వుంటుంది. అందుకే, పట్టుబడ్డ సభ్యులెవ్వరూ ప్రాణం పోయినాసరే ముఠా రహస్యాలు పోలీసులకు చెప్పరు.

చాలా కఠినమైన నియమాలూ, క్రమశిక్షణా వున్నాయి మాకు. యెవరైనా వాటి నతిక్రమిస్తే ఇక మరణమే శరణ్యం! జైల్లోంచి తప్పించుకోడానికి నువ్వు చూపిన తెలివితేటలూ, ధైర్యసాహసాలు నన్ను ప్రభావితుణ్ణి చేశాయి.

అలీబాబా నీ వంటి వ్యక్తిని ముఠాలో చేర్చుకోడానికి ఏమాత్రం వెనుదీయడు. ఎలాగూ మరణించిన సభ్యుడి స్థానం ఒకటి ఖాళీగానే వుండనే వుందిప్పుడు" చెప్పాడు భగీరథ్.

"నన్ను ఆ దొంగల ముఠాలో చేరమంటావా?"

"చేరక ఏం చేస్తావ్? ఎక్కడ, యెన్నాళ్ళని దాక్కుంటావ్? పట్టుబడ్డావంటే, జైలర్ని చంపిన నేరానికి నీకు మరణశిక్ష తప్పదు. అప్పుడు నీ తల్లీ, చెల్లీ ఏం కాను? ప్రతీకారం సంగతి ఆలోచించావా? నా మాట విను. రూపంలో కొద్దిగా మార్పులు చేసుకుని నిక్షేపంగా మా ముఠాలో చేరిపో!"

ఆలోచనలో పడ్డాడు ఆకాశ్. రెండు నిమిషాల తరవాత తలూపి, "సరే, నన్ను అలీబాబా దగ్గరికి తీసికెళ్ళు. తెల్లవారకముందే మనం అక్కడికి చేరడం మంచిది."

"గుడ్! వెరీగుడ్. పద!" అన్నాడు భగీరథ్ లేస్తూ.

## 8

ఆ అడవిలో ఎటు చూసినా రాతి కొండలు. చెట్లూ చేమలు.

ఓ కొండ అంచువద్ద ఆగిపోయాడు భగీరథ్.

ఆశ్చర్యంతో చుట్టూ కలయజూశాడు ఆకాశ్. "ఎక్కడ మీ స్థావరం? కొండరాళ్ళు తప్ప ఇక్కడ

ఏమీ కనిపించడంలేదే!"

భగీరథ్ నవ్వి—"మనం నిల్చున్నది స్థావరం ముఖ ద్వారంముందే! చూడు, ఇప్పుడేం జరుగుతుందో!" అంటూ కొండ అంచును చూస్తూ, "తెరుచుకో..సుమ్..సుమ్..." అన్నాడు మూడుసార్లు.

మరుక్షణం కొండ మధ్య భాగం సరసర చప్పుడుతో షట్టర్ తొలిగినట్టు పక్కకి జరిగి గుహామార్గం ఏర్పడింది. రమ్మన్నట్టు తలూపి గుహలో ప్రవేశించాడు భగీరథ్. లోనికెళ్ళాక వెనుదిరిగి, "మూసుకో...సుమ్...సుమ్..." అన్నాడు.

మరుక్షణం ద్వారం మళ్ళా రాతిపలకతో మూసుకు పోయింది. దాని పక్కనే రిఫ్రిజిరేటర్ని పోలిన ఓ యంత్రం నిలబెట్టి వుంది. భగీరథ్ దానివైపు చూపుతూ, "ఇది కంప్యూటర్! గుహ ద్వారం తెరిచేదీ, మూసేదీ అదే! అలీబాబాతోబాటు, నలభైమంది సభ్యుల కంఠా లన్నీ టేప్ చేసి అందులో పొందుపర్చి వున్నాయి.

ఇతర్లు అరిచి గీపెట్టినా సరే, ద్వారం తెరుచుకోదు! నలభైమంది సభ్యుల్లో ఎవరైనా శాశ్వతంగా జైలుపాల వడంగానీ, చనిపోవడంగానీ జరిగితే, కంప్యూటర్లోంచి వారి కంఠాలు తొలగించి, కొత్త సభ్యుల కంఠాలు పొందుపరుస్తారు. పద!" అంటూ గుహ లోపలికి నడిచాడు.

చాలా విశాలంగా ఉంది లోపల. ముందుకు సాగు తున్నకొద్దీ ఇంకా అనేక గదుల్లాటి గుహలు ఎదురౌ తున్నాయి. 'నో అడ్మిషన్' అనే ప్లేటు తగిలించి వున్న ద్వారంముందు ఆగిపోయాడు భగీరథ్.

"ఇక్కడే నిల్చో! యిప్పుడే వస్తాను" అంటూ

ఆకాశ్ ని బైట నిలబెట్టి లోనికి నడిచాడు.

పది నిమిషాల తరవాత తిరిగివచ్చి, "ఊహించని విధంగా నన్ను చూసి నిర్ఘాంతబోయారు అలీబాబా! జైల్లోంచి నేను తప్పించుకోడానికి సహాయపడ్డ నీ గురించి చెప్పాను. వెంటనే పిల్చుకు రమ్మన్నారు. నిన్ను తప్ప కుండా ముఠాలో చేర్చుకుంటారనే గట్టి నమ్మకం ఉండ బట్టే నీ కళ్ళకు గంతలు కట్టకుండా ఇక్కడికి తీసు కొచ్చాను. పద!" అన్నాడు తిరిగి లోనికి నడుస్తూ.

అతని వెనక అందులో ప్రవేశించి ఆశ్చర్యపోయాడు ఆకాశ్. ఎటు చూసినా గోడల్లో చిత్ర విచిత్రమైన ఎలక్ట్రానిక్ పరికరాలూ, టెలివిజన్ స్క్రీన్ లూ పొందు పర్చి వున్నాయి. ఎదురుగా స్టేజిలాంటి ఎత్తైన అరుగు పై విశాలమైన బల్ల. దానిపై రకరకాల పరికరాలూ, మైక్ లూ అమర్చి వున్నాయి. బల్లకవతల ఈజీ ఛేర్లో కూర్చున్నా డతను.

ఒళ్ళంతా సూపర్ మాన్ ని పోలిన నల్లని ముసుగు. కదిలే అతని కళ్ళు తప్ప మరేమీ కనిపించడంలేదు. "యూ ఆర్ వెల్ కమ్ జంటిల్ మన్!" గుహలో మారు మోగింది అలీబాబా కంఠం.

"జైల్లో మగ్గుతున్న మా సభ్యుణ్ని చాకచక్యంతో విడిపించిన నీ ధైర్యసాహసాలు నన్ను ముగ్ధుణ్ని చేశాయి. నీవంటి పరాక్రమశాలులే మా సంఘానికి కావలసింది.

మీరిద్దరూ ఈ దుస్తులు విడిచి, బ్లాక్ డ్రెస్ లు ధరిం చండి. భగీరథ్! నువ్వు పాత సంఖ్యతో నే వ్యవహరించ బడతావు. ఇతని నెంబర్ ముప్పైమూడుగా వ్యవహ రించబడతాడు" అన్నాడు.

తర్వాత కంప్యూటర్ కోసం ఆకాశ్ కంఠాన్ని రికార్డు

చేసి, "మీ నూతనాగమనాన్ని ఒక వినూతన పనితో ప్రారంభించాలను కుంటున్నాను. ఈ రోజు రాత్రి రెండు గంటలకు సింగపూర్ నించి ఓ నౌక మన స్మగ్లింగ్ సరుకులతో సముద్రం మధ్యకు రాబోతోంది.

చీకటి పడగానే మీరిద్దరూ సముద్ర తీరంలోని మన ప్రత్యేక ప్రదేశానికి చేరుకోవాలి. అక్కడ మీకోసం ఓ లాంచీ యెదురుచూస్తూ వుంటుంది. అది యెక్కి సముద్రంలో ఈశాన్య దిశగా ప్రయాణం ప్రారంభించాలి. చాలా దూర ప్రయాణం!

సముద్రం మధ్య ఆ నౌక ఎదురుపడగానే అందులోని సరుకులు లాంచీలోకి చేర్చి, తెల్లవారేలోగా మళ్ళీ తీరానికి చేరాలి. అర్థమైందా?"

తలూపాడు భగీరథ్ వినయంగా!

# 9

"టైమ్ ఎంతవుతోంది?" అడిగాడు ఆకాశ్ చీకట్లో చుట్టూ కలయజూస్తూ.

లాంచీ నడుపుతున్న భగీరథ్ రిస్టువాచీ చూసుకుని, "రెండు గంటలు!" అన్నాడు.

మొత్తం ఎనిమిది గంటల ప్రయాణం! అదీ శర వేగంతో, సముద్రంలో ఎంత దూరం వచ్చారో వారికే తెలీదు.

"అదుగో వెలుగు!" అన్నాడు ఆకాశ్, చిమ్మ చీకట్లో దూరాన మిణుకు మిణుకు మంటున్న వెలుతురు చూపుతూ.

భగీరథ్ అటు పరీక్షగా చూసి, లాంచీ యింజన్ ఆఫ్ చేశాడు. "పద, డెక్ మీదికెళ్ళి చూద్దాం!" అన్నాడు బైనాక్యులర్స్ అందుకుంటూ.

ఇద్దరూ కేబిన్ లోంచి డెక్ మీదికెళ్ళి, లాంచీ అంచు దగ్గర నిల్చున్నారు. భగీరథ్ కాసేపు దైనాక్కులర్లోంచి చూసి, ఆకాశ్ కందించాడు వాటిని. వెలుగు కని పిస్తున్నవైపు చూడసాగాడు ఆకాశ్. అంతే! వెనక నించి ఒక్క తన్ను తన్నాడు భగీరథ్! జరిగిందేమిటో తెలిసేలోపలే బ్యాలన్స్ తప్పి సముద్రంలో పడిపోయాడు ఆకాశ్.

సముద్రంలో పడ్డ ఆకాశ్ నీటిలో మునుగుతూ, తేలుతూ గట్టిగా అరవసాగాడు. "భ.... గీ....ర....థ్! భ....గీ....ర....థ్!!"

లాంచీ ఆగలేదు. వెనుదిరిగి చూడలేదు. నీటిని చీల్చు కుంటూ సాగిపోతోంది శరవేగంతో. కన్ను మూసి తెరిచేలోగా అదృశ్యమైపోయింది దృష్టినించి!

భయభ్రాంతులతో గిరగిర తిరగసాగింది ఆకాశ్ బుర్ర! ప్రాణాలకు తెగించి, జైల్లోంచి తప్పించిన తనని మాయమాటలతో నమ్మించి, నట్టేట్లో ఎందుకుదోశాడో భగీరథ్? తను చేసిన అపరాధం ఏమిటి? ఉపకారానికి ప్రతిఫలం ఇదేనా?

ఎటు చూసినా జలమయం కనిపించని గాఢాంధ కారం! ఎంతటి గజ ఈతగాడైనా నడి సముద్రంలో ఎంతసేపని ఊపిరి పీల్చుకోగలడు? తన జీవితం పరి సమాప్తమయ్యే సమయం ఆసన్నమైందా? మనిషి చచ్చినా, మనసులోని ఆశ చస్తుందా?

కాళ్ళూ, చేతులూ ఆడిస్తూ, ఇంకా దూరాన మిణుకు మిణుకు మంటున్న వెలుగువైపు ఆశగా చూడసాగాడు ఆకాశ్. ఏమిటది? నౌకేనా? మరి చలనం లేదేం? శబ్దం రాదేం? యేమైనా సరే, ఊపిరున్నంతలో అక్కడికి

చేరడం ఉత్తమం!

ఈదడం ప్రారంభించాడు ఆకాశ్. కాసేపు బోర్లా, కాసేపు వెల్లికిలా ఈదుతూ అతి కష్టంమీద అక్కడికి చేరి, నిర్ఘాంతపోయాడు. అది నౌక కాదు. ద్వీపం! చెట్లూ చేమలతో నిండి వున్న ద్వీపం! చెవులు చిల్లులుపడే కీచురాళ్ళ రొద!

చెట్ల ఆకుల మధ్యనించి ఓ ఎత్తయిన ప్రదేశంలో కనిపిస్తోంది ఆ వెలుగు. ఏమిటది? మానవ నివాసమా? అదే నిజమైతే తను బ్రతికి బట్టకట్టినట్టే. అనుకుంటూ చెట్లూ చేమల్ని చీల్చుకుంటూ ముందుకు సాగాడు.

అరగంట తరవాత ఆ వెలుగును చేరి నివ్వెరపోయాడు. రాతితో కట్టిన, అతి పురాతనమైన భవనం అది! భవనం నాలుగు వైపులా ఎత్తయిన బురుజులు నిర్మించి వున్నాయి. పై అంతస్తులోని కిటికీగుండా కనిపిస్తోంది ఆ వెలుగు!

భవనం ముఖద్వారం మూసి వుంది. నేలమీంచి రాయందుకుని, గట్టిగా తట్టాడు. లోపల ఎవ్వరో నడిచి వస్తున్న అడుగుల సవ్వడి. తలుపువద్ద ఆగిపోయింది శబ్దం! గడియతీస్తున్న చప్పుడు, పెద్ద చప్పుడుతో తెరుచుకుంది తలుపు.

వేరొకరైతే ఆ వ్యక్తిని చూసి, గుండెలవిసి గావుకేక పెట్టేవారే! భయంతో నాలుగడుగులు వెనక్కి వేశాడు ఆకాశ్! ఆరున్నర అడుగులకన్నా పొడవే వుంటాడతను. ఒళ్ళంతా దట్టమైన రోమాలు. విశాలమైన ఛాతీ, భుజాలవరకూ వేలాడే చింపిరి జుత్తు. చింపాంజీని పోలిన మొహం!

వానరాకృతిలో వున్న ఆ నరుడి చేతిలో తనవైపు గురిపెట్టి వున్న పిస్తోలు చూడకుంటే ఆ కాల్తిని నిజంగా

ఓ విచిత్ర వ్యాగమే అనుకునేవాడు. "నేను మీ శత్రువును కాను. సముద్ర దుర్ఘటనకు లోనై మీ సహాయంకోసం ఇక్కడకు వచ్చాను" అన్నాడు గుండె చిక్కబట్టుకుని.

ఆ భీకరాకారుడు పలకలేదు. సరికదా, కన్నార్పకుండా చూస్తూ రాతిబొమ్మలా నిల్చున్నాడు.

అంతలో — "స్లోబో! ఎవరొచ్చారు?" అన్న కంఠం వినిపించింది వాడి వెనకనించి.

వెంటనే వాడు గుమ్మాని కడ్డం తొలిగాడు. లోన కనిపించిన వ్యక్తిని చూశాక ఆకాశ్ ప్రాణం లేచి వచ్చింది. సుమారు అరవై ఏళ్ళ వృద్ధుడతను. వెండిలా పండిన తల. కనుబొమలూ, మీసాలూ కూడా అలాగే తెల్లబడ్డాయి. పాదాలవరకూ జీలాడే ఖరీదైన స్లీపింగ్ గౌన్. నోట్లో పొగలు చిమ్ముతున్న పైపు.

ఆకాశ్‌ని చూసి అతని కనుబొమలు ముడిపడ్డాయి. "ఎవరు బాబూ నువ్వు? ఎలా వచ్చావిక్కడికి?" అడిగాడు ఆప్యాయంగా.

చెప్పాడు ఆకాశ్ తన దీన గాథ. వృద్ధుడు సాలోచనగా తలూపి, "భయపడకు! రా లోపలికి. వీడి పేరు స్లాబో! మూగవాడు. నా సేవకుడు. నా పేరు తేజ— ధర్మతేజ! వాడి విచిత్రాకారం చూసి భయపడ్డావు కదూ?

చాలా ఏళ్ళ క్రితం ఓ ప్రయాణీకుల ఓడ తుఫానులో చిక్కుకుని, ఈ వైపు కొట్టుకువచ్చి తునాతునకలైంది. అందులోని ఒక స్త్రీ స్పృహలేని స్థితిలో వుంటే, కొన్ని మగ చింపాంజీలు ఆమెను రక్షించి, జతకట్టాయి. దాంతో వారికి ఈ వానరాకారుడు జన్మించాడు.

నేనిక్కడికి వచ్చినప్పుడు వీడు చాలా చిన్నవాడు.

నా ప్రాపకంలోనే ఇంతటి వాడయ్యాడు. రా లోపలికి" అన్నాడు.

లోన అడుగు పెట్టాడు ఆకాశ్. అక్కడక్కడా లావుపాటి కొవ్వొత్తులు వెలుగుతున్నాయి. సాధారణంగా అటువంటి భవనాల్లో గోడలకు అందమైన పెయింటింగ్ లూ, చిత్రపటాలూ వేళాడుతూ కనిపిస్తాయి. కానీ, ఎటు చూసినా, రకరకాల జంతువుల తలలూ, చర్మాలే వేళాడదీసి ఉన్నాయక్కడ.

వృద్ధుణ్ని అనుసరిస్తూ మేడ మెట్లెక్కి పైకి చేరుకున్నాడు.

"సిటీలో బాగా తడిసి పోయావు. జలుబు చేస్తుంది. ముందు పొడి బట్టలు మార్చుకో నాయనా! తరవాత తీరిగ్గా కూర్చుని మాట్లాడుకుందాం!" అంటూ స్లాబో వైపు తిరిగి, సైగలతో ఆదేశాలిచ్చాడు తేజ.

తన వెంట రమ్మన్నట్టు తలూపి, ఓ గదిలోకి నడిచాడు స్లాబో. ఆధునిక జీవనానికవసరమయ్యే అన్ని హంగులూ అమర్చి వున్నాయక్కడ. బీరువా తెరిచి, ఓ చారల పైజామా, చొక్కా, స్లీపింగ్ గౌన్, టవల్ తీసి అందించాడు స్లాబో.

# 10

తల తుడుచుకుని, బట్టలు మార్చుకుని, తిరిగి వాడి వెంట పక్క గదిలోకి నడిచాడు ఆకాశ్. ఖరీదైన డైనింగ్ టేబిల్, దానిపై రకరకాల తినుబండారాలూ అమర్చి వున్నాయక్కడ. ఓ కుర్చీలో యెదురుచూస్తున్నాడు తేజ.

"రా నాయనా! కూర్చో! సాటి మనుషులతో సంపర్కం లేక, ఏకాంత వాసంతో నేను చాలా విసుగెత్తి

పోయాను. దారి తప్పి యెవరైనా ఇక్కడికి వస్తే ఆ రోజు నాకు పండుగే. ముందు రెండు పెగ్గులు విస్కీ పుచ్చుకుని, తనివిదీరా మాట్లాడుకుందాం!" అంటూ రెండు గ్లాసుల్లో విస్కీ పోశాడు ధర్మతేజ.

కాదనడం మర్యాదగా వుండదని, గ్లాసందుకున్నాడు ఆకాశ్. "నడి సముద్రంలో ఉన్న ఈ ద్వీపంలో ఇంత పెద్ద భవనం వుందంటే, ఇంకా పెద్ద సంఖ్యలో జన వాసం ఉండివుండా లిక్కడ!"

వృద్ధుడు నవ్వి—"నో, నో! ఇక్కడ నేనూ, స్లాబో తప్ప మరో మానవుడు నివసించడు. ఈ భవనం కూడా నేను కట్టించింది కాదు. యెప్పుడో రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జర్మన్లు తమ యుద్ధ నౌకల కమాండ్ హెడ్ క్వార్టర్ కోసం కట్టుకున్నారు దీన్ని!" అన్నాడు విస్కీ సేవిస్తూ.

"ఆ కారాన్ని బట్టీ, భాషను బట్టీ మీరు భారతీయులేనని తెలుస్తోంది. ఐతే, మిగతా ప్రపంచంతో సంబంధం లేకుండా, యేకాంతంగా ఈ నిర్మానుష్య దీవిలో యెందుకుంటున్నారు?" అడిగాడు ఆకాశ్.

నిట్టూర్చాడు తేజ. "అదో పెద్ద కథ నాయనా! అడిగావు గనక చెబుతా విను. ఈ ఇంటి గోడలకు వేళాడుతున్న అసంఖ్యాకమైన జంతు చర్మాలూ, తలలూ చూశావుగా? దీన్నిబట్టి వేటంటే నాకెంత ప్రాణమో, అందులో ఎంత అనుభవం గడించానో అర్థం అయివుంటుంది నీకు?

బాల్యంనించే నాకా పిచ్చి వుంది. రచయితలకు ఏదో ఒకటి రాయందే ఎలా తోచదో, చిత్రకారులకు ఏదో ఒకటి గీయందే ఎలా ఊబుసుపోదో, అలాగే నాకూ ఏదో

ఒక పక్షినీ, జంతువునీ వేటాడందే నిదరపట్టేది కాదు. ఆ వ్యాపకంలో నేను తిరగని అడవిలేదు. గాలించని ప్రదేశంలేదు.

అలా నలభై ఏళ్ళు వచ్చేసరికి ఆ వేటపట్ల నాకు మొహం మొత్తింది. విసుగు పుట్టింది! రచయితలూ, కవులూ, చిత్రకారులూ సంగీత ప్రియులూ తమ తమ కళల్లో వినూతన ప్రయోగాలు చేస్తూ, కొంగ్రొత్త పుంతలు తొక్కుతూ ఎలా సంతృప్తి పడతారో, అలాగే నా వేటలోనూ నేనొక వినూతన పద్ధతి ప్రారంభించి ఆనందాన్ని పొందసాగాను."

"ఏమిటా పద్ధతి?" అడిగాడు ఆకాశ్!

"నేను వేటాడదలచుకున్న ప్రాణిలో అత్యంత తెలివి తేటలూ, అపార ఆలోచనా శక్తీ, తననితాను కాపాడు కోగల జిత్తులూ ఉండితీరాలి. ఈ లోకంలో అటువంటి శక్తియుక్తులుగల ప్రాణి మనిషే కదా?"అన్నాడు తేజ నవ్వుతూ.

షాక్ తగిలినట్టు మ్రాన్పడిపోయాడు ఆకాశ్!

"ఎప్పుడైతే నాకా నూతనాలోచన వచ్చిందో ఒంటరిగా కనిపించే ప్రతి మనిషినీ వేటాడి నరకయాతన పెట్టి చంపసాగాను. అందులో లభించే ఆనందమే వేరు."

అదేదో అతి సామాన్య విషయమైనట్టు మాట్లాడు తున్న అతని మాటలు విని, ఝల్లుమంది ఆకాశ్ ఒళ్ళు.

"నాగరిక లోకంలో యెంతకాలం సాగుతుంది ఆ వేట? దేశ పోలీసులంతా ఏకమై నిద్రాహారాలు మాని నాకోసం గాలించసాగారు. దాంతో అక్కడుండటం క్షేమదాయకంకాదని, నడి సముద్రంలో నిర్మానుష్యంగా వున్న ఈ ద్వీపానికి చేరి తలదాచుకుంటున్నాను.

అడుగడుగునా అనేక ఊబులతో, ప్రమాదకర విష సర్పాలతో, జంతువులతో నిండిన ద్వీపం ఇది. అందుకే ఈ వైపు యెవ్వరూ రారు. కొత్తలో నేనూ అనేక ఇబ్బందులు పడ్డాను. తరవాత అన్నీ అలవాటయ్యాయి. ఐతే, నా రక్త పిపాసను చంపుకోలేక, కనిపించిన ప్రతి విష సర్పాన్నీ, క్రూరమృగాన్నీ చంపుతూ కాలక్షేపం చెయ్యసాగాను.

అప్పుడప్పుడూ సముద్ర తుఫానుల్లో చిక్కుకున్న ఓడల సిబ్బందీ, ప్రయాణీకులూ, చేపలు పట్టే జాలరులూ ఈ వైపుకు వస్తుంటారు. వారిని వేటాడి చంపడంలో నాకు లభించే ఆనందం అంతా ఇంతా కాదు.

ఈ ఏకాంతంలో నా తిండి తిప్పలూ, అవసరాలూ చూడడానికి ఓ మనిషి కావాలి గనక స్లాబోను చంపే ఉద్దేశమే నాకు లేదు. నెలకోసారి మా క్కావలసిన సరుకులూ, బట్టలూ, ఇతర వస్తువులూ హెలికాప్టర్లో పంపిస్తారు మా వాళ్ళు. అది పైనించే సరుకులు జారవిడిచి వెళ్ళిపోతుంది!"

"ఐతే, అందరిలాగే నన్ను కూడా...." వణికింది ఆకాశ్ కంఠం.

ధర్మతేజ నవ్వి—"తప్పుతుందా నాయనా! నీలాంటి ఆరోగ్యవంతుణ్ణీ, యువకుణ్ణీ వేటాడటంలో లభించే ఆనందాన్ని ఎలా వదులుకోమంటావు చెప్పు?" అన్నాడు.

"కిరాతకుడా! నువ్వు మనిషివి కావు. ఏ అపకారమూ చెయ్యని సాటిమనుషుల్ని చిత్రవధ చేసే నువ్వు రాక్షసుడి కన్నా అధముడివి" అన్నాడు ఆకాశ్ ఆవేశం ఆపుకోలేక.

వేరొకరైతే ఆ మాటలను ఆగ్రహించేవారే. కానీ, తేజ చాలా నింపాదిగా నవ్వుతూ, తల అడ్డం తిప్పి, "పొరబడుతున్నావు నాయనా! ఏ మనిషినీ నేను వున్న పళాన చంపను. నా బారినించి కాపాడుకోడానికీ, ఈ ద్వీపంనించి తప్పించుకోడానికీ మూడు రోజులు వ్యవధి ఇస్తాను.

ఉదయం నువ్వు నిద్రలేవగానే మూడు రోజులకు సరిపడే డ్రైఫుడ్ బ్యాగులో నింపి, పెద్ద సైజు వాటర్ కేరియర్లో మంచినీళ్ళు నింపి, యివ్వబడతాయి నీకు. అలాగే, విష సర్పాలనించీ, క్రూరమృగాలనించీ నిన్ను నువ్వు కాపాడుకోడానికి పెద్దసైజు కత్తికూడా యివ్వబడుతుంది.

నాకు చెందిన వేట వాటి పాలబడి మరణించడం నాకిష్టం వుండదు. పగటిపూట నానుండి నీకే ఆపదా రాదు. చీకటిపడ్డ తరవాతే రైఫిల్తో నిన్ను వేటాడ డానికి బైలుదేరతాను. పగలంతా నువ్వు చాలా స్వేచ్ఛగా ద్వీపంలో తిరుగుతూ నిన్ను రక్షించుకునే మార్గాలు అన్వేషించవచ్చు. రాత్రిపూట నా కంట పడ్డావా, నీ మరణాన్ని యే శక్తీ ఇక ఆపజాలదు!" అన్నాడు.

"మూడు రోజుల వరకూ నీ కంట బడకపోతే?"

"విజయం నీదే! ఐతే, అలా జరగడం సాధారణంగా అసంభవం! ఇది చాలా చిన్న ద్వీపం! కాస్త తెలివిగల వారైతే మొదటి రాత్రి నానించి తప్పించుకోవచ్చు. ఇంకాస్త బుద్ధిగలవారైతే రెండో రోజుకూడా తప్పించు కోగలరు. మూడో రోజు కూడా తప్పించుకున్నవాళ్ళు బహు అరుదు.

అదేజరిగితే, బేషరతుగా నా ఓటమి ఒప్పుకుని, నాలుగో

రోజు సూర్యోదయంతో నిన్ను సగౌరవంగా విడిచిపెడ్తూ, నీకు సహాయంగా లైఫ్ బోట్ ఇస్తాను. సామాన్యంగా మొదటి రాత్రే నా వేటకుక్కలు వాసనచూస్తూ నువ్వెక్కడ దాక్కున్నావో ఇట్టే పసిగట్టేస్తాయి."

"వేటకుక్కలా?" భయంతో పెద్దవయ్యాయి ఆకాశ్ కళ్ళు.

"ఔను. నా వద్ద అత్యంత ప్రమాదకరమైన ఆరు మేలుజాతి వేటకుక్కలున్నాయి. నా తుపాకీ గుళ్ళు మనిషిని వేటాడిన మరుక్షణం అవి ఆ శవాన్ని చీల్చి చెండాడి ఆవురావురుమంటూ ఆకలి తీర్చుకుంటాయి. అబ్బ! ఆ దృశ్యం చూసితీరాల్సిందే! మాటలతో చెప్పడం నా తరంకాదు."

ఆకాశ్ యువక రక్తం ఒక్కసారి రొుగజిమ్మింది గుండెలోకి. ఆ నరరూప రాక్షసుణ్ని పచ్చడి చేయాలన్న ఆవేశంతో మెరుపులా లేవబోయాడు.

"ఆగు నాయనా! తొందరపడక! ఆవేశం నీకే అనర్థం! అదుగో, తలుపు దగ్గర సిద్ధంగా నిల్చున్న స్లాబోను చూడలేదా? వాడి సంగతి నీకు తెలీదు. నాకైనా కవంత జాలీ, దయా, నియమం వున్నాయి. వాడిలో అవి పిసమెత్తు కూడా లేవు. మృగంకన్నా క్రూరుడు. జాగ్రత్త! మళ్ళీ అటువంటి పిచ్చివేషాలేం వెయ్యక! ఇప్పటికే బాగా పొద్దుపోయింది. వెళ్ళి పడుకో.

ఇంత రాత్రి వరకూ మేము ఎందుకు మేల్కొనున్నా మనుకున్నావు? నిన్న ఓ జాలరి ఈదురుగాలికి దారితప్పి, పడవ బోల్తాపడి, ఈ వైపు కొట్టుకు వచ్చాడు. ఈ రోజు వాణ్ని వేటాడే తొలి రాత్రి! వేటకు బైలుదేరబోతుంగా నువ్వు వచ్చావు" అంటూ స్లాబోవైపు తిరిగి సౌజ్ఞలతో

ఆదేశా లిచ్చాడు తేజ.

వాడు ఆకాశ్ వైపు చూస్తూ తనవెంట రమ్మనట్టు సైగచేశాడు. నిర్జీవ ప్రతిమలా లేచి, వాణ్ని అనుసరించాడు ఆకాశ్. గెస్టు రూంలో అడుగుపెట్టిన మరుక్షణం దభాలున తలుపు మూసి బైట గడియపెట్టాడు స్లాబో. ఆకాశ్ గుండె గుభిల్లుమంది!

పక్కమీద వాలాడేగాని, ఓ పట్టాన నిదరపట్టడం లేదు. రాబోయే విపత్తును ఎలా ఎదుర్కోవాలి? ఎలా? ఎలా? యెడతెగని ఆలోచనలతో వేడెక్కుతోంది బుర్ర. బైట కుక్కలు మొరగడం వినిపించింది. అంటే, ఆ కిరాతకుడు మానవవేటకు బైలుదేరతున్నాడన్నమాట!

క్రమక్రమంగా కుక్కల అరుపులు దూరం కాసాగాయి. అలసటవల్ల కొద్దిగా కునుకుపట్టింది ఆకాశ్ కు. ఎక్కడో "ఢాం!" మనే శబ్దంతో త్రుళ్ళిపడి కళ్ళు తెరిచాడు. కిటికీగుండా తూరుపు దిక్కున తెలతెలవారుతోంది. అంటే, ఆ అమాయక జాలరివాడు తుపాకీ గుండుకు బలైపోయాడన్నమాట! వేటకుక్కలు విందు చేసుకుంటున్నాయన్నమాట. ఆకాశ్ ఒళ్ళు జలదరించింది.

## 11

గదిలో కాలకృత్యాలు తీర్చుకున్నాక, తలుపు తెరిచి, అతన్ని డైనింగ్ రూంలోకి తీసికెళ్ళాడు స్లాబో!

"రా నాయనా, రా! అదేమిటి? రాత్రి నిద్రపోలేదా? మొహమంతా పీక్కుపోయిందే? ఆ జాలరి వెధవను వేటాడ్డం దండగే అయింది. ఏ మాత్రం మజా రాలేదు. చాలా సులభంగా దొరికిపోయాడు. ఎటువంటి ప్రతిఘటనా లేకుండా చచ్చి వూరుకున్నాడు.

సరే, కూర్చో! ఈ పూట నాతో విందారగించి, నీ దారి చూసుకో. చీకటిపడ్డాక ప్రారంభమౌతుంది నీ పరీక్ష! నీ అదృష్టం, నా అదృష్టం ఎలా వుందో అప్పుడే తేలుతుంది" అన్నాడు ధర్మతేజ నవ్వుతూ.

గుండె కృంగిపోతోంటే ఏం తినగలడు? ఇంత ఎంగిలి పడి, చేతులు కడుక్కున్నాడు ఆకాశ్. అన్నట్టే తినుబండారాలు నింపిన ఓ సంచీ, పెడల్పాటి, పొడవాటి ఓ కత్తీ అతని కందించి, "ఊc!" అన్నాడు స్లాబో! తలుపులు వైపు చూపుతూ.

అంతే! మెరుపులా ఒరలోంచి కత్తిలాగి, వాడిమీద లంఘించాడు ఆకాశ్! అతను వేసే ప్రతివేటునూ లాఘవంగా తప్పించుకుంటూ, పంజా దెబ్బలుతీస్తూ ఎట్టకేలకు ఆకాశ్ చేతిని మెలివేసి, లొంగదీశాడు స్లాబో! ఆయాసంతో వాడి శ్వాస ఎగిసి పడుతోంది. చింపాజీలా ఘీంకారిస్తున్నాడు.

పైపు తాగుతూ నింపాదిగా ఆ దృశ్యం తిలకిస్తున్న ధర్మతేజ నవ్వి — "ముందే చెప్పానుకదా నాయనా! వాడిముందు నీ శక్తియుక్తులేవీ పనికిరావని. తలచుకుంటే అరక్షణంలో వాడు నీ శరీరాన్ని నజ్జుచెయ్యగలడు. ఆ విధంగా నా రక్తపిపాస నజ్జుకావడం నాకిష్టంలేదు. పిచ్చివేషాలు వెయ్యకుండా బుద్ధిగా వెళ్ళిరా!" అన్నాడు.

స్లాబో అతన్ని అలాగే తోసుకుంటూ, ఘీంకరిస్తూ ఇంట్లోంచి బైటికి తీసికెళ్ళి, అవతలికి నెట్టి, తలుపు మూసేశాడు.

ఊబులు చూసుకుంటూ జాగ్రత్తగా నడుస్తూ మధ్యాహ్నానికల్లా ద్వీపమంతా చుట్టేశాడు ఆకాశ్.

చీకటి పడకముందే తనని రక్షించుకునే ఏర్పాటు చేసుకోవాలి. ఒకచోట మొదలంటా విరిగి, మరో చెట్టు కొమ్మమీద వాలి, యెండిపోయిన లావుపాటి వృక్ష కాండం ఆకర్షించిందతన్ని. ఏ కాస్త తోసినా, అది ఆ కొమ్మ అంచుమీంచి జారి నేలకూలేలా వుంది.

ఆ రెండు చెట్ల నడుమ దట్టమైన పొదల గుబురు, ఓ మఱ్ఱిచెట్టునుండి పొడవాటి నాలుగైదు ఊడలు సేకరించి, తిరిగి ఆ చెట్టును చేరుకున్నాడు. కాండం వాలి వున్న చెట్టు ఎక్కి, జాగ్రత్తగా ఎండిపోయిన కాండం అంచుకు మఱ్ఱి ఊడలు బిగించి, కిందికి వేలాడదీసి దిగాడు.

కత్తి సాయంతో ఆ చెట్ల నడుమ పొదలముందు పొడవుగా, వెడల్పుగా గొయ్యి తవ్వడం ప్రారంభించాడు. సూర్యాస్తమయం వేళకు నాలుగడుగుల లోతు గొయ్యి తయారైంది. దానిమీద సన్నని ఎండు పుల్లలు పేర్చి, వాటిపై పచ్చని ఆకుకప్పి, గొయ్యి నానుకున్న పొదల్లో దూరి, వేళాడుతున్న మఱ్ఱి ఊడల్ని అందుబాటులో వుంచుకున్నాడు.

చీకటి పడుతున్నకొద్దీ చిత్ర విచిత్ర అరుపులతో, కతూహాలతో మారుమోగసాగింది ద్వీపం! రాత్రి నడి జాము వేళ, దూరాన కుక్కలు మొరుగుతూ వస్తున్న శబ్దం విని, కొట్టుకోనారంభించింది ఆకాశ్ గుండె. క్షణాలుగడుస్తున్నకొద్దీ కుక్కల అరుపులు దగ్గరవుతున్నాయి. చీకట్లో ఆగి ఆగి టార్చి వెలుగు కూడా కనిపిస్తోంది.

రెండు కుక్కలు నేలను వాసన చూస్తూ రానే వచ్చాయక్కడికి. వాటి వెనక తుపాకీ పట్టుకున్న

ధర్మతేజ! ఊపిరి బిగబట్టి పొదలో ఒదిగి కూర్చున్నాడు ఆకాశ్. కుక్కలు పొదను చూస్తూ గొంతెత్తి మొరుగుతున్నాయి. పొదను సమీపించిన మరుక్షణం హఠాత్తుగా, రెండూ గోతిలో పల్టీకొట్టి కూనిరాగాలు తియ్యసాగాయి.

లిప్తపాటు కుక్కలేమయ్యాయో అర్థంకాలేదు ధర్మతేజకు. అర్థమవగానే సాలోచనగా తలూపాడు. “నీ అతితెలివిని మెచ్చుకుంటున్నాను నాయనా! కుక్కల బారినించి తప్పించుకున్నావుగానీ, నా తుపాకీ గురినించి యెలా తప్పించుకోగలవు?” అంటూ టార్చి వెలుగులో జాగ్రత్తగా చూస్తూ పొదను సమీపించాడు.

అంతే! ఊడలుపట్టి గట్టిగా లాగాడు ఆకాశ్! ఎండిపోయిన చెట్టుకాండం ఫెళఫెళమంటూ కిందపడింది. తేజ మెరుపులా అవతలికి జరక్కుంటే అతని తల పచ్చడయ్యేదే! ఐనా, కుడి భుజం బాగా ఒరుసుకుపోయి రక్తం కారసాగింది.

భయంతో అతని కళ్ళు పెద్దవయ్యాయి. ఆ చెట్టు కాండం కింద కూలగానే దొర్లి ఆకాశ్ తవ్విన గోతిలో పడింది. అంతకుముందే అందులో కూరుకుపోయిన కుక్కల కూనిరాగాలు ఇప్పుడు ఆగిపోయాయి శాశ్వతంగా!

“ఆకాశ్! నీవంటి తెలివిగల వేట నా జీవితంలో చూసి యెరగను. నా రెండు కుక్కలు కోల్పోయిన దుఃఖంకన్నా ఈనాటి వేటలో లభించిన ఆనందం సదా జ్ఞాపకం వుంటుంది నాకు. నా భుజం గాయపడకుంటే, ఈ రాత్రి నీ మరణం తప్పేదికాదు. రేపు వస్తాను మళ్ళీ. గుడ్ నైట్!” అంటూ వెనుదిరిగి వెళ్ళిపోయాడు తేజ.

## 12

మర్నాడు మధ్యాహ్నానికల్లా! సముద్ర తీరంనించి, బరువుగా, సన్నగా వున్న పలకల్లాంటి రెండు రాళ్ళూ. మఱి ఊడలూ సేకరించి. ఓ చెట్టుకింద కూర్చున్నాడు ఆకాశ్. ఆ రాళ్ళతో కత్తిమొనను బాగా సానబట్టి, కత్తిపిడి కిరుపక్కలా, ఊడలతో ఆ రాతి పలకలు కట్టాడు బిగదీసి.

బ్యాగులోని తినుబండారాలు సుష్టుగా తిని, కడుపు నిండా నీళ్ళు తాగి, పొదలో దూరి పడుకున్నాడు. నిద్ర మేల్కొని చూస్తే చీకటి పడుతోంది. కత్తీ, బ్యాగూ అందుకుని, ముందే ఎన్నుకున్న ఓ వేపచెట్టు కిందికి చేరాడు. బ్యాగులోని తినుబండారాలుతీసి, అక్కడక్కడా చెట్టు కింద వెదజల్లాడు. ఆ కిరాతకుడివద్ద ఇంకా నాలుగు కుక్కలు మిగిలాయి. ఆ తినుబండారాల వాసనకు అవి తప్పకుండా ఇటే వస్తాయి!

ధర్మతేజా! ఈ రోజు నీ అంతో, నా అంతో తేలి పోతుంది. అనుకుంటూ, కత్తితో చెట్టు ఎక్కి అనుకూల మైన ఓ కొమ్మమీద కూర్చున్నాడు. నడిజాము వేళ దూరాన కుక్కల అరుపులు వినిపించసాగాయి. టార్చి వెలుగు అటూ, ఇటూ పడుతోంది.

అరుపులు దగ్గరవుతున్నకొద్దీ ఆకాశ్ గుండె దడ తీవ్రం కాసాగింది. కొమ్మ కిరుపక్కలా కాళ్ళు వేసి కూర్చుని, కత్తి మొన కిందికి పెట్టి, రెండు చేతులతో పిడిని అదిమి పట్టుకున్నాడు.

కుక్కలు దగ్గరికి రాగానే ఆశ్చర్యపోయాడు ఆకాశ్. ఒకటి కాదు, రెండు కాదు. నాలుగు కుక్కలు! అన్నిటికీ పొడవాటి గొలుసులు పట్టుకుని ప్లాబో వస్తున్నాడు

ముందు. అతని వెనక ధర్మతేజ!

బహుశా, నిన్న గాయంపడ్డందుకు ఈరోజు సహాయం కోసం స్లాబోని తోడు తీసుకొచ్చాడన్నమాట! ఈరోజు కూడా తాను గొయ్యి తవ్వి వుంటే, ఆ గోతిలో కుక్కలు పడిపోకుండా వాటికి గొలుసులు కట్టి, గోతిలో పడబోతే వెంటనే వెనక్కి లాగడానికి ఏర్పాటు చేసుకున్నారు.

ఇప్పుడేం చెయ్యాలి? పైనించి అతని తలమీద కత్తి దింపి చంపాలన్న తన పథకం తారుమారయిందే! ముందు స్లాబో పనిపట్టి, తరవాత వాడి సంగతి చూస్తే? ఆకాశ్ ఇంకా ఆలోచిస్తుండగానే స్లాబో వచ్చేశాడు చెట్టు కిందికి.

సరిగ్గా వాడి తలకు గురి చూసి, కత్తి విడిచాడు ఆకాశ్. రాళ్ళ బరువుకు సూటిగా వెళ్ళి, వాడి తలలో దిగబడింది కత్తి! గావుకేకతో దద్దరిల్లింది ద్వీపం! మొదలు నరికిన చెట్టులా నేలకూలాడు స్లాబో!

ఆ షాక్ నించే తేజ తేరుకోకముందే గబగబ చెట్టు దిగి, చీకట్లో పరుగుతీశాడు ఆకాశ్. గట్టిగా మొరుగుతూ అతని వెంటపడ్డాయి కుక్కలు. వాటి వెనక తేజ!

ముందూ వెనకా చూడకుండా చెట్లనీ, పుట్టల్నీ చీల్చుకుంటూ, పడుతూ లేస్తూ శక్తికొద్దీ పరుగుతీస్తున్నాడు ఆకాశ్.

క్షణాలు గడుస్తున్నకొద్దీ, కుక్కలకూ, అతనికీ మధ్య దూరం తరిగిపోసాగింది. కొద్దిసేపట్లో అవి అతనిమీద పడతాయనగా సముద్రతీరాన్ని చేరుకున్నాడు ఆకాశ్. ఎత్తయిన బండరాళ్ళు నిండి వున్నాయక్కడ. ఓ రాతి మీద యెక్కి సముద్రంలో దూకేశాడు ఆకాశ్.

రొప్పుతూ, రోజుతూ పక్కలతో అక్కడికి చేరిన తేజ పళ్ళు పటపట కొరికాడు కోపంతో. చాలా సేపు సముద్రంలో టార్చి వేస్తూ అక్కడే నిల్చున్నాడు. నీటిపై ఆకాశ్ ఐపులేదు! ఎంతదూరమని ఈదుకు పోగలడు? ఊపిరాడక మునిగి చస్తాడు.

అనుకుంటూ నిరాశతో వెనుదిరిగి, భవనంవైపు నడిచాడు. పక్కల్ని భవనం బైట వదిలేసి, లోనికెళ్ళి తలుపు మూసుకున్నాడు. స్లాబో హఠాన్మరణం అతన్ని బాగా కృంగదీసింది. తుపాకీని హాలు గోడకు వేళాడదీసి మెట్లగుండా మేడమీది తన గదిలోకెళ్ళి, తలుపు మూసి వెనుదిరిగాడు.

అంతే! తేజ కళ్ళు దిగ్భ్రాంతితో విప్పారాయి.

"ఆకాశ్! నువ్వా! ఎలా వచ్చావిక్కడికి?"

"ఈదుకుంటూ!" అన్నాడు ఆకాశ్ కుర్చీలోంచి లేస్తూ.

"నీ ధైర్యాన్ని అభినందించి తీరాలి. ఇంతకుముందు కొందరు ఈ ద్వీపంనించి తప్పించుకుపోయినా, స్లాబోను చంపే సాహసం చెయ్యలేదు...."

"స్లాబోనే కాదు, ఇప్పుడు నిన్ను చంపే సాహసం కూడా నేను చెయ్యబోతున్నాను" అన్నాడు ఆకాశ్ నవ్వుతూ.

"ఆ సాహసానికి తగ్గ శిక్ష యెంత భయంకరంగా ఉంటుందో నువ్వు కలలోకూడా ఊహించి వుండవు" అన్నాడు తేజ పిడికిళ్ళు బిగిస్తూ.

"ఎందరో అమాయకుల్ని క్రూరంగా చంపిన నీకు ఆ భగవంతుడు యే శిక్ష విధించాడో యిప్పుడు కళ్ళారా చూడు" అంటూ అతనిమీదికి లంఘించాడు ఆకాశ్.

ముసలాడు కదా, చాలా సులభంగా చిత్తుగొట్టవచ్చను కున్న ఆకాశ్ అంచనా తారుమారయింది. అంత వయసు లోనూ తేజ అతిలాఘవంగా అతన్ని ప్రతిఘటించ సాగాడు. ఇద్దరిమధ్యా ముష్టి యుద్ధం కొనసాగింది.

ఎంతైనా యువరక్తం! అటు శక్తి ఉడిగిన శరీరం! రాను రాను తేజ ఆకాశ్ దెబ్బల ధాటికి తట్టుకోలేక పోతున్నాడు. శక్తినంతా కుడిచేతిలో కూడగట్టుకుని, అతని దవడకింద పిడిదెబ్బ తీశాడు ఆకాశ్. అంతే!

ధర్మతేజ మొహంమీది ప్లాస్టిక్ సర్జరీ తొలగిపోయి మరో కొత్త రూపం ప్రత్యక్షమైంది! ఆ కొత్త రూపాన్ని చూడగానే ఆకాశ్ చేష్టలుడిగి కొయ్యబారి పోయాడు!!

పదహారేళ్ళ క్రితం జరిగిన ఓ ఘటన హఠాత్తుగా అతని మనో ఫలకంపై ప్రత్యక్షమైంది! అప్పుడు తొమ్మి దేళ్ళ కుర్రాడు తను. సోదరి సరోజ ఐదేళ్ళ పసిపాప. తండ్రి ఫారెస్టు ఆఫీసర్! చల్లని దరహాసం తప్ప విషాద గీతంలేని నిండు కుటుంబం తమది.

ఒక రోజు ఆహ్లాదంగా గడిపి వద్దామని తండ్రి తమను ఫారెస్టుకు తీసికెళ్ళాడు జీపులో. ఓ చెట్టుకింద హాయిగా పిక్నిక్ చేసుకుంటున్నారు. తను చెల్లాయిని అల్లరిపెడుతూ ఆడుకుంటున్నాడు.

అంతలో అడవి మధ్య హఠాత్తుగా తుపాకీ పేలిన శబ్దం వినిపించి అందరూ ఉలిక్కిపడ్డారు. 'నా అనుమతి లేకుండా నా ఫారెస్టు రేంజిలో యెవరు వేటాడు తున్నారు? వెళ్ళి చూస్తానుండండి' అంటూ లేచి, ఆ శబ్దం వినిపించిన వైపు నడిచాడు నాన్న.

తల్లి తననూ, చెల్లాయినీ పొదివి పట్టుకుని అక్కడే కూర్చుంది. నాన్న వెంట వెళతానని మారాం చేస్తూ తల్లి

యెంత వారిస్తున్నా వినకుండా తండ్రి వెళ్ళినవైపు పరుగుతీశాడు తను. అలా చాలా దూరం వెళ్ళాక, ఓ చోట పొదలకవతల మాటలు వినిపించాయి.

ఆకులు చీల్చి అటు చూశాడు. చేతిలో తుపాకీ పట్టుకుని, తండ్రితో ఘర్షణ పడుతున్నాడో వ్యక్తి. అతను యెవ్వరో కాదు. ఇప్పుడు తనముందు సహజ రూపంలో నిల్చున్న ధర్మతేజే!

'నీ అనుమతి లేకుండా నీ ఫారెస్టులో జంతువుల్ని వేటాడకూడదా ఆఫీసర్? ఐతే, వాటికి బదులు నిన్నే వేటాడితే ఎలా వుంటుంది?' అంటున్నాడు విషపు నవ్వు నవ్వుతూ.

'యూ స్కౌండ్రల్!' అంటూ యెగిరి అతని డొక్కలో తన్నాడు తండ్రి.

ఆ దెబ్బకు తూలి, ధర్మతేజ తుపాకీ కిందపడింది. అతను దాన్ని అందుకోకుండా ముష్టి ఘాతాలు కురిపించసాగాడు తండ్రి. ఇద్దరి మధ్యా కాసేపు భీకర సమరం కొనసాగింది. తను భయంతో మాటరాక గుడ్లప్పగించి చూడసాగాడు.

అంతలో ధర్మతేజ కిందపడ్డ తుపాకీని అందుకోగలిగాడు. మరుక్షణం తుపాకీ పేలిన శబ్దం మారుమోగింది అడవిలో! రక్తసిక్తమైన కడుపు పట్టుకుని నేలకొరిగాడు తండ్రి!! తుపాకీ శబ్దంవిని, దూరాన ఫారెస్టు గార్డు పరిగెత్తుకొస్తున్న చప్పుడుతో పొదల్లోపడి పారిపోయాడు వీడు.

మస్తిష్కంమీద చెరగని ముద్రవేసిన ఆ దృశ్యం అడపాదడపా కలలో కనిపించినప్పుడల్లా తృళ్ళిపడి

తేసుంటాడు తను. ఆ నాడు ఆ చిన్నారి మనసులో అంటుకున్న నిప్పురవ్వ ఈనాడు ప్రచండ అగ్నిజ్వాలగా మారి భగ్గుమంది ఆకాశ్ గుండెలో!

దిక్కులు పిక్కటిల్లేలా అరుస్తూ యెగిరి ఆ కిరాతకుడి ఛాతీమీద తన్నాడు రెండు కాళ్ళతో. ఆ దెబ్బకు తట్టుకోలేక విరుచుకుపడ్డాడు ధర్మతేజ. అతని రొమ్ముమీద కూర్చుని ఆరచేతుల్లో గొంతు పుచ్చుకుని, గట్టిగా నులమడం ప్రారంభించాడు ఆకాశ్.

కొద్ది క్షణాలకే గుడ్లు తేలవేసి అంతిమ శ్వాస విడిచాడు ధర్మతేజ. చల్లబడుతున్న గుండెతో లేచి నిల్చున్నాడు ఆకాశ్. కింద భవనం చుట్టూ తిరుగుతూ మొరుగుతున్నాయి కుక్కలు. గబగబ తను తొడుక్కున్న బట్టలు విడిచాడు. ఆ బట్టల్ని ధర్మతేజ శవానికి తొడిగి, అతని బట్టలుతీసి తను తొడుక్కున్నాడు.

రక్తసిక్తమైన శవాన్ని రెండు చేతుల్లో ఎత్తి కిటికీని సమీపించాడు. కుక్కలు వినేలా గట్టిగా ఈలవేశాడు. తోకలూపుకుంటూ కిటికీ కిందికి చేరి గొంతెత్తి మొరగసాగాయి. వెంటనే శవాన్ని కిటికీలోంచి బైటికి విసిరాడు. అంతే! ఆకాశ్ దుస్తుల వాసనతగిలి, అది శత్రువు శవమే అనుకుని, యజమాని శవంమీద విరుచుకుపడ్డాయి కుక్కలు!

ఆలస్యం చెయ్యకుండా ఇల్లంతా గాలించాడు. స్టోరు గదిలో లైఫ్ బోటూ, రెండు తెడ్లూ, బల్ల సొరుగులో ఓ పిస్తోలూ దొరికాయి. లైఫ్ బోట్ భుజాన ఎత్తి భవనంలోంచి బైటపడి గబగబ తీరాన్ని చేరి, సముద్రంమీద బోట్ యెక్కి, తెడ్లువేస్తూ ముందుకు సాగాడు.

# 13

మూసివున్న గుహముందు ఆగి, "తెరుచుకో.... సుమ్...
సుమ్....." అన్నాడు ఆకాశ్ మూడుసార్లు.

సరసర చప్పుడుతో బండమధ్య, రాతిపలక తొలగి పోయింది. చేతిలో పిస్తోలు సిద్ధంగా పెట్టుకుని, లోన అడుగు పెట్టాడు ఆకాశ్. గుహలో సూదిపడితే వినిపించే నిశ్శబ్దం!

"మూసుకో ....సుమ్....సుమ్...." అన్నాడు. గుహ ద్వారం మూసుకున్నాక, అడుగులో అడుగు వేసుకుంటూ ముందుకు సాగాడు ఆకాశ్. లోపల అలీబాబా వుండే ప్రత్యేక గుహముందు ఆగి, చెవులు రిక్కించాడు. యెటు వంటి అలికిడీ లేదు. నెమ్మదిగా లోన అడుగు పెట్టాడు.

"స్వాగతం! సుస్వాగతం మైడియర్ ఆకాశ్!" అన్న కంచు కంఠం విని ఉలిక్కిపడ్డాడు.

అలీబాబా! మసక వెలుగులో, విశాలమైన బల్ల వెనక ఈజీచేర్లో జారగిలబడి విలాసంగా ఊగుతున్నాడు. కోపంతో ఎరుపెక్కింది ఆకాశ్ మొహం!

"నేను మీకేం అపకారం చేశాను? యెందుకు నన్ను నడి సముద్రంలో తోసి చంపాలనుకున్నావు? నా చావు సంగతెలా వున్నా, నీ అంతుమాత్రం ఇప్పుడు నా చేతి లోనే రాసిపెట్టి వుంది" అంటూ పిస్తోలు అతనివైపు గురిపెట్టాడు.

అంతే! అమాంతం ఎగిరి గుహ కప్పుకంటుకుపోయింది పిస్తోలు!

పకపక నవ్వాడు అలీబాబా. "పైన కప్పంతా ఎల క్ట్రానిక్ మాగ్నటిక్ సిస్టంతో నిండివుంది. నామీద పిస్తోలు ఎక్కుపెట్టడం అంత సులభంకాదు. నీ ఆవేశాన్ని

అర్థం చేసుకున్నాను. ముఠా నియమాన్ననుసరించే నిన్ను మృత్యు ద్వీపం సమీపంలో సముద్రంలో తోయించడం జరిగింది! అక్కణ్నించి ఈదుకుంటూ నువ్వు మృత్యు ద్వీపానికి చేరుకుంటావని మాకు తెలుసు.

ఎవరైతే ఆ ద్వీపంలో నివసించే ధర్మతేజ చేతిలో చావకుండా తప్పించుకుని క్షేమంగా ఇక్కడికి చేరుకుంటారో ఆ పరాక్రమవంతుడికే మా ముఠాలో స్థానం ఇవ్వబడుతుంది. అది పరీక్ష! ఆ పరీక్షలో నువ్వు నెగ్గావు.

ఈ రోజుతో నువ్వు మా ముఠాలో సంపూర్ణ సభ్యుడివి! ఈ శుభ సమయంలో సీనియర్ సభ్యులందర్నీ ఆహ్వానించి, విందూ, వినోదం ఏర్పాటు చెయ్యదలచాను. రేపటినించీ వారితో కలిసి నీ కార్య కలాపాలు ప్రారంభమౌతాయి. అర్థమైందా?”

ఆకాశ్ నోటమాట పెగల్లేదు చాలా సేపు. దిగ్భ్రమనించి తేరుకుని, అతికష్టంమీద అడిగాడు.

“ఒక విషయం ఇంకా అర్థం కాలేదు నాకు. ఆ ధర్మతేజాకూ, మీకూ ఏమిటి సంబంధం?”

“తండ్రీ కొడుకుల సంబంధం!” అన్నాడు అలీబాబా నవ్వుతూ.

## 14

విశాలమైన గుహలో నలభైమంది ముఠా సభ్యులూ, నల్లని ముసుగుల్లో వరసగా నిల్చున్నారు. కాలుగాలిన పిల్లిగా వారిముందు పచార్లు చేస్తున్నాడు అలీబాబా. కాస్త యెడంగా అతని పక్కన మర్జీనా నిల్చునుంది.

“నాలుగేళ్ళనించీ నిరాటంకంగా సాగిపోతున్న మన కార్యకలాపాలు గత కొద్ది రోజులుగా బెడిసికొడుతున్నాయి? మన ముఠాకు గ్రహణం పట్టిందా? ఒకటి

కాదు, రెండు కాదు, మొత్తం నాలుగుసార్లు! పటిష్టమైన పథకం వేసి, అమలు జరుపుతున్న తుదిక్షణంలో హఠాత్తుగా ఊడిపడుతున్నారు పోలీసులు!

ఎలా? ప్రతిసారీ ప్రాణాలకు తెగించి, వారితో పోరాడుతూ, పట్టుబడకుండా తప్పించుకోగలిగినా, మన సభ్యుల్లో చాలామంది తీవ్ర గాయాలతో మృత్యు ముఖం నించి బైటపడ్డారు. పోలీసులకు అంత స్పష్టంగా మన పథకాలు తెలిసిపోతున్నాయంటే, మనలోనే ఎవ్వరో వారితో చేతులు కలిపి, రహస్యాలు చేరవేస్తున్నారన్న మాట! ఎవరా ద్రోహి?" అంటూ ఒక్కొక్క సభ్యుడి ముందు ఆగి ప్రశ్నించసాగాడు అలీబాబా.

ఎవరిలోనూ చలనం లేదు. శిలా ప్రతిమల్లా నిల్చున్నారు.

"సరే, ఆ నమ్మకద్రోహి ఎవరో నేను నిరూపిస్తాను" అంటూ చప్పట్లు చరిచాడు అలీబాబా.

మరుక్షణం నెంబర్ వన్ లోపలికెళ్ళి, గొలుసుతో బంధించి వున్న ఓ అల్సేషియన్ కుక్కను తీసుకొచ్చాడక్కడికి. కుక్క మెడలో అందమైన తోలు బెల్టు మెరుస్తోంది.

దాన్ని సభ్యులకు చూపుతూ, "కుక్కకన్నా హీనుడైన ఆ విశ్వాసఘాతకుడు దీని మెడలోని ఆ తోలు బెల్టులో మన రహస్యాలు రాసిపెట్టి, పోలీస్ హెడ్ క్వార్టర్స్‌కు పంపేవాడు. అనుమానంతో ప్రతి సభ్యుడి నివాసంమీదా నిఘా ఏర్పాటు చేశాను.

అప్పుడు తెలిసింది ఈ కుక్క రహస్యం! ఆ ద్రోహి ఇంటినించి తరుచూ ఇది పోలీస్ హెడ్ క్వార్టర్స్‌కు వెళ్ళిరావటంతో మన వివరాలు వారికెవరు చేరవేస్తు

న్నారో తేటతెల్లమైంది. ఆ నమ్మకద్రోహి యెవరో మీరు స్వయంగా చూడండి. ఎంత ముసుగులో వున్నా, యెంతమందితో వున్నా కుక్కలు ఇట్టే పసిగడతాయి తమ యజమానిని" అంటూ దాని మెడలోని గొలుసు ఊడదీశాడు అలీబాబా.

కుక్క తోకూపుకుంటూ వరసగా నిల్చున్న ఒక్కొక్కర్నీ వాసన చూస్తూ, ఓ సభ్యుడి ముందాగి, కాళ్ళపై నిల్చుంటూ ఎగిరెగిరి పడసాగింది అతనిమీద!

"చూశారా ఆ కుక్క విశ్వాసం! మన ఉప్పుతింటూ మనకే ఎసరు పెడుతున్న ఆ ఊర కుక్కను ఇప్పుడు ప్రత్యక్షంగా చూడండి" అంటూ గబగబ అతన్ని సమీపించి, విసురుగా మొహంమీది ముసుగు లాగాడు అలీబాబా.

"ఆకాశ్! నువ్వా!!" అంది వర్జీనా దిగ్భ్రాంతితో.

ఆకాశ్ పలకలేదు. మొహంలో యెటువంటి భయభ్రాంతులూ కనిపించకుండా తలూపాడు.

"ఎందుకు? ఎందుకు చేశావీ పని? ఆశ్రయమిచ్చి, అదుకున్న మమ్మల్నే నట్టేట్లో ముంచాలనుకుంటున్నావా?" పళ్ళు పటపట కొరికాడు అలీబాబా.

"నేనెవరికీ ద్రోహం చెయ్యలేదు. నా కర్తవ్యాన్ని పొల్లుపోకుండా పాటించాను. అంతే!"

"కర్తవ్యమా!?"

తలూపాడు ఆకాశ్. "నేను సి.బి.ఐ. ఆఫీసర్ని! మీ అంతం చూడటానికి వచ్చిన కాలయముణ్ని."

విరగబడి నవ్వాడు అలీబాబా. "జైల్లోంచి పారిపోతూ జైలర్ని, సెంట్రీలనీ కాల్చి చంపిన నువ్వు సి.బి.ఐ.

ఆఫీసరవా?"

"అది నాటకం! మిమ్మల్ని బుట్టలో వెయ్యడానికి అల్లిన బూటకం! ఎప్పుడైతే నామీద హత్యాభియోగం మోపబడి, కేసు కోర్టుకెక్కిందో, అప్పుడే ప్రభుత్వాని కా పథకం స్ఫురించింది. ఆదివరకే యావజ్జీవ శిక్షపడి, భగీరథ్ ఎంత హింసించినా మీ గురించి చెప్పలేదు.

దాంతో నన్నూ యావజ్జీవ ఖైదీగా ఆ జైల్లో ప్రవేశ పెట్టి, భగీరథ్ వుండే సెల్లోనే వేశారు. ఆ విధంగా అతనితో పరిచయం పెంచుకుని, సానుభూతి సంపాదించు కున్నాను. ముందు వేసుకున్న పథకం ప్రకారం తేలు సంపాదించడం, సెంట్రీముందు వెయ్యడం. అతను కావాలని మా కందుబాటులోకి రావడం, నే నతని తుపాకీ లాక్కుని, తాళం తెరవడం.

తరవాత జైలర్‌తో తలపడటం, అతని చేతిలోని నకిలీ పిస్తోలందుకుని, అతన్ని కాల్చడం అంతా ఓ పథకం ప్రకారం జరిగిపోయింది. దాంతో భగీరథ్‌కు నామీద మంచి గురి ఏర్పడింది. ఆ విధంగా నేను నీవరకూ చేర డంలో సఫలీకృతుణ్నయ్యాను" అన్నాడు ఆకాశ్ నవ్వుతూ.

"నెంబర్ వన్! వెంటనే వీడి ఒళ్ళంతా గుళ్ళతో జల్లెడ చెయ్యి!"

నెంబర్ వన్ చేతిలోని మెషిన్ గన్ ఎత్తి, ఆకాశ్ వైపు గురిపెట్టాడు.

"కొన్ని విషయాల్లో ఆవేశం పనికిరాదు అలీబాబా! నిదానం ప్రధానం! నేను చచ్చినంతమాత్రాన నీతోబాటు ఈ ముఠాలో మ్మిదిమంది ప్రాణాలూ పోలీసుల పిడి కిళ్ళలో పడకుండా తప్పించుకోలేవు.

ఈ ముప్పైతొమ్మిదిమంది అసలు పేర్లూ, పుట్టు పూర్వోత్తరాలూ, వేలిముద్రల ప్రింట్లు కూడా సేకరించి పదిలపర్చాను. నేను మరణించిన మరుక్షణం అవి పోలీసుల చేతిలో పడతాయి. నువ్వు తప్పించుకోవచ్చు. నీతోపాటు మర్జీనా తప్పించుకోవచ్చు. మిగతావారి గతేమౌతుందో ఆలోచించావా?" అన్నాడు ఆకాశ్ శాంతంగా.

ముసుగులో వున్న ముప్పైతొమ్మిదిమంది సభ్యుల్లో కలవరం బైలుదేరింది.

"నీవు చెప్పేదంతా నిజమేనని ఏమిటి ఋజువు?" అడిగాడు అలీబాబా.

"వీరిలో కొందరి అసలు పేర్లూ వ్యక్తిగత వివరాలూ చెప్పమంటావా? ఐతే విను...."

"ఆగు! సెంబర్లు తప్ప ఒకరికొకరు పరిచయం లేని ఇంతమంది ముందు పేర్లూ, వివరాలూ తెల్పడం మంచిది కాదు. ఇలా రా!" అంటూ ఓ గదిలోకి దారితీశాడు అలీబాబా.

సెంబర్ వన్ సెన్ గన్‌తో ఆకాశ్‌ని కవర్ చేస్తూ ఆ గుహలోకి తీసికెళ్ళాడు. మర్జీనా కూడా అనుసరించింది వారిని. పదినిమిషాల తరవాత ముగ్గురూ మళ్ళీ ఇవతలికి వచ్చారు.

"ఫ్రెండ్స్! వీడు చెప్పింది అక్షరాల నిజం! అదృష్టవశాత్తూ నా గురించి తెలుసుకోకముందే వీడి అసలు స్వరూపం బైటపడింది. మీ వివరాలు బహిర్గతమైనందుకు మీరేం కంగారు పడకండి.

"వీడి దగ్గరున్న ఆ ఫైళ్ళు పోలీసుల చేతిలో పడక ముందే చిటికెలో ఇక్కడికి తెప్పిస్తాను చూడండి!"

అంటూ ఆకాశ్ వైపు తిరిగాడు అలీబాబా. "చెప్పు! ఆ వివరాల ఫైళ్ళు యెక్కడ దాచావు? చిత్రహింసల పాలు కాకముందే బుద్ధిగా చెప్పేయ్!"

"ప్రభుత్వం ఏ ఉద్దేశంతో నా కీపని అప్పగించిందో ఆ ఉద్దేశం పూర్తయ్యేవరకూ నా కంఠంలో ప్రాణం వుండగా మీకు లొంగేది లేదు" అన్నాడు ఆకాశ్ నిర్భయంగా.

"సంకెళ్ళతో కట్టేయండి వీణ్ని!"

నలుగురు కలిసి, ఆకాశ్‌ను లాక్కెళ్ళి, గుహగోడలో అమర్చివున్న సంకెళ్ళు బిగించారు చేతులకు. "ఫార్ములా నెంబర్ ఫోర్ ప్రయోగించి, వాడి నోరు విప్పండి" ఆదేశించాడు అలీబాబా.

ఆకాశ్ ఒంటిమీద హంటర్‌తో ప్రారంభమైంది దెబ్బల వర్షం! దెబ్బలకు బట్టలు చిరుగుతున్నాయి. చర్మం చిట్లి రక్తం చిమ్ముతోంది. చమటతో నిలువునా తడిసి పోతున్నాడు. ఐనా, ఫలితం లేకపోవడంతో నెంబర్ వన్ అలీబాబాను సమీపించి,

"చిత్రహింసలకు వాడు చచ్చి ఊరుకుంటే, మన కొంపలు మునుగుతాయి" అంటూ చెవిదగ్గర చెయ్యిపెట్టి, రహస్యంగా ఏదో అన్నాడు.

మరుక్షణం అలీబాబా కళ్ళు మెరిశాయి. "వెరీగుడ్! అదే మంచి ఐడియా! వెంటనే అమలు జరపండి" దెబ్బలు ఆపమన్నట్టు సైగ చేస్తూ.

ఆకాశ్ సొమ్మసిల్లి తల వాల్చేశాడు నిల్చున్నచోటే!

## 15

"అన్నయ్యా!" అన్న కేకతో త్రుళ్ళిపడి కళ్ళు తెరిచాడు ఆకాశ్.

గుహలోకి తల్లినీ, చెల్లినీ ఈడ్చుకొస్తున్నారు నెంబర్ టన్, అతని అనుచరులు.

"బంధించండి వాళ్ళను" ఆజ్ఞాపించాడు అలీబాబా.

ఇద్దరూ గుహగోడకు బంధించబడ్డారు అతని కెదురుగా.

"ఆకాశ్! ఇది ఆఖరి అవకాశం! కని పెంచిన తల్లీ, గారాల చెల్లీ చిత్రవధ కాకముందే చెప్పెయ్! మురా సభ్యుల వివరాలు యెక్కడ దాచావో?"

"నా స్వార్థంకోసం కర్తవ్యానికి ద్రోహం చెయ్య లేను."

"చూస్తారేం? ప్రారంభించండి ఫార్ములా నెంబర్ ఫోర్!" అరిచాడు అలీబాబా.

తల్లీ, చెల్లెలిమీద కొరడా దెబ్బలు పడుతున్నకొద్దీ ఆకాశ్ ఒంట్లోని అఖండ శక్తి పాదరసంలా చేతుల్లోకి పాకసాగింది. బలమంతా చేతుల్లో కూడగట్టుకుని, ఒక్క పెట్టున లాగాడు. గోడలోని కొక్కాలతోసహా ఊడి వచ్చాయి గొలుసులు.

విరుచుకుపడ్డాడు వారిమీద. అతన్ని కాల్చి చంపా లంటే, అరక్షణం పట్టదు. కానీ, ఆ విధంగా తమ రహ స్యాలు యెక్కడ దాచబడ్డాయో ఆమాకీ తెలియదు. అందుకే, అతను వేసే దెబ్బలకు ప్రతి దెబ్బలుతీస్తూ పోరాడసాగా రందరూ.

ఒక్కడూ అంతమందితో నెగ్గడం సాధ్యమా? స్వల్ప వ్యవధిలోనే అందరూ అతిన్ని అదుపులోకి తెగలిగారు.

"నీ నోటి తాళం విప్పే అసలు ప్రయోగం ఇప్పుడు ప్రారంభమౌతుంది చూడు. నెంబర్ ఫోర్! ప్రారం భించు ఫార్ములా నెంబర్ సెవన్!" అరిచాడు అలీబాబా.

నెంబర్ నాలుగు సరోజని సమీపించి, ఆమె కొంగు

పుచ్ఛుకున్నాడు. జరగబోయేదేమిటో అర్థమైంది ఆకాశ్ కు. "అబలపై అత్యాచారం జరిపే అప్రాచ్యులారా! ఆగండి! నా ఇంట్లోని ఉక్కు బీరువాలో దాచి వున్నాయి మీ రహస్యాలు.

ఆ బీరువా తెరిచి చూస్తే హేంగర్లకు వేళాడే బట్టలు తప్ప మరేమీ కనిపించవు. ఆ బీరువా లోపల అటువంటిదే మరో రహస్య బీరువా వుంటుంది. దాని తలుపు తాళం నెంబర్లు కలిపితే తప్ప తెరుచుకోదు.

మొదటి బీరువాలో నిల్చుని, తాళం నెంబర్లు కలిపి తలుపు తెరిస్తే, లోపల పేర్చి వుంటాయి మీకు చెందిన నలభై ఫైళ్ళు!"

అలీబాబా వెంటనే కాగితం, కలం తెప్పించి, "ఆ తాళం తెరిచే నెంబర్లు రాసివ్వు దానిమీద" అన్నాడు.

గత్యంతరంలేని పరిస్థితి. రాయక తప్పలేదు ఆకాశ్ కు.

"మీరిద్దరూ వెళ్ళి, వీడి ఇంటినించి ఆ ఫైళ్ళు తీసుకు రండి" అన్నాడు అలీబాబా నెంబర్ వన్, మర్జీనాల వైపు చూస్తూ.

"ఆగండి!" అన్నాడు నెంబర్ మూడు మధ్యలో.

ప్రశ్నార్థకంగా చూశాడు అతన్ని అలీబాబా!

"మా జాతకాలతోసహా సేకరించి వున్న అత్యంత కీలకమైన ఫైళ్ళవి. ఎవరుపడితే వారు వాటిని తాకడానికి వీల్లేదు. నెంబర్ వన్, మర్జీనాలు రేపు వాటిద్వారా మమ్మల్ని బ్లాక్ మెయిల్ చేయరని ఏమిటి గ్యారంటీ?"

"నీకు మతిగాని పోయిందా? వాళ్ళిద్దరూ నా కుడి, ఎడమభుజాలని తెలీదా మీకు?"

"కావచ్చు. అలాగే, భవిష్యత్తులో మా అనుమానమూ నిజం కావచ్చు. ముందు జాగ్రత్తకోసం మేమిలా ఆలో

చించడం తప్పు కాదు కదా?" అన్నాడు నెంబర్ ఇరవై నాలుగు.

"ఐతే, ఏం చెయ్యమంటారు?"

"మా ఇంటి చి అన్నీ తెలిసిన వ్యక్తి బాధ్యతగల వ్యక్తే వాటిని తీసుకురావడానికెళ్ళాలి" అన్నాడు నెంబర్ ముప్పైఆరు.

"ఆ బాధ్యతగల వ్యక్తి యెవ్వరో కాదు. మీరే! మీమీదే మాకు పూర్తి విశ్వాసం వుంది" అన్నాడు ఎనిమిది. "ఔను....ఔను" అంటూ వంత పాడారు మిగతా వాళ్ళు.

"ఆల్ రైట్! నేనే వెళతాను" అన్నాడు అలీబాబా ఓ నిర్ణయానికి వస్తూ.

# 16

"ఆకాశ్! అలీబాబా వెళ్ళి, ఒకటి కాదు. రెండు కాదు మొత్తం మూడు గంటలు గడిచాయి. నాకేదో అనుమానంగా వుంది. ఆయన ఇంకా యెందుకు తిరిగి రాలేదంటావ్?" అడిగింది మర్జీనా.

"నాకేం తెలుసు?" అన్నాడు ఆకాశ్ మొహం చిట్లిస్తూ.

"నువ్వు మర్యాదగా నోరు విప్పవు. నెంబర్ వన్! చిత్రహింసలు పెట్టే పనిముట్లు ఇలా తీసుకురా! కనీసం వాటిని చూసైనా ఇతని జ్ఞాపకశక్తి జాగృతమౌతుందేమో చూదాం!"

నెంబర్ వన్ లోపలికెళ్ళి, చిత్ర విచిత్రమైన వస్తువులతో తిరిగి వచ్చాడు.

ఆకాశ్ నవ్వాడు చిన్నగా. "మీ అంచనా కరక్టే! వాటిని చూడగానే ఇప్పుడు జ్ఞాపకం వచ్చేసింది నాకు.

పాపం, అలీబాబా అక్కడ యెటువంటి దయనీయ పరిస్థితిలో ఇరుక్కున్నాడో!"

"దయనీయ పరిస్థితా!" నెంబర్ వన్ కంఠంలో ఆందోళన.

"ఔను. మొదటి బీరువా తెరిచి, అందులో ప్రవేశించి, రెండో బీరువా తాళం మీద చెయ్యివేసిన మరుక్షణం మొదటి బీరువా తలుపు మూసుకు పోతుంది. ఆ సంగతి చెప్పడం మరిచాను."

"అందులో సమస్య ఏముంది? ఆ తలుపు తెరుచుకుని బైటికి రావచ్చు కదా!" అంది మార్జీనా.

"అసంభవం! అది యెట్టి పరిస్థితిలోనూ తెరుచుకునే తలుపు కాదు!"

"అంటే!?"

"ఏ పద్ధతిలో అయితే మీ గుహ ద్వారం తెరుచుకుంటుందో అలాగే దానిముందు నిల్చుని మూడుసార్లు తెరుచుకో....సుమ్....సుమ్ అనాలి!"

"అంతేనా! అదేమంత పెద్ద సమస్యకాదు. నెంబర్ వన్ సువ్వెళ్ళి అలీబాబాను బంధవిముక్తుణ్ని చేసుకురా!" అంది మార్జీనా తేలిగ్గా నిట్టూరుస్తూ.

పకపక నవ్వాడు ఆకాష్!

"ఏమిటా వెధవ నవ్వు?" ఉరిమి చూశాడు నెంబర్ వన్.

"అబ్బాయ్! మీ గుహద్వారం తెరుచుకోడానికి యెలాగైతే అందరి కంఠాలూ కంప్యూటర్లో పొందుపర్చి వున్నాయో, ఆ బీరువా తలుపు తెర్చుకోడానికీ ఒక్కడి కంఠమే పొందుపర్చి వుంది. నేను తప్ప మరెవ్వరూ గొంతు చించుకున్నా అది తెరుచుకోదు! వేలిముద్రల్లాగే

ప్రపంచంలోని యే ఇద్దరి కంఠాలూ, ఒకే ఫ్రీక్వెన్సీని కలిగి వుండవు!"

"ఐతే, వెంటనే టేప్ రికార్డర్ తెచ్చి, వీడి కంఠాన్ని రికార్డుచేసి తీసికెళ్ళండి."

"ఆ ప్రయత్నం కూడా వ్యర్థమే అవుతుంది మేడమ్! యెందుకంటే, సృష్టి సహజమైన శబ్దతరంగాలకూ, యంత్రాల ద్వారా టేప్ చేసిన తరంగాలకూ చాలా తేడా వుంటుంది. ఫ్రీక్వెన్సీ సరిగ్గా కలవదు. స్వయంగా నేనే బీరువాముందు నిల్చుని పలికితే తప్ప ఆ బీరువా తెరుచుకోదు."

"ఆక్సిజన్ అయిపోయి, అలీబాబా అందులో ఊపిరాడక చావకముందే వీణ్ణక్కడికి తీసుకువెళ్ళడం మంచిది. ఆరుగురు ఆయుధాలతో రండి మా వెంట. మిగతావారు వీడి తల్లినీ, చెల్లినీ చూస్తూ ఇక్కడే వుండండి" అన్నాడు నెంబర్ వన్ ఆందోళనగా.

మరుక్షణం మోటర్ గారేజ్ లా ఉపయోగించే గుహలోంచి పెద్ద వ్యాన్ బైటికితీశారు. ఆరుగురు సాయుధులతో, ఆకాశ్ తో వెంటనే అందులో యెక్కారు నెంబర్ వన్, వర్జీనా!

## 17

ఆకాశ్ ఇంటిముందు వ్యాన్ ఆగగానే, బిలబిల దిగి, అతన్ని తోసుకుంటూ లోనికి నడిచారందరూ.

"ఎక్కడ ఆ బీరువా?" అడిగాడు నెంబర్ వన్.

"పడగ్గదిలో!" అంటూ వాళ్ళను అటు తీసికెళ్ళాడు ఆకాశ్.

మూసి వున్న పడగ్గది తలుపుల్ని భళ్ళున తెరిచాడు నెంబర్ వన్. అంతే! పక్కన పిడుగులు పడ్డట్టు అదిరి

పడ్డారందరూ! అలీబాబా చేతులు వెనక్కి విరిచి కట్టి బంధించబడున్నాడు సోఫాలో!! అతని చుట్టూ నలుగు రైదుగురు పోలీసాఫీసర్లు నిల్చునున్నారు.

పరిస్థితిని అర్థం చేసుకుని, ఆయుధాలు యెక్కు పెట్టే లోపలే, పక్క గదిలోంచి అనేకమంది పోలీసులు ఊగల్లా చుట్టుముట్టి వారి ఆయుధాలు స్వాధీనం చేసుకున్నారు.

"ఎత్తులకు పై యెత్తులు యెలా వెయ్యొచ్చతాయో ఇప్పుడు తెలిసిందా మీకు? ఇంతమంది పోలీసులు ఇక్కడెలా వున్నారా అని ఆశ్చర్యపోతున్నారు కదూ? నా చేతికున్న ఈ గడియారం మామూలు గడియారంకాదు. శక్తివంతమైన ట్రాన్స్మిటర్! స్థావరంలో యెప్పుడైతే నామీదా, నావారిమీద దౌర్జన్యం ప్రారంభించారో ఆ మాటలన్నీ, ఈ గడియారం ద్వారా పోలీస్ హెడ్ క్వార్టర్స్ చేరుకున్నాయి.

అలీబాబా ఇక్కడికి రాకముందే పోలీసులు వచ్చి, సిద్ధంగా కూర్చున్నారు....ఇందాక నేను మీతో చెప్పిన బీరువా భాగోతమంతా కట్టి బూటకం! ఆ విధంగా మిమ్మల్ని కూడా ఇక్కడికి చేర్చాలని వేసిన ఎత్తు! అందుకు అయ్యారు మీరు చిత్తు!!

సదా ముసుగుల్లో వుండే మిమ్మల్ని. ప్రత్యక్షంగా చూసి తరించాలని ఎన్నాళ్ళనించో ఆశపడుతున్న నాకు, ఈ రోజు తీరబోతోంది ఆ కోరిక" అంటూ అలీబాబాను సమీపించి, మొహంమీద ముసుగు లాగాడు ఆకాశ్.

అంతే! దిగ్భ్రాంతిలో ఆకాశ్ బుర్ర తిరిగిపోయింది. "కిరణ్! నువ్వా!!" అన్నాడు.

ఎరుపెక్కిన కళ్ళతో, గాయపడ్డ పాములా బుస

కొట్టాడు జ్యోతి అన్న కిరణ్.

"ముఠా నాయకుడు మీరేనని కలలోకూడా ఊహించలేదు నేను. మందులు తయారుచేసే మీ లాబొరేటరీలో అక్రమంగా కొన్ని మత్తుపదార్థాలు తయారై, మామూలు కేప్సూల్స్‌లో నింపబడి, దేశం నలుమూలలకూ సప్లై అవుతున్నట్టు ప్రభుత్వానికి అనుమానం రాగానే, సి.బి.ఐ. ద్వారా రహస్య విచారణ జరిపించాలని నన్ను నియమించారు.

అదృష్టవశాత్తూ అప్పుడే డ్రైవర్ కావాలని మీరు పత్రికల్లో ప్రకటించేసరికి ఆ అవకాశాన్ని వదులుకోకుండా అప్లై చేశాను. అదృష్టం ఇంకా కలిసివచ్చి, మీ చెల్లాయి జ్యోతి నా సహాధ్యాయినే కావడంతో ఏకంగా మీ లాబొరేటరీలోనే ఉద్యోగం దొరికింది నాకు.

దాంతో, ప్రభుత్వ అనుమానం నిజమేనని పసిగట్టగలిగాను. అంతలో, జ్యోతి జీవితంనించి వేరుచెయ్యాలని మీరు నన్ను హత్యా నేరంలో ఇరికించగానే ప్రభుత్వానికి మరో ఉపాయం తట్టింది.

పనిలో పనిగా అలీబాబా నలభై దొంగల కేసుకూడా నాకే అప్పగించి, జైల్లో వున్న భగీరథ్ ద్వారా మీ వరకూ చేరే పథకం రూపొందించారు. ఆ విధంగా మీ చలవతో నేను మృత్యు ద్వీపానికిచేరి, బాల్యంనించీ గుండెలో భగభగ మండే అగ్నిజ్వాలను చల్లార్చుకుని, తిరిగి రాగలిగాను.

చేసిన ఘాతుకాలకూ, అకృత్యాలకూ మీకు మరణ శిక్షలు పడటం, మీకిష్టం వున్నా, లేకున్నా మీ చెల్లెలితో నా పెళ్ళి జరగడం తరవాతి తతంగం! ముందు

మీ స్థావరంలో వున్న నా తల్లినీ, చెల్లాయినీ విడిపించుకు రావాలి" అంటూ పోలీసాఫీసర్ల వైపు తిరిగి.

"వీళ్ళను హెడ్ క్వార్టర్స్‌కు తీసికెళ్ళండి. మిగతా సిబ్బందితో నేను వ్యాన్‌లో వీళ్ళ స్థావరానికెళ్తాను. వ్యాన్ని చూసి, వీళ్ళే వచ్చారనుకుని, అజాగ్రత్తగా వుంటారు వాళ్ళు. ఆ భ్రమలో నే హఠాత్తుగా దాడిచేసి అందర్నీ లొంగదీసుకోవచ్చు!" అంటూ సిబ్బందితో గబగబ బైటికి నడిచాడు ఆకాశ్.

—:అ యి పో యి ం ది:—

# దేశ ద్రోహులు

## ప్రతాప రవిశంకర్

ఎర్రటి లైటు మూడుసార్లు వెలిగి ఆరిపోయింది. సన్నని అలారం మోతకూడా ఆగి—ఆగి వినిపించింది.

ఎర్రలైటు—అలారం మోత బాస్ రాకను తెలియచేస్తాయి.

అందువల్ల అప్పటివరకు చిన్నగా యేవో మాట్లాడు కుంటున్న సభ్యులందరూ యెవరో శాసించినట్టు మవునంగా వుండిపోయారు.

ఒక్కసారిగా ఓ మాదిరి విశాలంగా వున్న ఆ హాలులో దారుణమైన నిశ్శబ్దం అలుముకున్నది.

ఆ హాలులో డిమ్‌గా వున్న ఒకే ఒక్క లైటు వెలుగుతున్నది. హాలు తలుపులన్నీ మూసివున్నాయి.

ఆ హాలు బయట ఆయుధాలతో దున్నపోతుల్లాంటి నలుగురు మనుషులు కాపలా కాస్తున్నారు.

ఉన్నట్టుండి హాలు యెదురుగా గోడకు వున్న నగ్న యువతి చిత్రం పక్కకు తప్పుకుంది—బర్రుమని చప్పుడు

చేస్తూ.

బాస్ ప్రత్యక్షమయ్యాడు డయాస్ మీద.

వెంటనే సభ్యు లందరూ గౌరవసూచకంగా లేచి నిల్చున్నారు.

"కూర్చోండి" అన్నాడు బాస్.

బాస్ గొంతు సన్నగా వుంది. కాని గంభీరంగా వుంది.

అతను సన్నగా—పొడుగ్గా వున్నాడు. నల్లని దుస్తులు వేసుకున్నాడు. నెత్తిమీద టోపీ వున్నది. కళ్ళకు గంతలు వున్నాయి—పిల్లి గడ్డం. తమాషాగా వున్నాడు.

సభ్యులు కూర్చున్న తర్వాత ఒక్కసారి తన అను చరులనందరినీ పరీక్షగా చూశాడు.

"నెంబర్ 404 రాలేదు" అన్నాడు. యెందుకంటే ఓ కుర్చీ ఖాళీగా వున్నది.

పొరపాటున కూడా ఒక్క కుర్చీ యెక్కువ వుండదు ఆ హాల్లో. యెంతమంది సభ్యులు హాజరు కావాలో ఆ హాల్లో అన్ని కుర్చీలే వుంటాయి. అందువల్ల యెంతమంది సభ్యులు సమావేశానికి హాజరు కాలేకపోయారో సుల భంగా అర్థ మవుతోంది.

ఎవ్వరూ మాట్లాడలేదు.

నిజమే—

ఎవ్వరూ గమనించలేకపోయారు. ఎన్ని ముఖ్యమయిన పనులున్నా బాస్ యేర్పాటుచేసే సమావేశానికి ప్రతి సభ్యుడు హాజరు కావలసిందే—ఒక వేళ అనివార్య కార ణాలవల్ల హాజరు కాలేకపోతే ఆ విషయాన్ని ఆరు గంటల ముందుగా బాస్‌కు తెలియపరచాలి.

అలా తెలియపరచకుండా సమావేశానికి హాజరు అవక

పోవటం గొప్ప నేరం.

క్రమశిక్షణ విషయంలో బాస్ చాలా స్ట్రిక్టుగా వుంటాడు.

104 నించి ముందుగా ఎలాంటి సమాచారం అందలేదు తను సమావేశానికి రాలేకపోతున్నట్టు—

మరి అతను ఎందుకు రాలేదు?

కళ్ళ Xంతల్లోనించి బాస్ ఎర్రటి తీక్షణమయిన కళ్ళు అందరికేసి అటూ యిటూ తిరిగాయి.

"వెల్.... నెంబర్ 203 ఒకసారి ఇలాగే సమావేశానికి హాజరు కానందుకు అతను అనుభవించిన పనిష్మెంట్ మీ అందరికీ తెలిసే వుంటుంది" అన్నాడు.

తలలు వూపారు అంతా—

ఉలిక్కిపడ్డారు తర్వాత.

ఆ సభ్యుల్లోనే వున్న 203 సిగ్గుతో తల వంచుకున్నాడు.

ఒకసారి అతను బాస్ ఆజ్ఞను అతిక్రమించాడు. ముందుగా తెలియపర్చకుండా సమావేశానికి హాజరు అవలేదు.

అందుకు అతను బాస్ విధించిన శిక్షకు గురయ్యాడు.

203 కి ఒక ఇంజెక్షన్ యిచ్చారు. వెంటనే అతని శరీరం నిండా తేళ్ళు కుట్టినంత బాధ మొదలయ్యింది. అతన్ని ఓ చీకటి సెల్‌లో వుంచారు. వారం రోజుల వరకూ అతను ఆ బాధను అనుభవిస్తూనే వున్నాడు. ఈ వారం రోజులూ అతనికి ఆహారం ఇవ్వలేదు. కేవలం నీళ్ళు తాగి బతికి వున్నాడు.

వారంరోజులు దారుణమయిన నరకాన్ని అనుభవించాడు.

ఆ పనిష్మెంట్ యెంత భయంకరమయినదో అతను మిగలిన సభ్యులందరికీ వివరించి చెప్పాడు. అతను చెప్పిన తర్వాత యే సభ్యుడూ సమావేశానికి హాజరు అవకుండా మిస్ కాలేదు.

కాని—ఈ సమావేశానికి 404 రాలేదు.

ఎందువల్ల?

అతని కేమయ్యింది?

ఇలాంటి ప్రశ్నలు సభ్యు లందరిలోనూ తలెత్తాయి.

అందరి ఆలోచనలను చెదరగొడుతూ బాస్ గొంతు కీచుమన్నది ఆ హాల్లో—

"వెల్....మన సీక్రెట్ సంస్థను స్థాపించి యీ రోజుతో ఆరు నెలలు పూర్తవుతోంది. ఇంతవరకు మనం అనుకున్న పనులను అనుకున్నట్టుగానే చెయ్యగలిగాం. ఇందుకు మీ రంతా సమర్థవంతంగా పని చేసినందుకు మిమ్మల్నందరినీ హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను."

ఇలా మాట్లాడి అందరినీ చూశాడు బాస్.

సభ్యులందరి మొహాల్లోని సంతోషం అతనికి కన పడింది.

"అంతేకాదు. మీ అందరి నెల జీతాలను ఈ నెల నించీ పెంచుతున్నాను. మీకు త్వరలోనే బోనస్ కూడా ఇవ్వాల నే నిర్ణయం తీసుకుబోతున్నాను."

"థాంక్యూ బాస్" అన్నారు కొంతమంది సభ్యులు మధ్యలోనే—

"నో మెన్షన్....కష్టపడి సంస్థ అభివృద్ధికోసం పని చేసే సభ్యులకు నా నించి గుర్తింపు ఎప్పుడూ వుంటుంది. సరే యిక మన బిజినెస్ గురించి మాట్లాడుతాను....మనం

స్మగ్లింగ్‌తో పాటు బ్లాక్ మెయిలింగ్ బ్రాంచ్‌ని కూడా ఓపెన్ చెయ్యాలి. ఈ నెలనించే మనం బ్లాక్ మెయిలింగ్ మొదలుపెట్టాలి. ఎంతోమంది ధనవంతులు ఘరానా పెద్ద మనుషులుగా వుంటూ యెన్నో వెధవ పనుల్లో లీనమై పోతున్నారు. అలాంటి మనుషుల సమాచారం మనం సేకరించి వాళ్ళనించి డబ్బు గుంజాలి. వాళ్ళ బలహీనతలను మనం డబ్బు చేసుకోవాలి. అర్థమయిందనుకుంటాను."

"యస్ బాస్" అన్నారంతా—

"గుడ్....ముందుగా మనం ఎవర్ని బ్లాక్ మెయిల్ చెయ్యవలసి వుంటుందో చెబుతాను. అతని పేరు యస్. రమానంద్. కృష్ణవేణి బ్యాంకు డైరెక్టర్లలో ఒకడు. అతనికి అందమైన అమ్మాయిలంటే అంతులేని పిచ్చి. అందువల్ల అతన్ని వలలో వేసుకుని తర్వాత బ్లాక్ మెయిల్ చెయ్యాలి. అప్పుడు మనం సులభంగా కొన్ని బ్యాంకులను యెంతో సమర్థవంతంగా దోచుకునే అవకాశం కలుగుతుంది. ఏమంటారు?" అన్నాడు బాస్ నవ్వి—

"గుడ్ ఐడియా బాస్" అన్నారు కొంతమంది.

"రైట్....ఈ పనికి మన అందాల సుందరి నెంబర్ 16 లీలను ఎన్నుకుంటున్నాను" అన్నాడు.

"థాంక్ యూ బాస్!" అన్నది లీల లేచి నిల్చుని—

"లీలా....నువ్వు ఈ పనిని ఎంతో జాగ్రత్తగా పూర్తి చేస్తావని అనుకుంటున్నాను. ఇందుకు నువ్వు నెంబర్ 201 సహాయం తీసుకో...."

"అలాగే బాస్" అన్నది లీల 201 ని చూస్తూ—

201 ముసి ముసిగా నవ్వాడు. మిగిలిన సభ్యులు అతని కేసే అసూయగా చూశారు. అందాలరాశి అయిన లీలకు సహాయంగా 201 ని నియమించినందుకు.

అతని పేరు ప్రకాష్. చాకులాంటి మనిషే పేరు కూడా వుందతనికి—

"ఓ.కె.... ఇక ఎవరికి ఎలాట్ చెయ్యబడిన పనులను వాళ్ళు యెంతవరకు పూర్తి చెయ్యగలిగారో తెలుసుకుంటాను. ముందుగా నెంబర్ 101 ని అడుగుతున్నాను...." అన్నాడు బాస్.

అలా అంటూ తన ప్యాంటు జేబులోనించి సిగరెట్టు పెట్టెలా వున్న ఓ నల్లని పెట్టెను తీసి టేబిల్ మీద వుంచి దానికి వున్న బుడిపె లాంటి బటన్ని నొక్కాడు....

101 లేచి నిల్చున్నాడు ...

"బాస్" అంటూ ఏదో చెప్పబోయాడు.

కాని బాస్ దృష్టి తనముందు వున్న ఆ పెట్టెమీద వుంది. దానికి మధ్యలో వున్న ఎర్రటి లైటు వెలుగుతూ ఆరిపోతున్నది.

వెంటనే బాస్ మొహం జేవురించింది.

కాని—అతను తన మొహంలో ఫీలింగ్ని కనపడనీయకుండా "నెంబర్ 101. వారం రోజుల క్రితం నేను నీకు ఇచ్చిన ఆ డైమండ్ బాక్స్ని ఒకసారి ఇస్తావా?" అని అడిగాడు.

వెంటనే 101 మాట్లాడలేకపోయాడు.

క్షణం తర్వాత "బాస్....ఆ బాక్స్ని నా నివాసంలో వదిలి వచ్చేశాను బాస్" అన్నాడు.

పెద్దగా నవ్వాడు బాస్.

"ఇప్పుడంతా అర్థమయిపోయింది. నువ్వు 101 కాదు. బహుశ గూఢచారివి అయివుంటావు. లేకపోతే పోలీసు మనిషివి అయివుంటావు. ఎవరివైనా ఆ విషయాన్ని నీ చేతనే చెప్పిస్తాను. మర్యాదగా నీ దగ్గర ఆన్‌లో వున్న టేప్‌రికార్డర్‌ను యిలా యిస్తావా?" అన్నాడు బాస్.

అసలు అతను ఏ బాక్స్‌నూ 101 కి యివ్వలేదు. అతన్ని చూడటంతోనే అతను 101 కాదనే అనుమానం వచ్చింది.

కంగారుపడ్డాడు అతను—

గబుక్కున జేబులో నించి రివాల్వర్ తీయబోయాడు.

అప్పటికే బాస్ చేతిలో పిస్తోలు ప్రత్యక్షమయ్యింది.

"నేను వీళ్ళందరికి నాయకుడిని. నాయకుడికి ఎలాంటి లక్షణాలు వుంటాయో నీకు తెలుసు అనుకుంటాను. అందువల్ల నువ్వు కదలకుండా నిల్చో....మిగిలిన పనులు మేము పూర్తిచేసుకుంటాము."

అతని పక్కనేవున్న మరో సభ్యుడు 101 వేషంలో వున్న వ్యక్తి జేబులు వెతికి చిన్న సైజు టేప్‌రికార్డర్—రివాల్వర్ బయటకు తీసి బాస్ టేబిల్ మీద వుంచాడు.

కాలికింద వున్న బటన్ నొక్కాడు బాస్.

వెంటనే తలుపులు తెరుచుకుని దున్నపోతుల్లాంటి నలుగురు మనుషులు వచ్చారు.

"ఇతను శత్రువుల మనిషి. మన సభ్యుడు 101 ని దెబ్బతీసి ఆ వేషంలో యిక్కడికి చేరుకొన్నాడు. ఇతన్ని తీసుకెళ్ళి రెడ్ ఇంజెక్షన్ ఇచ్చి డార్క్ సెల్‌లో పడెయ్యండి...." అన్నాడు.

నిమిషం కూడా ఆలస్యం చెయ్యకుండా ఆ నలుగురు మనుషులు అతడిని ఆ హాల్లోంచి బయటకు తీసుకు వెళ్ళారు.

అతను సీక్రెట్ పోలీస్ రాజేష్.

బాస్ అతను వెళ్ళగానే అన్నాడు "404 సమావేశానికి యెందుకు హాజరుకాలేదో యిప్పుడు అర్థమవుతోంది" అన్నాడు ఎదురుగా వున్న పెట్టెను చూస్తూ. దానికి ఎర్రటి బల్బు ఇప్పుడు ఆరిపోయి వున్నది.

అది టేప్ రికార్డర్ ఇండికేటర్.

"404-101 శత్రువులకు చిక్కారు. అయితే వాళ్ళు మన గురించిన ఇన్ఫర్మేషన్ యిస్తారనే భయం నాకు లేదు. వాళ్ళు ప్రాణాలు పోగొట్టుకోటానికయినా సిద్ధపడతారు. కాని ఇప్పుడు నాకు యెంతో అవమానంగా వుంది. ఎందుకంటే శత్రువుల మనిషి వచ్చి మన మధ్య కూర్చుంటే మీ రెవ్వరూ గమనించలేకపోయారు" అన్నాడు బాస్ విచారంగా—

"సారీ బాస్...." అన్నారు సభ్యులు—

"ప్రభుత్వానికి మన సంస్థమీద కన్ను పడిందనటానికి ఈ సంఘటనే నిదర్శనం....ఇకనించీ మనం వెయ్యి కళ్ళతో సంచరించాలి" అన్నాడు బాస్.

"యస్ బాస్" అన్నారు సభ్యులు సిన్సియర్‌గా—

## 2

నెంబర్ 404 కళ్ళు తెరిచాడు.

వెంటనే అతని కళ్ళకు ఎదురుగా ఏమున్నదీ కనిపించలేదు. అతను కాళ్ళు-చేతులు విదిలించాడు. కాని అవి అంగుళంకూడా కదల్లేదు.

ఎందుకంటే అతని కాళ్ళు-చేతులు కట్టేశారు నైలాన్

వాళ్ళతో.

ఆ గదంతా చీకటిగా వుంది.

అతనికి తను పోలీసుల అతిథి గృహంలో వున్నట్టు సులభంగా అర్థమయిపోయింది.

404 కి ఒక్క క్షణం భయమేసింది.

పోలీసులు సులభంగా తనని వదలిపెట్టరు. ప్రశ్నలతో వేధించి చంపుతారు.

అయితే అతన్ని ఒకే ఒక ప్రశ్న వేధిస్తోంది.

తన సంస్థ సభ్యుడు నెంబర్ 101 తనని తలమీద యెందుకు కొట్టాడు....? అప్పుడే తనకి స్పృహ పోయింది.

404 జరిగిందంతా ఒక్కసారి గుర్తు చేసుకున్నాడు.

ఆ రోజు సమావేశానికి తను 101 తో కలిసి వెళ్ళాలని అనుకున్నాడు. అందుకే హోటల్ ఫైవ్ స్టార్స్‌లో వున్న 101 గదికి వెళ్ళాడు.

తలుపు మూసి వుంది.

చప్పుడు చెయ్యగానే తలుపు తెరుచుకున్నది.

ఎదురుగా చిరునవ్వుతో 101 కనిపించాడు.

తను లోపలకు వచ్చాడు. వెంటనే తన తలమీద పిడుగులాంటి దెబ్బ పడింది.

కింద పడిపోతూ చూశాడు. 101 చేతిలో రాడ్ లాంటి సాధనం వుంది. అంతే తనకు స్పృహ పోయింది.

ఇప్పుడు ఈ గదిలో మళ్ళీ స్పృహ వచ్చింది.

అసలు 101 తనకి ఎందుకు స్పృహ తప్పించాడు. ఇంతకీ 101 శత్రువుల మనిషా? లేక అతని వేషంలో పోలీసుల మనిషి వున్నాడా?

అయితే 101 ఏమయినట్టు?

తలపోటు మొదలయ్యింది 404 కి. అప్పటికే బాగానే నెత్తురు కారిపోయింది తలమీదనించి—అందు కల్లనే బాగా నీరసంగా అనిపిస్తోంది.

ఉన్నట్టుండి అతనికి ఎవరివో బూట్ల అడుగుల చప్పుడు వినిపించింది.

ఎవరో వస్తున్నారు అనుకొన్నాడు!

నిమిషం తర్వాత ఆ గది తలుపు తెరుచుకున్నది. ముగ్గురు మనుషులు లోపలకు అడుగుపెట్టారు.

గదిలో లైటు వెలిగింది.

గబుక్కున కళ్ళు మూసుకున్నాడు అతను.

"ఇతనికి ఇంకా స్పృహ రాలేదనుకుంటాను" ఎవరో అన్నారు.

"కాదు....వచ్చింది....కాని ఇతను నటిస్తున్నాడు" అన్నా డాయన.

ఆయన ఐ.జి. ఆఫ్ పోలీస్.

ఉలిక్కిపడ్డాడు అతను.

తను నటిస్తున్నాడని ఆయన క్షణంలో తెలుసు కొన్నాడు. అందువల్ల తను యిక నటించటం అనవ సరం.

అందుకే—కళ్ళు తెరిచాడు.

"గుడ్! నటన ఆపేసి కళ్ళు తెరిచినందుకు" అన్నాడు ఐ.జి.

404 మాట్లాడలేదు. నిశితంగా తన యెదురుగా నిల బడిన పోలీసు అధికారులను చూశాడు.

ముగ్గురూ పులుల్లా కనిపించారు.

"ఏ పేరేమిటి?" అడిగాడు ఐ.జి.

అతను పెదవి కదపలేదు. తన గురించి అతను యేమీ

చెప్పదల్చుకోలేదు.

"నీకు నెంబర్ వుందికదూ.... ఎంత?

ఈసారి కూడా 404 మాట్లాడలేదు.

"నీ బాస్ ఎవరు? అసలు మీ కార్యక్రమాలు యేమిటి? మీ ముఠాలో ఎంతమంది వున్నారు? మీ స్థావరం ఎక్కడ? ఈ ప్రశ్నలన్నిటికీ సరయిన జవాబులు వెంటనే యివ్వు. లేకపోతే నిన్ను చంపకుండా చిత్రహింసలు పెడతాం. అప్పుడు నువ్వు ఆ బాధలు భరించలేక త్వరగా చంపెయ్యమని ప్రాధేయపడతావు. అయినా నిన్ను వదలం.

నువ్వు ఇన్ఫర్మేషన్ యిచ్చావంటే నిన్ను వదలి పెడతాం. నీకు తగిన రక్షణ కల్పిస్తాం. ఆలోచించుకో. నువ్వు ఎంతోసేపు మా ముందు నోరు కదపకుండా కూర్చోలేవు. నేరస్థులను హింసించటంలో మేము కొత్త విధానాలు కనుక్కున్నాం. వాటన్నిటిని నీమీద ప్రయోగించే అవకాశాన్ని కల్పించవనే అనుకొంటున్నాను" అన్నాడు గంభీరంగా—

404 ఐ.జి. కళ్ళలోకి చూశాడు. ఆయన మొహం పులి మొహంలాగానే వుంది. కళ్ళు కూడా తీక్షణంగా వున్నాయి. ఆ కళ్ళలో క్రూరత్వం కూడా బాగా కన పడుతోంది. అనుకొన్నది సాధించేవరకు నిద్రపోని పట్టు దల కూడా కనిపించింది.

అయినా అతను ఏమీ చెప్పదల్చుకోలేదు. ఎన్ని హింసలకైనా భరించాలనే అనుకున్నాడు. ఎంత బాధ కైనా ఓర్చుకోవాలనే అనుకున్నాడు.

ఎందుకంటే—ఎటువంటి పరిస్థితులలోనూ సంస్థ గురించి—సభ్యుల గురించి యెవరికీ తెలియచేయమని

అందరూ ప్రమాణం చేశారు. ఈ రోజు తన ఒక్కడి కోసం ఇన్ఫార్మేషన్ ఇచ్చి సంస్థను కూలద్రొయ్యటం అతనికి ఇష్టంలేదు.

కాబట్టి—404 శిలలా అలాగే వుండిపోయాడు.

ఐ.జి.లో సహనం నశించిపోయింది.

ఎంతోమంది నేరస్తులు ఆయన్ని చూడటంతోనే వణికి పోయారు. నిజాన్ని ఒప్పుకున్నారు.

కాని—404 మొండి పట్టుదల ఆయనలో విపరీతమైన కోపాన్ని తెప్పించింది.

"యూ బాస్టర్డ్" అంటూ చెయ్యెత్తాడు ఐ.జి. ఎర్ర బడిన కళ్ళతో.

కాని—యింతలోనే ఓ ఇన్స్పెక్టర్ ఆ గదిలోకి వచ్చి "సార్....మీకు ఫోన్ కాల్ వచ్చింది" అని చెప్పాడు.

ఐ.జి. గబగబా ఆ గదిలోనించి వెళ్ళి-ఐదు నిమిషాల తర్వాత తిరిగివచ్చాడు విసుగ్గా మొహం పెట్టి.

"డామిట్....అంతా అడ్డం తిరిగింది. మన సీక్రెట్ పోలీస్ రాజీవ్ వెళ్ళి ఈ ముఠా బాస్కు దొరికిపోయా డట. బాస్ బేరం పెడుతున్నాడు—తన మనిషిని వదిలి పెడితే మన మనిషిని తను వదిలిపెడతాడుట" అన్నాడు.

404 కి ఆ మాటలు వినగానే వెయ్యి తో దేళ్ళ బలం వచ్చింది, ధీమాగా ఐ.జి. కేసి చూశాడు. ఇప్పుడేంచేస్తా వన్నట్టు—

## 3

రమానంద్ నైట్ క్లబ్ లోనించి బయటకు వచ్చాడు.

అప్పుడు సమయం పన్నెండు గంటలు కావస్తోంది. అతను కొద్దిగా తూలుతున్నాడు. తూలుతూనే పార్కింగ్

స్పేస్‌లో వున్న ఎంబాసిడర్ కారు దగ్గరకు నడిచాడు.

కారు స్టార్టయ్యింది.

ముందుకు కదిలింది.

క్లబ్ ఆవరణలోనించి బయటకు వచ్చింది కారు. బాగా రాత్రి కావటంవల్ల రోడ్లు నిర్మానుష్యంగా వున్నాయి. పేవ్ మెంట్లమీద కొంతమంది జనం ముసుగులు పెట్టి నిద్రపోతున్నారు.

కారును కొంచెం నెమ్మదిగానే పోనిస్తున్నాడు రమానంద్. అతను కొంచెం ఎక్కువగా మందుతీసుకున్నప్పుడు యెక్కువ వేగంతో కారును డ్రయివ్ చెయ్యడు. యాక్సిడెంట్ జరుగుతుందనే భయం అతడికి బాగా వున్నది.

ఊరికి కొంచెం దూరంగా విశాలమైన ఆవరణలో ఈ మధ్యనే కొత్తగా అన్ని హంగులతో నిర్మించబడింది ఆ నైట్ క్లబ్. అందుకే రమానంద్ ఈ మధ్య తరచు అక్కడికి వచ్చి వెళుతున్నాడు.

డ్రయివ్ చేస్తున్న రమానంద్‌కు కొంచెం దూరంలో రోడ్డు పక్కగా కారును ఆపమని చెయ్యెత్తి నిల్చున్న ఓ యువతి కనిపించింది.

అప్రయత్నంగానే రమానంద్ కాలు బ్రేకును నొక్కినది.

ఆ యువతి పక్కగా కారు ఆగిపోయింది.

గబగబా రమానంద్ పక్కకు వచ్చి "ప్లీజ్....నన్ను కార్లో యెక్కనివ్వండి. ఒక దుర్మార్గుడు నన్ను తరుముకు వస్తున్నాడు" అన్నది ఆమె—

అందమైన ఆ యువతి మొహంలో కంగారు చాలా క్లియర్‌గా రమానంద్‌కు కనిపించింది.

"ఏం జరిగింది? యెవరా దుర్మార్గుడు?" అన్నాడు.

"చెబుతాను. ముందు నన్ను కారు యెక్కనివ్వండి" అంటూ భయంతో వెనక్కి తిరిగి చూసింది.

అప్పుడే ఆ సందులోనించి పరుగులాంటి నడకతో ఓ మనిషి కనిపించాడు.

"అడుగో ...అతనే" అన్నదా యువతి కంగారుగా-

అతన్ని చూశాడు రమానంద్.

వెంటనే కారు డోర్ తెరిచాడు.

గబుక్కున కార్లోకి ఎక్కింది ఆ యువతి.

యెంబాసిడర్ ముందుకు పరుగుదీసింది.

"ఇప్పుడు చెప్పు....యెవరతను? యెందుకు నీ వెంట పడ్డాడు?" అడిగాడు రమానంద్ సిగరెట్టు ముట్టించి.

"అతను నా స్నేహితురాలికి బావ అవుతాడు. కొంచెం సేపటి క్రితం అతను వచ్చాడు. ఆ గదిలో వున్న నన్ను చూసి బలవంతం చెయ్యబోయాడు. అతను కొంచెం తాగివున్నాడు. నేను ప్రతిఘటించాను. అయినా అతను వినలేదు. చివరికి యెలాగో తప్పించుకుని అక్కడినించి పరుగుదీసి రోడ్డుమీదకు వచ్చాను" అన్నది ఆమె.

"నీ పేరేమిటి?" అన్నాడు రమానంద్ అద్దంలో ఆమె అందాన్ని తనివితీరా చూస్తూ.

"లీల."

"అందమైన పేరు....నువ్వు యెక్కడవుంటున్నావ్?"

"ప్రస్తుతానికి ఈ ఊళ్ళోనే నా స్నేహితురాలి ఇంటికి వచ్చాను ఇంట్లోనించి పారిపోయి."

"ఎందుకు?"

"చిన్నతనంలోనే నాకు తల్లి దండ్రి పోయారు. మేనమామ దగ్గర పెరిగాను. అతనో దుర్మార్గుడు. అతనికి అన్ని దుర్గుణాలు వున్నాయి. డబ్బుకు ఆశపడి నన్నో

ముసలివాడికి ఇచ్చి పెళ్ళిచెయ్యటానికి సిద్ధపడ్డాడు. అందుకే ఇంట్లోనించి పారిపోయి వచ్చేశాను.

"మై గాడ్....గొప్ప ప్రమాదంలోనించి తప్పించుకున్నావు. అయితే ఇప్పుడు నీకు ఈ ఊళ్ళో ఓ ఆశ్రయం లేదు కాబట్టి మా ఇంటికే నిన్ను తీసుకు వెళతాను."

"మీ ఇంటికా!" అన్నది లీల వెంటనే—

"అవును."

"మీ మిసెస్ ఏమీ అనుకోదా అర్ధరాత్రి ఓ వయసులో వున్న అమ్మాయిని ఇంటికి తీసుకెళితే."

నవ్వాడు రమానంద్. "నీకా భయం అవసరం లేదు. నా భార్య రెండేళ్ళ క్రితం చనిపోయింది. ప్రస్తుతం ఆ ఇంట్లో ఒక్కడినే వుంటున్నాను."

కారు ఓ భవనం ముందు ఆగింది.

వెంటనే గేటు దగ్గర కునికిపాట్లు పడుతున్న గూర్ఖా కారు హారన్ విని ఉలిక్కిపడి లేచి గేటు తెరిచాడు.

కారు లోపలకు వెళ్ళింది.

రమానంద్ — లీల దిగి లోపలకు నడిచి మెట్లు యెక్కారు.

ఆమెకు ఓ గదిని చూపించి "ఈ గదిలో నువ్వు ఈ రాత్రికి పడుకోవచ్చు" అన్నాడు.

"థాంక్ యూ" అన్నది లీల.

అతను పక్కనే వున్న మరో గదిలోకి వెళ్ళి డ్రస్ ఛేంజ్ చేసుకుని తిరిగివచ్చి "ఒంటరిగా పడుకునే అలవాటు వున్నదా?" అన్నాడు రమానంద్ అదోలా నవ్వి.

లీల కూడా నవ్వి "ఏం మీకు అలవాటు లేదా?" అన్నది కొంటెగా.

"లేదు....అందుకే నా భార్య పోయినా మళ్ళీ పెళ్ళి

చేసుకోలేదు....బాగానే గడిచిపోతోంది...."

"క్షమించండి.... నేను అలాంటిదాన్ని కాదు. ఒకవేళ అలా కనపడితే అది నా తప్పుకాదు" అన్నది లీల.

"ఆల్ రైట్...నిన్ను నేను బలవంత పెట్టను ఇప్పటికే చాలా రాత్రయ్యింది. పడుకో....గుడ్ నైట్" అని ఆ గదిలోనించి వెళ్ళిపోయాడు రమానంద్.

లీల నవ్వుకున్నది. అనుకున్నట్టుగానే గూట్లో చేరింది. ఇక తన పని ప్రారంభించాలి అనుకున్నది తలుపుకు బోల్టు వేస్తూ.

# 4

రాత్రి పదకొండు గంట లయ్యింది. ఆ రోడ్డు నిర్మానుష్యంగా వున్నది.

ఆ రోడ్డు చివర ఆటోలోనించి దిగాడు శ్యామ్. అతని నెంబర్ 99. అతనుకూడా సీక్రెట్ సంస్థ సభ్యుడు.

అతను సిగరెట్టు పీలుస్తూ జేబులో చెయ్యి పెట్టుకుని ఆ రోడ్డులో కొంతదూరం నడిచాడు.

ఒక ఇంటిముందు ఆగిపోయాడు.

జేబులోనించి తాళంచెవి తీసి ఆ ఇంటికి వేసివున్న తాళాన్ని తెరిచి సిగరెట్టు విసిరేసి లోపలకు నడిచాడు. తలుపులను మూసి జేబులోనించి టార్చిలైటుతీసి వెలిగించి కిటికీ దగ్గరగా వెతికాడు.

అతనికో మడత పెట్టిన కాయితం కనిపించింది.

దాన్ని తీసుకుని మడతవిప్పి టార్చిలైటు వెలుతుర్లో గబగబా చదివాడు.

అందులో ఇలా వుంది.

"సరిగ్గా రాత్రి పన్నెండు గంటలకు పార్కు ముందువున్న గాంధీ బొమ్మ దగ్గర నిలబడు.

జీపులో నెంబర్ 100 రంగా వస్తాడు. ఇద్దరూ లక్షాధికారి రామదాసు ఇంటికి వెళ్ళండి. ఇంటి నంతా దోపిడీచేసి మన స్థావరానికి వచ్చేయండి- జాగ్రత్త — బాస్."

జేబులోనించి సిగరెట్ లైటర్ తీసి వెలిగించాడు. ఆ మంటలో కాగితాన్ని తగలబెట్టాడు. మసికాగానే దాన్ని బూటుకాలితో నలిపేశాడు శ్యామ్.

వాచీకేసి చూసుకున్నాడు. పదకొండు గంటలు దాటి పది నిమిషా లయ్యింది.

ఆ ఇంట్లోనించి బయటకు వచ్చాడు. తలుపులు మూసి తాళం వేశాడు.

గాంధీ బొమ్మ దగ్గరకు నడిచి వెళ్ళాలంటే అరగంట పడుతుంది. అందువల్ల అతను నడిచే అక్కడకు వెళ్ళాలని అనుకున్నాడు.

శ్యామ్ నడిచి పావుతక్కువ పన్నెండు గంటలకు గాంధీ బొమ్మ దగ్గరకు వెళ్ళాడు.

పన్నెండు గంటలు కావస్తున్నప్పుడు అక్కడికి జీపు వచ్చింది.

శ్యామ్ పక్కనే ఆగిపోయింది.

వెంటనే అందులో యెక్కాడు శ్యామ్. రివ్వున ముందుకు దూకింది జీపు.

డ్రయివింగ్ సీట్లో కూర్చున్న రంగా నోట్లో చుట్ట యెర్రగా కాలుతోంది.

శ్యామ్ ఓ సిగరెట్టు వెలిగించి "బాస్ పర్మిషన్ ఇచ్చాడా?" అని అడిగాడు.

"ఇచ్చాడు. అయితే తప్పని పరిస్థితుల్లో మాత్రమే హత్య చెయ్యమన్నాడు."

"రైట్....అలా అయితే మనం ధైర్యంగా ప్రొసీడ్ కావచ్చు....అయుధాలన్నీ వున్నాయిగా."

"ఈ రంగా సంగతి నీకు తెలుసుకదా" అంటూ నోట్లోనించి చుట్టతీసి పెద్దగా నవ్వాడు రంగా.

అతను దోపిడీలు—దొంగతనాలు హుషారుగా చెయ్య గలడు. అతను యెక్కువగా గళ్ళ మఫ్లరు వేసుకుంటూ వుంటాడు. సినిమాల్లో విలన్‌లాగే వుంటాడు.

పావుగంట తర్వాత జీపు ఓ చీకటి సందులోకి తిరిగింది.

ఆ వీధి బాగా చీకటిగా వుంది.

సన్నని సందు—చాలా ఇళ్ళకు వెనుకవైపు రోడ్డు అది.

గోడపక్కగా జీపును ఆపాడు రంగా—

ఆ గోడ కొంచెం యెత్తుగా వున్నది.

జేబులు తడుముకున్నాడు శ్యామ్. రివాల్వర్ చల్లగా తగిలింది.

రెండు నిమిషాల్లో గోడమీదికి యెక్కి లోపలకు దూకారు ఇద్దరూ—

లక్షాధికారి రామదాసు ఇంటి వెనుకవైపుకు నడిచారు. పై అంతస్థులో యెక్కడో సన్నగా దీపాలు వెలుగుతున్నాయి.

ప్రశాంతంగా వుంది భవనమంతా—

ఇంటి వెనుక వైపున వున్న చిన్న రేకుల షెడ్‌మీద నించి పైకి చేరుకున్నారు.

ఒక్కొక్క గదినీ పరిశీలనగా చూశారు.

అన్ని గదుల తలుపులూ మూసి వున్నాయి. ఓ గది ముందు నిల్చుని కిటికీ అద్దాలలోనించి లోపలకు చూశారు.

ఆ గదిలో లక్షాధికారి రామదాసు పెల్లికిలా పడుకుని నిద్రపోతున్నాడు.

ఆయన వయసు అరవై యేళ్ళు దాటి వుంటుంది. నల్లగా—పొడుగ్గా వున్నాడు. పొడుగాటి మీసాలు—నెత్తిమీద జుట్టులేదు—బట్టతల సన్నని లైటు వెలుగులో కాంతులీనుతోంది.

చిన్నగా నెట్టాడు తలుపును రంగా—

లోపల బోల్టు వేసివుండటంవల్ల అది తెరుచుకోలేదు.

"అద్దాలు పగలకొడదామా?" అడిగాడు రంగా—

"నీకు మతిపోయిందా? ఆ చప్పుడుకి అంతా లేస్తారు."

"మరేం చేద్దాం?"

"నువ్వే చూడు" అంటూ శ్యామ్ జేబులోనించి అద్దాలను కోసే రవ్వను బయటకు తీశాడు.

ఐదు నిమిషాల్లో రెండు కిటికీ అద్దాలను కోసేశారు. సులభంగా లోపల ప్రవేశించారు. ఆ కిటికీలకు వూచలు లేవు.

అప్పటికప్పుడే రంగా జేబులోనించి కర్చీఫ్ తీసి దాని మీద మత్తుమందును స్ప్రే చేశాడు. దాన్ని రామదాసుకు వాసన చూపించాడు.

క్షణంలో ఆయనకు స్పృహ పోయింది.

ఆయన దిండుకింద బీరువా తాళాలు దొరికాయి. ఆ పక్క గదిలోనే ఐరన్ సేఫ్ కనిపించింది.

వాళ్ళు దాన్ని తెరిచారు.

అందులో యెన్నో నోట్లకట్టలు—బంగారు నగలు కనిపించాయి.

"మై గాడ్...." అన్నాడు శ్యామ్ సంతోషంగా.

"ష్....అరవకు....త్వరగా మనం ఇక్కడినించి వెళ్ళి

పోవాలి" అన్నాడు రంగా.

ఆ సంపదంతా ఓ ప్లాస్టిక్ బ్యాగ్ లోకి సర్దేసి ఇద్దరూ నిలబడ్డారు. నిలబడుతూనే సేఫ్ తలుపును విసురుగా నెట్టాడు శ్యామ్.

చప్పుడయ్యింది.

"యూ ఫూల్ .... నువ్వు అన్నీ ఇలాంటి పనులే చేస్తావ్ త్వరగా నడు" అని ఆ గదిలోనించి రామదాసు గదిలోకి రాబోయాడు రంగా—

కాని అప్పటికే ఆలస్య మయింది.

పక్క గదిలో అప్పుడే మెలకువ వచ్చిన రామదాసు భార్య లేచి వచ్చింది.

వెళ్ళిపోతున్న ఆ ఇద్దర్నీ చూసి "దొంగలు..దొంగలు" అని అరిచింది.

ప్రమాదాన్ని పసిగట్టిన శ్యామ్ చటుక్కున జేబులో నించి రివాల్వర్ తీసి రెండుసార్లు పేల్చాడు.

ఆమె నేల కూలింది.

రివాల్వర్ కు సైలెన్సర్ వుండటంవల్ల మోత బయటకు రాలేదు.

రేకుల షెడ్ మీదనించి కిందకు దూకి చీకట్లో గోడ వైపుకు పరుగెత్తారు.

రెండు నిముషాల తర్వాత జీపు స్టార్టయి రివ్వున ముందుకు దూసుకు పోయింది.

## 5

"హల్లో....రాజేష్....ఎలా వుంది మా ఆతిధ్యం?" అన్నాడు బాస్ నవ్వుతూ.

సీక్రెట్ పోలీస్ రాజేష్ ఒక్కసారి బాస్ కళ్ళలోకి చూశాడు.

బాస్ నోట్లో సిగరెట్టు యెర్రగా వెలుగుతోంది. పొగ పైకి లేస్తోంది.

మరోసారి నవ్వి "ఏమిటలా చూస్తున్నావ్? ఇంతా మీ ఐ.జి. దగ్గర్నించి జవాబురాలేదు. ఆలోచించుకుని ఏ విషయం చెబుతానన్నాడు. అసలు నువ్వు మా సభ్యుడు నెం. ర్ 101 ని చంపినందుకు ప్రాణానికి ప్రాణంగా నిన్ను చంపేద్దామనుకున్నాను. కాని బతికివున్న 404 మీ పోలీసుల చేతిలో చిక్కాడు. నువ్వు అతన్ని తెలివి గానే దెబ్బతీశావు 101 వేషంలో—చనిపోయిన మనిషి కోసం బతికి వున్న మా సభ్యుడిని వదులుకోవటం నాకు ఇష్టంలేదు. అందుకే మా 404ని వదిలిపెడితే నిన్నుకూడా వదులుతానని బేరం పెట్టాను" అన్నాడు.

"నీ మాటలు నమ్మేంతటి మూర్ఖుడిని కాదు ... నీ రహస్యాలు తెలుసుకున్న నన్ను నువ్వు ప్రాణాలతో వదిలిపెడతావన్న నమ్మకం నాకు లేదు. ఇదంతా నాటకం అని నాకు తెలుసు...." అన్నాడు రాజేష్.

"కరెక్టు.... బాగా గ్రహించావ్.... నిజమే ... నిన్ను నేను వదిలిపెట్టను. ముందు నువ్వు మా గురించి ఎలాంటి రహస్యాలు తెలుసుకున్నావో నాకు తెలియాలి. మా మనుషులను నువ్వెలా అనుమానించావో నాకు చెప్పాలి.. అప్పుడే నిన్ను వదిలిపెట్టే యేర్పాటుచేస్తాను. అప్పటి వరకూ నిన్ను వదలను. ఇప్పుడు చెప్పు. 101 మీద నీకు అనుమానం యెలా వచ్చింది?" అన్నాడు బాస్.

రాజేష్ నవ్వాడు.

"చెప్పను..నువ్వు ఎన్ని హింసలు పెట్టినా చెప్పను... కావాలంటే నువ్వు నా ప్రాణాలు తీసుకో" అన్నాడు.

అతని చేతులను వెనక్కి విరిచి కట్టేశారు.

అతన్ని కాళ్ళు ఇనుప కుర్చీకి కట్టివేయబడ్డాయి.

ఈడ్చి అతని దవడమీద కొట్టాడు బాస్.

ఆ దెబ్బకు కదిలిపోయాడు రాజేష్.

"నువ్వింత మూర్ఖుడివనుకోలేదు. నా గురించి నీకు తెలీదు. రెడ్ ఇంజక్షన్ బాధను తట్టుకున్నావంటే నువ్వు సాధారణమైన మనిషివికాదని రుజువయ్యింది. అయితే నీలాంటి మనుషులను ఎలా హింసించాలో—రహస్యాలను యెలా రాబట్టాలో నాకు బాగా తెలుసు" అని బాస్ రెండుసార్లు చప్పట్లు కొట్టాడు.

ఆ గదిలోకి ఇద్దరు తోడేళ్ళలాంటి మనుషులు వచ్చారు.

వాళ్ళకు యేదో చెప్పాడు బాస్.

అక్కడినించి వెళ్ళిపోయి ఐదు నిమిషాల తర్వాత వాళ్ళు ఓ రెండు సీసాలను తీసుకుని వచ్చారు.

ఓ సీసాలోనించి జిగురుగా వున్న పదార్థాన్ని తీసి రాజేష్ వంటినిండా పూశారు. మిగిలినదాన్ని అతని తల మీద పోశారు. అది గులాబి రంగులో వుంది.

రెండో సీసాకు వున్న మూతను తీశారు. ఒక్కసారిగా అందులోనించి బయటకు వచ్చాయి యెర్రగా—లావుగా వున్న చీమలు.

వాటిని రాజేష్ తలమీద—వంటిమీద చల్లేశారు.

వణికిపోయాడు రాజేష్. ఆ చీమల గురించి అతనికి బాగా తెలుసు. అవి కుట్టాయంటే శరీరంలోకి పాడుగాటి సూదులను గుచ్చినంత బాధ కలుగుతుంది.

ఒకటి కాదు—రెండు కాదు—కొన్ని వేలచీమలు.

అవి శరీరంమీద పాకుతున్నాయి. ఆ జిగురుగా వున్న

పదార్థాన్ని తింటూ అది అయిపోయిన చోట కుట్టటం మొదలు పెట్టాయి.

బాధగా అరిచాడు రాజేష్—యెంత ప్రయత్నించినా ఆ బాధను భరించలేక పోయాడు.

పెద్దగా నవ్వాడు బాస్.

"ఎలా వుంది మా ప్రయోగం? వెరీ సింపుల్. కాని రిజల్టు చాలా గొప్పది. ఇప్పటికయినా నిజం చెప్పు.... మా సభ్యుడు నెంబర్ 101 ని నువ్వు యెలా అనుమానించావ్? మా సంస్థ గురించి నువ్వు ఏం తెలుసుకున్నావ్? నీకు కాకుండా మా సంస్థ గురించి ఇంకెవరికి తెలుసు?"

మళ్ళీ పెద్దగా అరిచాడు రాజేష్. అతని చర్మాన్ని తినేస్తున్నాయి ఆ రాకాసి చీమలు. నెత్తురు బయటకు వచ్చింది.

"నువ్వు ఇంకో పది నిమిషాల్లో చెప్పకపోతే ఈ చీమలు నీ ప్రాణాన్ని కూడా తినేస్తాయి."

"వద్దు....వద్దు.... నేనంతా చెబుతాను" అన్నాడు రాజేష్ బాధగా—

బాస్ నవ్వి ఆ తోదేళ్ళతో యేదో చెప్పాడు.

వాళ్ళు రెండు నిమిషాల్లో యేదో పౌడర్ తీసుకువచ్చి అతని శరీరంమీద చల్లారు. వెంటనే ఆ చీమలన్నీ కిందకు రాలిపోయి బిగుసుకుపోయాయి.

అప్పుడే రాజేష్‌కు స్పృహ పోయింది.

# 6

"నేను వెళ్ళిపోతాను" అన్నది లీల ఆ రోజు ఉదయం.

"ఎక్కడికి వెళతావు?" నవ్వుతూ అడిగాడు రమానంద్.

"ఎక్కడికో ...ఎక్కడయినా ఉద్యోగం సంపాదించుకోవాలి."

"నీకు ఉద్యోగం అవసరమా?"

"అవును. నేను ఒంటరివాన్ని.... ఉద్యోగం లేకుండా నేనెలా బతకగలను?" అన్నది విచారంగా.

"నేను తల్చుకుంటే నీకు ఈ క్షణంలోనే ఉద్యోగం ఇప్పించగలను. కాని ఇష్టంలేదు. యెందుకో తెలుసా?"

"ఎందుకు?" అన్నది లీల.

"నీలాంటి అందాల సుందరి ఉద్యోగం చేస్తూ నలుగురి దృష్టిలోనూ పడకూడదు. లీలా...నీతో మాట చెప్పనా?" ఆశగా అడిగాడు అతను.

"చెప్పండి."

"రాత్రంతా ఆలోచించాను. నిన్ను చూస్తుంటే నాకు నన్ను ఒంటరి వాడినిచేసి వెళ్ళిపోయిన నా భార్య గుర్తుకు వస్తోంది. నువ్వు ఒప్పుకుంటే నీకు ఆ స్థానం యివ్వాలని అనుకుంటున్నాను.... యేమంటావ్?" ఆమె కళ్ళలోకి చూస్తూ అడిగాడు.

ఆ మాట వినగానే లీల ఆశ్చర్యపడినట్టు నటించింది.

"నీకు ఇష్టమే కదూ."

"నా గురించి మీకు తెలీదు. నేనొక అనాధను. నాకు మీరు ఇలాంటి స్థానం ఇవ్వటం న్యాయమేనా?" అన్నది.

"న్యాయమే లీలా! నేను నిన్ను ప్రేమించాను. నిన్ను చూడగానే నా మనసు అదోలా అయిపోయింది. ప్లీజ్ కాదనకు. నా కోరిక మన్నించు."

"నన్ను ఆలోచించుకోనివ్వండి" అన్నది కొంచెం సేపటి తర్వాత.

"నీ యిష్టం. నీ నిర్ణయం నాకు సంతోషాన్ని కలిగించేలా వుండాలి. నేను వెళుతున్నాను. రాత్రి యేడు గంటలకే వచ్చేస్తాను" అని లేచి నిల్చున్నాడు.

అప్పుడే యెవరో లోపలకు వచ్చారు.

"హల్లో డాక్టర్....ఏమిటిలా వచ్చారు?" అన్నాడు రమానంద్ అతన్ని విష్ చేసి.

"మీతో పనుండి వచ్చాను. యెవరీమె? మీ బంధువా?" అన్నాడు లీలను తినేసేలా చూస్తూ.

"అవును నా మిసెస్‌కు కజిన్ అవుతుంది. నిన్ననే ఇక్కడికి వచ్చింది...." అన్నాడు రమానంద్.

"అలాగా" అన్నాడు అతను గుటకలు వేస్తూ.

అతని పేరు రాజన్. రమానంద్ ఫామిలీ డాక్టర్.

"రండి....బయటకు వెడదాం.... నేను యిప్పుడే బయల్దేరుతున్నాను" అంటూ ముందుకు కదిలాడు.

మరోసారి లీలకేసి వెకిలిచూపు చూసి రమానంద్ వెనుకే నడిచాడు డాక్టర్ రాజన్.

ఎప్పుడూ ఆడదాని మొహంచూడని మనిషేమో అనుకున్నది లీల అతడి వాలకం చూసి.

తర్వాత నవ్వుకున్నది.

రమానంద్ తన వలలో పడిపోయాడు. రాత్రికి కొంచెం బెట్టుచేసి అతనికి లొంగిపోవాలి అనుకున్నది.

వెంటనే ఒకసారి అటూ ఇటూ చూసింది.

అక్కడ నౌకర్లు ఎవ్వరూ కనిపించలేదు.

ఫోన్ దగ్గరకు నడిచింది. డయల్ చేసింది.

అవతలి వైపునించి ప్రకాష్ గొంతు వినిపించింది.

"హల్లో ప్రకాష్....లీలను మాట్లాడుతున్నాను. అంతా ఓ.కె....నువ్వు రాత్రి తొమ్మిది గంటలకు ఇంటి

వెనుకవైపునించి లోపలకు వచ్చెయ్యి...."

"అలాగే లీలా....నీ ఫోన్ కాల్ కోసమే యెదురు చూస్తున్నాను. తొమ్మిది గంటలకు అక్కడ వుంటాను...."

ఫోన్ పెట్టేసింది లీల.

'ఈ రాత్రికి రమానంద్ శృంగారం బ్లూ ఫిల్మ్‌గా మారిపోతుంది' అనుకుంది లీల.

# 7

బాధతో అరిచాడు 404. అతని ముక్కులోంచి నెత్తురు బయటకు కారింది.

ఇద్దరు పోలీసులు అతని తలకు నైలాన్ తాళ్ళు చుట్టి వాటికి రెండు కర్రలతో గట్టిగా బిగించి పట్టుకున్నారు.

"ఇడియట్ .... నీవు ఈ ఇన్‌స్పెక్టర్ విజయ్ గురించి తెలీదనుకుంటాను. హింసించటంలో నిజాన్ని పలికించటంలో నన్ను మించినవాళ్ళు లేరు. నీ ప్రాణం పోక ముందే నువ్వు నీ ముఠా గురించిన వివరాలు చెప్పు....లేక పోతే నీ శవం చేతనయినా నేను నిజం చెప్పిస్తాను" అన్నాడు ఇనస్పెక్టర్ విజయ్ కర్కశంగా

తలవూపాడు 404 చెప్పనన్నట్టు.

"బిగించండి" అన్నాడు విజయ్ వెంటనే.

వాళ్ళు తాళ్ళను మరింత గట్టిగా బిగించారు.

ఈ సారి 404 కనుగుడ్లు బయటకు పొడుచుకు వచ్చాయి.

"వద్దు....వద్దు" అని అరిచాడు 404.

"ఆపండి" అని "ఇంతకంటే భయంకరమైన ప్రయోగాలు చాలా వున్నాయి.... చెప్పు....మీ బాస్ ఎవరు? మీ ముఠాలో యెంతమంది మనుషులున్నారు? వాళ్ళ

కార్యక్రమాలు ఏమిటి? మీ స్థావరం ఎక్కడుంది?"
అడిగాడు.

404 మాట్లాడలేదు. అతనికి ఏ మూలనో ఆశవున్నది. బాస్ సీక్రెట్ పోలీస్ ప్రాణంతో తన ప్రాణాన్ని ముడి పెట్టాడు. బహుశ ఐ.జి. అందుకు ఒప్పుకుంటాడేమో! అలాంటప్పుడు తను సంస్థ రహస్యాలను చెప్పేస్తే తనని వదలిపెట్టరు. అందర్నీ పట్టుకుంటారు.

"ఏమిటీ ఆలోచిస్తున్నావ్? అబద్ధాలు చెబుదామనా?"

"కాదు" అన్నాడు 404 బలహీనంగా.

"అయితే చెప్పు....మీ స్థావరం ఎక్కడ వుంది?"

"సారీ! చెప్పను....నన్ను చంపెయ్యండి" అన్నాడు 404 వున్నట్టుండి.

ఆశ్చర్యపోయాడు విజయ్.

నేరస్థుల్లో చావుకు సిద్ధపడిన మనుషులను యింతవరకు చూడలేదు. చావుకు భయపడి యెంతోమంది నిజం చెప్పారు.

కాని ఇతను ఇంత సిన్సియర్‌గా చంపమని అడుగుతున్నాడంటే అతనిలో ఏ మూలనో బాధలకు తట్టుకోలేక నిజం చెప్పేస్తానసే భయం వుండివుంటుంది. అందుకే అలా అంటున్నాడు. అంటే తను మరింత బాధపెడితే నిజం చెప్పవచ్చు.

మరోసారి ప్రయత్నించాలి. అతనిలో తనమీద బాధలకు ఓర్చుకోగలనసే నమ్మకం పోవాలి. అప్పుడే తమపని సులభమవుతుంది.

"సారీ ...నీ కోరిక తీరదు....నిన్ను చావనివ్వం... నువ్వు బతికేవుండాలి....నీ గురించిన రహస్యాలను మాకు

చెప్పాలి. బాగా ఆలోచించుకో. మళ్ళీ వస్తాను" అని ఆ సెల్ లోనించి బయటకు వెళ్ళిపోయాడు ఇన్ స్పెక్టర్.

"ఏమంటున్నాడు అతను? ఏదయినా చెప్పేట్టు కన పడుతున్నాడా" అడిగాడు ఐ.జి. ఆఫ్ పోలీస్.

"చాలా మొండి మనిషి. బాగా శిక్షణ పొంది వుండాలి. చెప్పటంలేదు. తనని చంపెయ్యమంటున్నాడు. కాని—అతను త్వరలోనే అన్ని రహస్యాలను చెపుతాడనే నమ్మకం నాకు వుంది" అన్నాడు విజయ్.

"జాగ్రత్తగా చూడాలి. ఎటువంటి పరిస్థితుల్లోనూ అతను చావకూడదు. మనకున్న ఆధారం అతనొక్కడే" అంటూ వుండగా ఫోన్ మోగింది.

రిసీవర్ యెత్తి "ఐ.జి. స్పీకింగ్" అన్నాడు.

"ఏం నిర్ణయించుకున్నారు? మా మనిషిని వదిలిపెడితే మీ సీక్రెట్ పోలీస్‌ను వదలటానికి మేము సిద్ధంగా వున్నాం" అన్నాడు బాస్.

"కాని మేము సిద్ధంగా లేము. ఒక మనిషి ప్రాణం కోసం దేశ క్షేమాన్ని పణంగా పెట్టలేము. మా సీక్రెట్ పోలీస్ యేమైపోయినా మాకు లెక్కలేదు. దేశంకోసం యెంతోమంది త్యాగం చేశారు. నీలాంటి రక్తం పీల్చుకు తాగే రాబందులని పట్టుకునే రోజు త్వరలోనే వుంది. నీ దాగుడు మూతలు యెన్నాళ్ళో సాగవు. నీ మనిషిని వదిలిపెట్టం" అన్నాడు ఐ.జి. ఆఫ్ పోలీస్ గంభీరంగా.

అవతలివైపు బాస్ ఫోన్ డిస్‌కనెక్టు చేశాడు.

## 8

రమానంద్ కారును పోర్టికోలో ఆపి లోపలకు వచ్చాడు.

అతను యెంతో హుషారుగా వున్నాడు. అతని

చేతిలో నాలుగైదు ప్యాకెట్లు వున్నాయి. వాటిల్లో ఎంతో ఖరీదైన చీరలు వున్నాయి. అవన్నీ లీలకోసమే.

రాత్రి లీలతో తను ఎడ్వాన్స్‌గా పెళ్ళికి ముందు పొందిన అనుభవం అతడికి పదే పదే గుర్తుకు వస్తోంది.

"లీలా....లీలా!" అంటూ మేడమెట్లు ఎక్కాడు.

ఇంతలో నౌకరు పరుగెత్తుకుంటూ వచ్చి "మీరు వెళ్ళిన అరగంట తర్వాత లీలమ్మగారు బయటకు వెళ్ళారు. ఇంతవరకు తిరిగిరాలేదు" అని చెప్పాడు.

'ఇంతసేపు ఎక్కడికి వెళ్ళింది?' తనలో తనే అనుకున్నాడు రమానంద్.

"వెళుతూ యెక్కడికి వెళుతున్నదీ నీతో చెప్పలేదా?"

"లేదయ్యా....ఎక్కడి నుంచో ఫోన్ వచ్చింది. ఫోన్లో మాట్లాడి వెంటనే గబగబా బయటకు వెళ్ళిపోయారు."

"అలాగా" అంటూ పైకి లీల గదిలోకి వెళ్ళిపోయాడు రమానంద్.

ఆ గది బోసిపోతున్నట్టుగా అనిపించింది. ఇంతకీ తన లీల యెక్కడికి వెళ్ళింది? ఆమెకు యెవరి దగ్గర్నించి ఫోన్ వచ్చింది?

ఎంత ఆలోచించినా అతనికి లీల యెక్కడికి వెళ్ళి వుంటుందో అర్థంకాలేదు.

ఒకవేళ ఆమె స్నేహితురాలి ఇంటికి వెళ్ళిందేమో! ఏమో! అలాగయితే నౌకర్కి చెప్పకుండా యెందుకు వెళుతుంది?

అసలేం జరిగింది?

లీల తనని పెళ్ళిచేసుకోటానికి ఒప్పుకున్నది.

తన జీవితానికి మళ్ళీ వెలుగు వచ్చిందని అనుకున్నాడు. కాని ఇంతలోనే ఇలా చెప్పకుండా యెందు వెళ్ళి పోయింది?

రమానంద్ అలా ఆలోచిస్తున్నప్పుడే నౌకరు ఆ గదిలోకి వచ్చాడు. అతని చేతిలో సీలు చేసిన యెరుపు రంగు కవరు వున్నది.

"మధ్యాహ్నం ఈ కవర్ని ఎవరో ఒక మనిషి మీకు ఇవ్వమని ఇచ్చి వెళ్ళాడు" అన్నాడు కవర్ని అతనికి ఇస్తూ—

ఇచ్చి వెళ్ళిపోయాడు.

ఆ కవర్ని ఓపెన్ చేశాడు. అందులో వున్న నాలుగు ఫోటోలను బయటకు తీశాడు.

ఒక్కసారిగా అతని గుండె ఆగిపోతున్నట్టు అనిపించింది. అందులో లీల—తను నగ్నంగా పరుపుమీదపడి దొర్లుతున్నారు. నాలుగు భంగిముల్లో వున్నాయి ఆ ఫోటోలు.

రమానంద్ ఒళ్ళు జలదరించింది.

అతని కళ్ళు తిరిగాయి.

ఈ ఫోటోలు ఎలా వచ్చాయి? ఎవరు తీశారు?

దారుణంగా వున్నాయి ఆ ఫోటోలు.

అతనికి యెంత ఆలోచించినా ఆ ఫోటోలు యెవరు తీశారో అర్థంకాలేదు.

అతనలా ఆలోచిస్తున్నప్పుడే ఫోన్ మోగింది. గబగబా వెళ్ళి రిసీవర్ తీసుకున్నాడు.

"రమానంద్‌ని మాట్లాడుతున్నాను" అన్నాడు.

అతవలివై పునించి నవ్వు వినిపించించిది.

"ఎవరు?"

"తొందరెందుకు రమానంద్....ఇంతకీ నువ్వు నీ శృంగార ఫోటోలను చూసుకున్నావా? ఎలా వున్నాయి? అందంగా వున్నాయి కదూ! నిన్ను ఎప్పటినించో నీడలా వెంటాడుతున్నాం. నీ చర్యలను కనిపెడుతున్నాం. చివరకు యేదో ఒక యువతితో నీ శృంగారం మా కెమెరాకు దొరికిపోతుందని నాకు తెలుసు. కేవలం ఆ నాలుగు ఫోటోలే తీశామని అనుకుంటున్నావా రమానంద్..కాదు. నీ శృంగారన్నంతా గొప్ప బ్లూ ఫిల్మ్‌గా తీశాం. అందులోని కేవలం నాలుగు ఫోటోలను మాత్రమే నీకు శాంపుల్‌గా పంపించాం" ఆ మనిషి చెబుతున్నాడు.

ఊపిరి బిగబట్టి వింటున్నాడు రమానంద్. అతనికి అంతా అయోమయంగా వున్నది.

"వింటున్నావా? ఇంతకీ ఇదంతా యెందుకోసం అనుకుంటున్నావ్ .... కృష్ణవేణి బ్యాంకు దోపిడీకి నువ్వు మాతో చేతులు కలపాలి. అర్థమయ్యిందా?"

షాక్ కొట్టినట్టు అదిరిపడ్డాడు రమానంద్.

"నో.... నేను ఒప్పుకోను...." అన్నాడు వెంటనే.

"నువ్వు ఒప్పుకుని తీరుతావు రమానంద్....ఎందుకో తెలుసా? లేకపోతే లీలతో నీ శృంగారం వున్న బ్లూ ఫిల్మును కొన్ని వందల ప్రింట్లువేసి అందరికీ ఉచితంగా పంచిపెడతాము. ఫోటోలను వాల్ పోష్టర్లుగా వేసి ప్రతి గోడకీ అంటిస్తాము. అప్పుడు నీ పరువు—మర్యాద ఏమవుతాయో నీకు తెల్సు. అందుకోసం ఐనా నువ్వు మాతో చేతులు కలుపుతావని మాకు తెలుసు. అవును కదూ?"

"అయినా సరే బ్యాంకు దోపిడీకి నేను ఒప్పుకోను" మొండిగా అన్నాడు రమానంద్.

"అయినా సరే నువ్వు ఒప్పుకుంటావు రమానంద్.

ఎందుకంటే నువ్వు నీ లైఫ్ పార్ట్‌నర్‌గా చేసుకుందామని కలలుకన్న లీల ఇప్పుడు మా చేతుల్లో బందీగా వుంది. నువ్వు ఒప్పుకోకపోతే ఆమె శవాన్ని నీకు బహుమతిగా పంపిస్తాం" అన్నాడు పెద్దగా నవ్వి.

"నిజంగానా!" అన్నాడు అతను కంగారుగా.

"అవును....నీకు నమ్మకం లేదా? నీకు యాక్సిడెంట్ జరిగిందని ఫోన్ చేసి చెప్పి ఆమె బయటకు రాగానే తెలివిగా ఇక్కడికి తీసుకువచ్చాము. కావాలంటే నీ లీల మాటలను విను. నీకే తెలుస్తుంది" అన్నాడు అతను.

వెంటనే ఫోన్లో లీల గొంతు వినపడింది.

"ఏమండీ నన్ను కాపాడండి. ఈ దుర్మార్గులు నన్ను చిత్రహింసలు పెడుతున్నారు. మోసం చేసి నన్ను ఇక్కడికి తీసుకువచ్చారు. దిక్కులేనిదాన్ని... మిమ్మల్నే నమ్ముకున్నాను. ప్లీజ్...యెలాగయినా నన్ను రక్షించండి" అన్నది ఏడుస్తూ.

"లీలా!" అన్నాడు రమానంద్ ప్రేమగా.

అప్పుడు అతను లైన్లోకి వచ్చి "విన్నావుగా నీ లీల మాటలు. ఆలోచించుకో రమానంద్. నువ్వు కాదంటే ఆమె శవం నీకు దర్శనమిస్తుంది" అన్నాడు.

"ప్లీజ్....నన్ను తొందరపెట్టకండి. నన్ను ఆలోచించుకోనివ్వండి. నాకు కొంత వ్యవధి కావాలి" అన్నాడు రమానంద్.

"ఆల్‌రైట్....నీకు నలభైయెనిమిది గంటల టైము ఇస్తున్నాను. ఈ లోపల నువ్వు బాగా ఆలోచించుకో. నువ్వు మాతో చేతులు కలుపుతావనే ఆశిస్తాను. లేకపోతే ఏం జరుగుతుందో నీకు తెలుసు" అని ఫోన్ పెట్టేశాడు.

రమానంద్ రిసీవర్ పెట్టేసి అక్కడే వున్న కుర్చీలో కూలబడిపోయాడు. అతని తలంతా వెయ్యి సుత్తులతో కొడుతున్నంత బాధగా అనిపించింది.

దుర్మార్గులు. ఎంత పని చేశారు? తనని తెలివిగా వాళ్ళ గుప్పిట్లో ఇరికించుకున్నారు లీలను బంధించి—

లీల అందమైన, అమాయకంగా వుండే మొహం అతని కళ్ళముందు కదిలింది. ఆమె తనని రక్షించమని ప్రాధేయ పడటం ఇంకా చెవుల్లో వినిపిస్తూనే వుంది.

ఎలాగయినా ఆమెను రక్షించాలి.

ఎలా?

అందుకు వాళ్ళతో చేతులు కలపాలి బ్యాంకు దోపిడిలో—కాని అందుకు తన మనసు ఒప్పుకోదు.

మొత్తంమీద ఏదో ఒకటి చెయ్యాలి. ఏం చెయ్యాలి?

ఒళ్ళంతా అదోలా జ్వరం వచ్చినట్టు అయిపోయింది.

వంటమనిషి భోజనానికి రమ్మని పిల్చాడు. తనకు ఒంట్లో బావుండలేదని, జ్వరం వచ్చిందనీ చెప్పాడు రమానంద్.

ఆ తర్వాత ఆ ఫోటోలను ఒకచోట దాచి బెడ్ మీద వాలిపోయి కళ్ళు మూసుకున్నాడు.

గంట సమయం గడచిన తర్వాత డాక్టర్ రాజన్ మెడికల్ కిట్‌తో లోపలకు వచ్చాడు.

అతని మాటలకు కళ్ళు తెరిచిన రమానంద్ ఆశ్చర్యంగా "ఏమిటి? ఇలా వచ్చారు?" అన్నాడు.

"మీకు జ్వరంగా వుందని మీ వంటమనిషి ఇంతకు ముందే ఫోన్ చేశాడు. అందుకే వచ్చాను" అంటూ కొంచెం దూరంలో వున్న కుర్చీని దగ్గరకు లాక్కుని రమానంద్ చెయ్యి పట్టుకుని చూశాడు.

కొంచెం వేడిగా వుంది.

"నాకు బాగానే వుంది...." అన్నాడు రమానంద్.

"కాదు .... మీకు కొద్దిగా ఫీవర్ తగిలింది. ఒక ఇంజక్షన్ ఇస్తాను. అదే తగ్గిపోతుంది."

"వద్దు....నాకు ఇంజక్షన్ వద్దు డాక్టర్."

"మీ ఇష్టం....అయినా ఏమిటి మీ మొహం అదోలా వుంది?"

"ఎలా వుంది?" కంగారుగా అడిగాడు.

"అదోలా వుంది....కళ లేదు....బాధపడుతున్నట్టుగా వుంది. యేదయినా పర్సనల్‌గా బాధపడుతున్నారా?"

రమానంద్ వెంటనే యేమీ మాట్లాడలేకపోయాడు. తన మనసులో వున్న బాధ డాక్టర్‌తో చెప్పుకుంటే అతను యేదయినా ఉపాయం చెబుతాడేమోనని అనుకున్నాడు.

అందుకే డాక్టర్ రాజన్‌కి తన దిగులుకు కారణం చెప్పేశాడు.

"మై గాడ్ .... మీరెంత ప్రమాదంలో ఇరుక్కుపోయారు?" అన్నాడు డాక్టర్ ఆందోళనగా—

"అవును. నన్నిలాంటి సమస్యలో ఇరికించి బ్యాంకు దోపిడీకి తమతో చేతులు కలపమంటున్నారు."

"ఇంతకీ మీరేం నిర్ణయించుకున్నారు?"

"ఏమీ నిర్ణయించుకోలేను. నాకు లీలను కాపాడుకోవాలని వుంది. అయినా ఆమెకోసం బ్యాంకు దోపిడీకి వాళ్ళకు సహాయపడలేను. ఎటూ తేల్చుకోలేక పోతున్నాను. నాకు పోలీసులను కలిసి వాళ్ళ సహాయం తీసుకోవాలని వుంది."

"మై గాడ్ ....ఈ విషయం వాళ్ళకు తెలిసిందంటే

లీలను ప్రాణాలతో వుంచుతారా? ఈ విషయం గురించి ఆలోచించావా?" అన్నాడు డాక్టర్ రాజన్.

"అవును. నాకూ_డా అదే భయంగా వుంది" అన్నాడు రమానంద్.

"ఏమయినా జాగ్రత్తగా ఆలోచించండి. త్వరపడి యే నిర్ణయమూ తీసుకోకండి. మీ నిర్ణయం మీద నే లీల భవిష్యత్తు ఆధారపడి వున్నది" అన్నాడు డాక్టర్.

అతనికి ఫోటోల గురించి_బ్లూ ఫిల్మ్ గురించి చెప్ప లేదు రమానంద్. లీలను యెత్తుకుపోయిన విషయమే చెప్పాడు.

డాక్టర్ వెళ్ళిపోయాడు.

రమానంద్ ఆలోచనల్లో మునిగిపోయాడు. కొంచెం సేపటి తర్వాత అతనికి డిటెక్టివ్ రణధీర్ గుర్తుకు వచ్చాడు.

# 9

"ఇక నిన్ను హింసలు పెట్టదల్చుకోలేదు" అన్నాడు బాస్.

"ఎందుకు? ఎన్ని హింసలు పెట్టినా నేను నీకు ఏమీ చెప్పనని నిర్ణయానికి వచ్చావా?" అన్నాడు సీక్రెట్ పోలీస్ రాజేష్.

"కాదు. నీచేత చాలా సులభంగా నిజాన్ని చెప్పించ గలిగే ఓ యంత్రాన్ని తెప్పించే ప్రయత్నాలు చేస్తు న్నాను."

"అప్పటిదాకా నేను బతికివుంటే కదా! ఒకవేళ నువ్వు నిజంగానే అలాంటి యంత్రాన్ని తీసుకువస్తే నేను వూపిరి బిగపట్టి చచ్చిపోతాను. అంతేకాని నీకు యేమీ చెప్పను" అన్నాడు రాజేష్.

"ఆల్ రైట్ ....అదీ చూద్దాం. నువ్వు చచ్చిపోయినా ఫర్వాలేదు. ఎందుకంటే మీ ఐ.జి. మా సభ్యుడు 404ని వదిలిపెట్టటానికి ఒప్పుకోలేదు. కావాలంటే నిన్ను చంపెయ్యమన్నాడు. ఆయనకు దేశక్షేమం ముఖ్యమట. అందుకోసం నువ్వు త్యాగం చేశావని అనుకుంటాడుట. అందుకే ఇప్పుడు నేను మరో యెత్తు వేశాను. వెంటనే 404ని వదిలిపెట్టకపోతే ఈ నగరంలో వున్న వంతెనల్లో యేదో ఒకదాన్ని బాంబులతో పేల్చివేస్తానని బెదిరించ బోతున్నాను. రిజల్టు యెలా వుంటుందో చూడాలి" అంటూ అక్కడినించి పక్కనే వున్న మరో గదిలోకి వెళ్ళాడు బాస్.

రాజేష్ గుండెలు చిన్నగా అదిరాయి.

బాస్ సంగతి తనకు తెలుసు. అనుకున్నంత పని చేస్తాడు. వాడొక దేశద్రోహి. నిజంగానే వంతెనలను బాంబులతో పేల్చివేస్తాడు. ఐ.జి, బాస్ బెదిరింపులకు లొంగడు. ఆయన పట్టుదల మనిషి.

ఐదు నిముషాల తర్వాత బాస్ కోపంగా లోపలకు వచ్చి "ఈ ఐ.జి. గొప్ప మూర్ఖుడిలా వున్నాడు. నగరాన్నంతా నాశనం చేసినా మా మనిషిని వదిలిపెట్టనని అన్నాడు. ఇక తప్పదు. ఈ రాత్రి ఒంటి గంటకు నగరంలో ఉన్న రెండు ముఖ్యమైన వంతెనలను బాంబులతో కూల్చివేసే యేర్పాట్లు చేయిస్తాను" అన్నాడు.

"పోలీసుల మీది కోపంతో ప్రజల ఆస్తిని నష్టపర్చటం అన్యాయం" అన్నాడు రాజేష్.

"న్యాయమో—అన్యాయమో నాకు అనవసరం.... నేను అనుకున్నది అనుకున్నట్టు జరగటమే నాకు కావాలి. అందుకోసం నేను ఎన్ని ఘోరాలనైనా చేస్తాను.

మా సభ్యుడు 101ని నువ్వు చంపినందుకు నేను కసి తీర్చుకుంటాను. ఈ నగరాన్ని అల్లకల్లోలం చేస్తాను. మొత్తం దేశాన్నే గడగడలాడిస్తాను" అన్నాడు శివ మెత్తిన వాడిలా—

## 10

గేటు కిర్రుమన్న చప్పుడు వినిపించింది.

ఎదురుగా వున్న మేడమీద గదిలో కిటికీ దగ్గరగా కూర్చుని డిటెక్టివ్ నవల చదువుతున్న ఈశ్వర్ తలెత్తి చూశాడు.

ఎదురింటి గేటు తీసుకుని ఒక వ్యక్తి తలుపుల దగ్గరకు నడిచి ఒకసారి అటూ ఇటూ చూశాడు. ఎవ్వరూ తనని చూడటంలేదని నిర్ధారణ చేసుకున్న తర్వాత జేబులోనించి మడతపెట్టిన ఓ కాయితాన్ని తీసి కిటికీ సందులోనించి లోపల పడేసి గబగబా అక్కడినించి బయటకు వచ్చి రోడ్డుమీద పెద్ద పెద్ద అంగలు వేస్తూ వెళ్ళిపోయాడు.

అతను నల్లగా—పొడుగ్గా వున్నాడు. నల్లపాంటు వేసుకున్నాడు. యెర్రటి పువ్వుల షర్టు వేసుకున్నాడు.

ఈశ్వర్‌కు అతని ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది.

ఎవరతను?

ఇంతకుముందు రెండుసార్లు తను చూస్తూ వుండగా ఇలాగే కిటికీ సందులోనించి మడతపెట్టిన కాగితాలను లోపల పడేసి వెళ్ళిపోయాడు.

తర్వాత ఆ ఇంట్లో వుండే మనిషి యెప్పటికో వచ్చేవాడు. అయినా ఒక్క మనిషికి ఆ ఇల్లు ఎందుకు? అందులో కూడా అతను యెప్పుడూ వుండడు.

ఎప్పుడో వస్తాడు....ఏం చేస్తాడో యెవ్వరికీ తెలీదు. అసలు అతని గురించి యెవ్వరికీ తెలీదు.

అతని ఉద్యోగం ఏమిటి?

లోపలకు విసిరిన ఆ కాయితంలో ఏమున్నది?

ఒకసారి చూడాలనుకున్నాడు ఈశ్వర్ —

నవలను టేబిల్ మీద వుంచి లేచి నిల్చున్నాడు. అలమార్లో వున్న ఇనుప చువ్వను తీసుకుని కిందికి వచ్చాడు.

రోడ్డుమీదకు వచ్చి ఒకసారి రెండువైపులా చూశాడు.

గబుక్కున గేటు తెరుచుకుని వెళ్లాడు.

అక్కడంతా చీకటిగా వుంది.

అతడి గుండెలు చిన్నగా కొట్టుకుంటున్నాయి. యెవరైనా చూస్తే తనని దొంగ అని అనుకుంటారు.

ఇనుపచువ్వలతో తాళాన్ని తెరిచి లోపలకు వెళ్లాడు. కిటికీ దగ్గరగా వెతికాడు.

మడత పెట్టిన కాయితం దొరికింది.

జేబులోనించి సిగరెట్ లైటర్ తీసి వెలిగించి ఆ వెలుతుర్లో ఆ కాయితంలో యేమున్నదో గబగబా చదివాడు.

అందులో ఇలా వుంది.

"ఈ రాత్రి పదకొండు గంటలకు అత్యవసర సమావేశం వుంది. హాజరు అవు —బాస్."

తన అనుమానం నిజమైనందుకు అతడికి సంతోషం కలిగింది. సందేహం లేదు. ఈ ఇంట్లో వుంటున్న మనిషి ఏదో దేశద్రోహుల ముఠాలో పనిచేస్తున్నాడు.

వెంటనే ఆ కాయితాన్ని మళ్ళీ మడతపెట్టి అక్కడే

వదిలి తలుపు మూసి తాళంవేసి క్షణంలో తన గదిలోకి వచ్చాడు ఈశ్వర్.

ఇప్పుడు తనేం చెయ్యాలి?

ఇది చాలా ముఖ్యమైన సమాచారం. పోలీసులకు అందచేయాలి. కాని-పోలీసులు తన మాట నమ్ముతారా? ఒకవేళ నమ్మినా పోలీసులు తనకోసం కాపలా కాస్తున్నారని అతను పసిగడితే ఆ మనిషి అసలు ఈ ఇంట్లోకే రాకపోవచ్చు. కాబట్టి తను పోలీసులను కలవకూడదు.

మరెవర్ని కలవాలి?

అతనికి ఉన్నట్టుండి ఈ మధ్యనే ఇద్దరు హంతకులను ఎంతో తెలివిగా పట్టుకున్న డిటెక్టివ్ రణధీర్ గుర్తుకు వచ్చాడు.

వెంటనే ఈశ్వర్ గదికి తాళంపెట్టి రోడ్డుమీదకు వచ్చాడు.

## 11

అంతా చెప్పి "నన్నీ ప్రమాదంలోనించి మీరే రక్షించాలి" అన్నాడు రమానంద్ డిటెక్టివ్ రణధీర్‌తో.

అతను సిగరెట్టు పొగను బయటకు వదులుతూ నవ్వి "మీరు చాలా సులభంగా మోసపోయారు" అన్నాడు.

"ఎలా?"

"అవును.... ఇదంతా ఒక ప్లాను ప్రకారం జరిగిందని క్లియర్‌గా తెలుస్తోంది. లీల ఆ ముఠా మనిషే. వాళ్ళు నాటకమాడి ఆమెను మీ దగ్గరకు పంపించారు. ఆమె మిమ్మల్ని లోబరుచుకుంది. మీతో కలిసి వున్నప్పుడు ఫిల్ము తీసేలా తన మనిషితో యేర్పాట్లు చేయించి వుండాలి. లేకపోతే అంత సులభంగా ఓ వ్యక్తి మీ ఇంట్లో ప్రవేశించి భయంలేకుండా ఫిల్ము తీసుకుని వెళ్ళ

లేదు.

అంతేకాదు, మీకు యాక్సిడెంటు జరిగిందని తెలిసి నప్పుడు ఇంట్లో వున్న వంటమనిషికిగానీ, నౌకర్లకుగానీ చెప్పకుండా బయటకు ఎందుకు వెళుతుంది? వీటన్నింటినీ దృష్టిలో ఉంచుకుని ఆలోచిస్తే ఇదంతా ముందుగానే వేసుకున్న పథకం ప్రకారం జరిగిందని తెలుస్తోంది" అన్నాడు.

"మై గాడ్ ....నిజమే. ఇప్పుడు నాకూ అలాగే అని పిస్తోంది. తప్పు నాదే. నా తెలివితక్కువతనంవల్ల ప్రమా దంలో దిగబడిపోయాను. ఇప్పుడు నేనేం చేసేది?" అని అడిగాడు బాధగా.

"మళ్ళీ ఆ మనిషినించి మీకు ఫోన్ వస్తుంది. అప్పుడు మీరు వాళ్ళకు బ్యాంకు దోపిడీకి సహాయపడటానికి ఒప్పుకుంటున్నట్టుగా చెప్పండి. మీరు ఏం చెయ్యవల సింది చెబుతారు. ఆ తర్వాత వాళ్ళను యెలా పట్టు కోవాలో నేను ఆలోచిస్తాను" అన్నాడు రణధీర్ సిగరెట్టు పీకను యాష్ట్రేలో నొక్కి.

"అలాగే. నేను మీరు చెప్పినట్టే చేస్తాను. మరి మీ ఫీజు" అన్నాడు రమానంద్.

"అడ్వాన్స్‌గా వెయ్యి రూపాయలు ఇవ్వండి."

రమానంద్ వెయ్యిరూపాయలు రణధీర్‌కి ఇచ్చి అతనికి థాంక్స్ చెప్పి బయటకు వచ్చి రోడ్డుపక్కగా ఆపివున్న తన కారు దగ్గరకు నడిచాడు.

అక్కడ కారును ఆనుకుని నిలబడివున్న సన్నని— పొడుగాటి మనిషిని చూసి "మీరా.... డాక్టర్ .... ఇక్కడ నిలబడ్డారేమిటి?" అన్నాడు రమానంద్ ఆశ్చర్యంగా—

"నీకోసమే ఎదురుచూస్తున్నాను. నువ్వు ఇలాంటి పని ఏదో చేస్తావని నేను అనుకుంటూనే వున్నాను. అందుకు ఫలితం అనుభవించు" అంటూ చటుక్కున ప్యాంటు జేబులోనించి సైలెన్సర్ అమర్చి వున్న రివాల్వర్ తీసి రమానంద్ గుండెలకేసి రెండుసార్లు పేల్చాడు.

"అమ్మా" అని అరిచి కుప్పలా కూలిపోయాడు రమానంద్.

డాక్టర్ రాజన్ రివ్వున పరిగెత్తి రోడ్డు పక్కనే ఆపివున్న మోటార్ సైకిల్ను స్టార్టుచేసి చూసుకుపోయాడు.

"రాజన్....నువ్వింతటి దేశద్రోహివని అనుకోలేదు" అని గొణుగుతూనే ప్రాణాలు వదిలాడు రమానంద్.

రమానంద్ కేక వినిపించి రివ్వున బయటకు పరిగెత్తుకుంటూ వచ్చాడు డిటెక్టివ్ రణధీర్.

కారు పక్కగా బోర్లా పడివున్న శవం కనిపించింది. రక్తం రోడ్డుమీదకు కారుతోంది. రోడ్డుమీదకు చూశాడు.

ఎవ్వరూ కనిపించలేదు.

సరిగ్గా అప్పుడే ఓ రిక్షా వచ్చి అక్కడ ఆగింది. అందులోనించి ఈశ్వర్ దిగి రణధీర్ను గుర్తుపట్టి పలకరించాడు.

"ఎవరు మీరు?"

"నా పేరు ఈశ్వర్....బియస్సీ ఫైనలియర్ చదువుతున్నాను" అంటూ తను వచ్చిన పనేమిటో చెప్పాడు.

ఒక్కక్షణంలోనే రణధీరుకు అంతా అర్థమయి పోయింది. అనుమానంలేదు. ఆ వ్యక్తి ఎవరో రమానంద్ను బ్లాక్ మెయిల్ చేసిన ముఠాలోని మనిషి అయి

వుంటాడు. త్వరగా వెళ్ళాలి. వాళ్ళ స్థావరం ఎక్కడో తెలుసుకొని అందరినీ బంధించాలి.

"ఒక్క క్షణంలో వస్తాను" అని లోపలకు వెళ్ళి ఇన్‌స్పెక్టర్ విజయ్‌కి ఫోన్ చేశాడు. అతను పలకగానే "మా ఆఫీసు ముందు ఓ హత్య జరిగింది. నేనో ముఖ్యమైన పనిమీద వెళుతున్నాను. రెడీగా వుండండి. ఏ క్షణంలో ఐనా నా దగ్గర్నుంచి మీకు ఫోన్ కాల్ రావచ్చు.... ప్రస్తుతం యిక్కడకు వచ్చి ఈ శవాన్ని చూడండి. హతుడి పేరు రమానంద్. కృష్ణవేణి బ్యాంకు డైరెక్టర్లలో ఒకరు. మిగిలిన విషయాలు తర్వాత చెబుతాను" అని ఫోన్ పెట్టేసి తలుపులు మూసి తాళంపెట్టి బయటకు వచ్చాడు.

పావుగంట తర్వాత ఇద్దరూ ఈశ్వర్ మేడమీద గదిలోకి వెళ్ళి కిటికీ దగ్గరగా కూర్చున్నారు.

పది గంటలు దాటుతున్నప్పుడు శ్యామ్ గేటు తెరుచుకొని లోపలకు వెళ్ళాడు. తాళంతీసి యింట్లో ప్రవేశించాడు.

ఐదు నిముషాలు గడిచాయి.

అతను బయటకు వచ్చాడు. మళ్ళీ తలుపులు మూసి తాళం వేశాడు.

"అతనే ఆ యింట్లో వుండే మనిషి...." అన్నాడు ఈశ్వర్.

రోడ్డుమీదకు వచ్చి గబగబా నడవటం మొదలు పెట్టాడు శ్యామ్.

"మీరు యిక్కడే వుండండి.... నేను అతన్ని ఫాలో అయి వాళ్ళ స్థావరం ఎక్కడో తెలుసుకొంటాను" అని కిందికి దిగివచ్చాడు రణధీర్.

అప్పుడే శ్యామ్ ఆ సందు మలుపు తిరిగి మెయిన్

రోడ్డు ఎక్కాడు....గబగబా అడుగులు వేశాడు రణధీర్.

శ్యామ్ జేబులో చేతులు పెట్టుకుని షికారుకు వెళు తున్న మనిషిలా నడుస్తున్నాడు. అతనికి కొంచెం దూరంలో దిక్కులు చూస్తూ ఆ వూరికి కొత్తగా వచ్చిన మనిషిలా వెంటాడుతున్నాడు రణధీర్.

ముందు నడుస్తున్న మనిషి టాక్సీ ఎక్కుతాడేమో అనుకున్నాడు రణధీర్....కాని అతను ఎన్ని టాక్సీలు ఎదురువచ్చినా ఒక్కదాన్నీ ఆపే ప్రయత్నం చెయ్యలేదు.

అరగంట తర్వాత యిద్దరూ వూరి బయటకు వచ్చారు.

శ్యామ్ నడక వేగాన్ని పెంచాడు.

రోడ్డుమీద దీపాలు లేవు. అంతా చీకటిగా వున్నది. అందువల్ల నే యెలాంటి బెదురూ లేకుండా నడుస్తు న్నాడు శ్యామ్.

అప్పుడప్పుడు ఏవో వాహనాలు వాళ్ళకు ఎదురువస్తు న్నాయి.

పొలాలు దాటి నడుస్తున్నాడు శ్యామ్...అతనికి కొంచెం దూరంలో వున్నాడు రణధీర్. అతని చెయ్యి జేబులో వున్న రివాల్వర్ మీద సిద్ధంగా వుంది. అతను అప్పుడప్పుడు వెనక్కి తిరిగిచూస్తున్నాడు.

ఉన్నట్టుండి ఓ మట్టిరోడ్డులోకి తిరిగాడు శ్యామ్.... ఐదు నిముషాలు నడవగానే పాడుబడినట్టున్న ఓ భవనం కనిపించింది రణధీర్ కి. దాని బయట ఏదో పెయింట్ పోయిన బోర్డు వేల్లాడుతోంది.

రణధీర్ అక్కడకు వచ్చేసరికి అతనికి ముందు వచ్చిన మనిషి కనపడకుండా పోయాడు.

ఇప్పుడేమిటి చెయ్యటం? అనుకొంటూ అక్కడే నిల బడిపోయాడు డిటెక్టివ్ రణధీర్.

# 12

అప్పటివరకూ తనకు ఆ విషయం గురించి రానందుకు తనని తిట్టుకున్నాడు సీక్రెట్ పోలీస్ రాజేష్. అతని చేతులు వెనక్కి విరిచికట్టేశారు.

కుడిచేతి రెండువేళ్ళను ప్యాంటు వెనుక జేబులోకి పోనిచ్చి సిగరెట్ లైటర్ని బయటకు తీసి బటన్ని ప్రెస్ చేశాడు. వెలిగింది. చేతికి కట్టివున్న నైలాన్ తాడుకు అంటుకుంది మంట.

చెయ్యి కూడా కాలుతోంది. అయినా బాధతో పళ్ళు బిగపట్టి ఓదార్చుకున్నాడు రాజేష్.

రెండు నిముషాల తర్వాత చేతి కట్లువూడి వచ్చాయి. వెంటనే కాళ్ళకు వున్న కట్లు వూడదీసుకున్నాడు.

బూటు అడుగున వున్న రహస్య అరలోంచి చిన్న బాటిలును బయటకు తీశాడు. అందులో ఐరన్ మెల్టింగ్ యాసిడ్ వుంది.

వాళ్ళు అతని దగ్గరవున్న రివాల్వర్ మాత్రమే తీసుకున్నారు. మిగిలిన వన్నీ అలాగే వున్నాయి—టేప్ రికార్డర్ తప్ప.

డోర్ దగ్గరకు నడిచి బాటిల్లో వున్న యాసిడ్ని కీ హోల్లో పోశాడు.

ఐదు నిముషాల తర్వాత తలుపు నెట్టగానే తెరుచుకున్నది. తల బయటకు పెట్టి చూశాడు. అక్కడ ఎవ్వరూ కనిపించలేదు. అంతా సమావేశంలో వుండివుంటారనుకున్నాడు.

పక్కనేవున్న గదిలోకి నడిచాడు. ఆ గదినిండా చెక్క పెట్టెల్లో బాంబులు వున్నాయి. అక్కడే వున్న ఓ ప్లాస్టిక్ సంచీలో కొన్ని బాంబులను పెట్టుకొని గబ

గబా అక్కడినించి నాలుగయిదు గదులు దాటి ఆ భవనంలో నించి బయటకు వచ్చాడు. అంతా సమావేశంలో వుండటంవల్ల యెవ్వరూ అతడిని గమనించలేదు.

రివ్వున ప్రహరీగోడ దగ్గరకు పరిగెత్తి దానిమీదకు ఎక్కి అవతలికి దూకాడు రాజేష్.

# 13

గోడ దగ్గరే నిలబడివున్న డిటెక్టివ్ రణధీర్ గోడ మీదనించి ఎవరో దూకేసరికి ఉలిక్కిపడి వెంటనే జేబులోంచి రివాల్వర్ తీసి "మర్యాదగా చేతులెత్తు" అన్నాడు.

"ఎవరున్నవ్వు?" అన్నాడు రాజేష్ చేతులు యెత్తకుండానే.

"డిటెక్టివ్ రణధీర్‌ని."

"అయితే మనిద్దరం స్నేహితులమే.... నేను సీక్రెట్ పోలీస్ రాజేష్‌ని. ఇప్పుడే వీళ్ళ చెరనించి బయటపడి ఇలా వచ్చేశాను" అన్నాడు చిరునవ్వుతో—

ఆశ్చర్యపోయాడు రణధీర్.

"మీ రిక్కడికి ఎలా వచ్చారు?"

రణధీర్ చెప్పాడు.

"లోపల అంతా సమావేశంలో వున్నారు" అన్నాడు రాజేష్.

"అవును. వీళ్ళందర్నీ పట్టుకోవటానికి యిదే తగిన సమయం. రండి....త్వరగా వెళ్ళి మనం పోలీసులకు ఫోన్ చేద్దాం...." అని అక్కడినించి కదిలాడు రణధీర్.

"ఆగండి" అన్నాడు రాజేష్.

"ఏమిటి?" అన్నాడు రణధీర్.

"ఇప్పుడు మనం పోలీసులను పిలిచి ప్రయోజనం లేదు. నేను తప్పించుకున్నానని తెలిసిన మరుక్షణం వీళ్ళు ఈ

స్థావరాన్ని ఖాళీచేసి పారిపోతారు. అంతేకాదు.వీళ్ళలో ఓ ఒక్కరు తప్పించుకొన్నా యిలాంటి దేశద్రోహుల ముఠాలు యెన్నో యేర్పడి ప్రజలను దోపిడీ చేస్తాయి.

నిజానికి ఇలాంటి కిరాతకులకు మరణశిక్ష విధించినా చాలదు. కాని మన న్యాయస్థానాలు వీళ్ళకి మరణశిక్షలు విధించవు. అందుకనే ఇలాంటి దేశద్రోహులకు మనమే తగిన శిక్షను విధించాలి. వీళ్ళు నన్ను పెట్టిన హింసలకు తగిన ప్రతీకారాన్ని తీర్చుకుంటాను. అందర్నీ ఒకేసారి బూడిద చేస్తాను" అని రణధీర్ వూహించని విధంగా ప్లాస్టిక్ బ్యాగ్‌లోని బాంబులను తీసి వేగంగా ఆ భవనం మీదకు గబగబా విసిరాడు రాజేష్.

గుండెలు పగిలే ధణేల్‌మనే చప్పుడు—వెంటనే హాహాకారాలు చెలరేగాయి ఆ భవనంలో—క్షణంలో కూలిపోయింది భవనం—మంటలు పైకి లేచాయి. లోపల వున్న బాంబులు ఇంకా పేలుతున్నాయి.

ఖిన్నుడయ్యాడు రణధీర్.

అప్పుడే అక్కడకు పోలీస్ జీపు వచ్చి ఆగింది. అందులోనించి ఇన్‌స్పెక్టర్ విజయ్ దిగి "ఇప్పుడే మాకు దొరికిన శత్రువుల మనిషి బాధలను భరించలేక యీ స్థావరం గురించి చెప్పాడు. అప్పుడే దీన్ని ఎవరు పేల్చేశారు?" అన్నాడు.

"నేనే పేల్చేశాను" అన్నాడు సీక్రెట్ పోలీసు రాజేష్ ఎగిసి పడుతున్న మంటలను చూస్తూ.

—: అయిపోయింది :—

# విదేశీయులు, విగ్రహాలు

## టెంపోరావ్

హోటల్ మేరిస్ బార్రూమ్‌లో వాళ్ళిద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. అతను పొడుగ్గా, సన్నగా వున్నాడు. బ్లూ సూటు వేసుకున్నాడు. పొట్టిగా కత్తిరించిన క్రాపు.

అతడి రంగు, వుచ్చారణ చూస్తే అమెరికన్ అయి వుండాలని తెలుస్తోంది.

"హలో, మిస్ లక్ష్మి!" అన్నాడతను.

"మిసెస్ లక్ష్మి" అందామె.

"లక్‌చిమి! పలకడమే కష్టం!" అన్నాడతను నవ్వుతూ.

ఆమె అతడి వైపు నవ్వుతూ చూసింది.

"పేరులో ఏముంది, మిస్టర్ కోన్! మీరు ఎలాగైనా పిలవొచ్చు" అందామె.

"థాంక్స్ లక్ష్మి! మిమ్మల్ని కలుసుకున్నందుకు ఎంతో సంతోషంగా వుంది. భారతదేశం చాలా గొప్పది. మా

దేశంలో ఎన్నో హిందూ దేవాలయాలు అవతరించాయి. కొందరు అమెరికన్లు మీ దేవాలయాలకు వెళ్ళి అక్కడ ప్రార్థిస్తూ వుంటారు. నేను కూడా చాలాసార్లు వెళ్ళాను" అన్నాడతను.

"మీరు చెప్పింది విని నేను చాలా సంతోషిస్తున్నాను. మా దేవుళ్ళమీద అంత ఆప్యాయత వుండడం గొప్ప విశేషం" అందామె.

కోన్ గ్లాసులో వున్న విస్కీని తాగేశాడు. ఆమె వైపు సూటిగా చూశాడు.

"ఏ పేర్తో పిలిచినా దేవుడు దేముడే!"

"యూ ఆర్ రైట్" అందామె, గ్లాసులోని వైన్ని చప్పరిస్తూ.

"మిస్ లక్ష్మి!" అన్నాడతను.

"మిసెస్!" అందామె మళ్ళా.

"ఐయామ్ సారీ! మీకు పెళ్ళయిందని నేను అనుకోలేదు. మీ వయసులో వున్నవాళ్ళకు మా దేశంలో పెళ్ళిళ్ళు కావు" అన్నాడతను.

"ఇది భారతదేశం. చిన్నతనంలోనే మాకు పెళ్ళయిపోతుంది. నా భర్త చాలా మంచివారు" అందామె.

"అతడిని కూడా యిక్కడకి తీసుకురావాల్సింది."

"ఆయన ఆరోగ్యం బాగాలేదు. పక్షవాతంతో కాలూ, చెయ్యీ పడిపోయింది. పరుపుమీదనుంచి ఆయన కదల్లేరు," అందామె.

"ఇటీస్ ఎ పిటీ! ఈ పట్నంలో నేను యెక్కువ రోజులు వుండను. దేవాలయాల్లోని విగ్రహాలను చూడ్డమంటే నాకు మహా యిష్టం" అన్నాడతను.

"మిమ్మల్ని వినాయకుడి గుడికి తీసుకెళ్తాను"

అందామె.

"వినాయక్! ఆ దేవుడు ఎలా వుండాడు?"

"వినాయకుడు మాకు ఎంతో ముఖ్యమైన దేముడు. ఏదేనా పని చేసేముందు విఘ్నాలు లేకుండా వుండేందుకు మేం ఆయన్ని పూజిస్తాం. వినాయకుడికి ఏనుగు తల, తొండం వుంటాయి. కాని ఆయన మనిషిలాగే వుంటారు" అందామె.

"వండ్రఫుల్" అన్నాడతను.

"800 సంవత్సరాల క్రితం ఆ దేవాలయాన్ని మా పెద్దలు కట్టించారు. ఆరు కిలోల బంగారంతో వినాయకుడి విగ్రహం చేయబడింది. ధగ ధగా మెరుస్తూ వుంటుంది."

"తప్పక వినాయకుని చూడాలి! హాఫ్ మేన్ హాఫ్ ఎలిఫంట్," అన్నాడు కోన్.

గ్లాసులో వున్న వైన్ ఆమె తాగేసింది. అతడు ఆమెవైపు పరీక్షగా చూస్తూ వుండిపోయాడు.

ఆమె వయస్సు యిరవై ఆరు వుండొచ్చు. కంచివరం పట్టుచీర ధరించింది. ఫ్లోరసెంట్ లైట్లకాంతిలో చీర కున్న జల్తారు మెరుస్తోంది. నుదురుమీద ఎర్రటి బొట్టు, ఆమె పెదిమలు ఎర్రగా వున్నాయి.

"మిస్టర్ కోన్, కీప్ డ్రింకింగ్!" అందామె.

అతడు విస్కీ సేవించి ఆమె వైపు చూశాడు.

"ఆ గుడికి ఎప్పుడు వెళ్దాం?" అడిగాడు.

ఆమె వాచ్ వైపు చూసింది.

"కావలిస్తే ఇప్పుడే వెళ్ళొచ్చు" అందామె.

గ్లాసులోని విస్కీని అతడు గడగడా తాగేశాడు. హోటల్ బాయిని పిల్చాడు. అతడిని బిల్ తెమ్మన్నాడు.

బిల్ మీద సంతకం పెట్టి అతడు కుర్చీలోంచి లేచాడు.

"లక్ష్మీ, లెటస్ గో" అన్నాడతను.

## 2

గుడికెళ్ళాక వాళ్ళిద్దరూ మరో టాక్సీలో ఆమె ఇంటికి చేరుకున్నారు.

ఇల్లు విశాలంగా వుంది కాని పాతది. హాల్లో నుంచి ఆమె అతడిని పడగ్గదిలోకి తీసుకువెళ్ళింది. సోఫా చూపించి కూర్చోమంది. కోన్ కూర్చుని సిగరెట్ వెలిగించాడు.

విస్కీ బాటిల్, రెండు గ్లాసులు, సోడాబుడ్లు తెచ్చి ఆమె టీపాయిమీద పెట్టింది. ఒక గ్లాసులో విస్కీ పోసి ఆమె సోడా కలిపింది. తన గ్లాసులో సోడా మాత్రం పోసుకుంది.

"చియర్స్!" అన్నాడతను.

"మీ యిల్లు చాలా బాగుంది" అన్నాడతను.

పక్క గదిలోంచి దగ్గు వినపడింది. అతడు ఆమెవైపు చూశాడు.

"నా భర్త!" అందామె.

"అతను యిక్కడికి రాలేడా?"

"కదల్లేరు" అందామె.

"ఇల్లాగా!" అన్నాడు కోన్.

అతడు విస్కీ తాగి ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"మీ భర్త చాలా అండర్‌స్టేండింగ్ టైప్!" అన్నాడతను.

ఆమె కిలకిల నవ్వింది.

"వినాయక్ చాలా బాగున్నాడు. ఆ విగ్రహం నా

కింతో నచ్చింది, ఆల్ గోల్డ్" అన్నాడతను.

"అటువంటి విగ్రహం మీరు మా దేశంలో చేయించుకోవచ్చు" అందామె.

అతడు పకపక నవ్వాడు.

"పురాతన విగ్రహాలకు అమెరికాలో గిరాకీ ఎక్కువ. కొత్తగా చేయించినవి ఎవ్వరూ కొనరు."

క్షణకాలం యిద్దరూ మౌనంగా వున్నారు.

"ఇప్పుడే వస్తాను" అని ఆమె వెళ్ళిపోయింది.

కోన్ విస్కీ మళ్ళా పోసుకుని స్ట్రాంగ్‌గా తాగేశాడు. గది నలువైపులా చూశాడు. గోడలకు రంగు వేయించి చాలా కాలమైనట్లుంది. కొన్నిచోట్ల రంగు పూర్తిగా వూడిపోయింది.

కాసేపట్లో ఆమె తిరిగొచ్చింది.

"ఆయనకు పిల్స్ యిచ్చివచ్చాను. ఇంక ఆయన హాయిగా నిద్రపోతారు" అందామె.

"గ్రేట్ సోల్!" అన్నాడతను.

"ఇవాళ మీరు యిక్కడే భోజనం చెయ్యాలి."

"ఐ విల్ బి డిలైటెడ్" అన్నాడతను.

ఆమె టైమ్ చూసింది. తొమ్మిది దాటింది. నవ్వుతూ అతడివంక చూసింది.

డిన్నర్ పదింటికి పెట్టుకుందామా?"

"పదకొండు దాటాక బాగుంటుంది. మీతో ఎంతో మాట్లాలి" అన్నాడతను.

"అలాగే చేద్దాం" అందామె.

అతడు విస్కీ తాగి సిగరెట్ పొగ వదుల్తూ ఆమె వైపు చూశాడు.

"మీరు ధనవంతులై వుండాలి!"

ఆమె నవ్వింది.

"ఒకప్పుడు యెంతో వుండేది. నేను పెద్దదాన్నయే సరికి ఆస్తంతా కరిగిపోయింది" అందామె.

"అయితే డబ్బొచ్చే పద్ధతులకోసం మీరు వెతుకుతూ వున్నారన్న మాట!"

"వెతక్కుండా జీవించడం సాధ్యం కాదు."

"అయితే నేను చెప్పేది వినండి. వినాయక్ విగ్రహం నాకు కావాలి ..."

"అది వాళ్ళు అమ్మరు."

"ఎవరు వాళ్ళు?"

"ఈ గుడికి అరడజన్ మంది ట్రస్టీలు మెంబర్లు వున్నారు. నేను కూడా ఒక మెంబర్ని."

"మీరు ఏదో చేసి ఆ విగ్రహం నాకు అందేటట్లు చూడాలి!"

"ఆ పని నేను చెయ్యలేను. డబ్బుకోసం మరో పద్ధతి వెతకడం మంచిది" అందామె.

"నేను చెప్పేది పూర్తిగా వినండి."

"చెప్పండి" అందామె.

"ఆరు కిలోల బంగారంతో ఆ విగ్రహం చేయబడిందని మీరన్నారు. బంగారం విలువ యే పదిలక్షలో వుండొచ్చు. నేను చూసేది బంగారం విలువ కాదు. ఆ విగ్రహం 800 సంవత్సరాల నాటిది. అటువంటి విగ్రహానికి అమెరికాలో డిమాండ్ ఎక్కువ."

"అమెరికాలో ఎంత వస్తుంది?"

"ఫోర్ మిలియన్ డాలర్స్ రావచ్చు. మీ లెక్కలో కోట్ల రూపాయలు!"

ఆమె ఆశ్చర్యంగా అతడివైపు చూసింది.

"చాలా పెద్ద మిత్రం. ఆ విగ్రహాన్ని కొని అమెరికన్లు ఏం చేస్తారు?"

"ఆ ప్రశ్నకు జవాబివ్వడం కష్టం. మీ దేశంలో యే పని చేసినా అది ఎలా లాభిస్తుందని చూస్తారు. అమెరికాలో అలా కాదు. అక్కడివాళ్ళ చేతుల్లో డబ్బు విశేషంగా వుంది. మానసిక తృప్తికోసం వాళ్ళు ఎంతో డబ్బు తగలేస్తూ వుంటారు. ఈ విగ్రహాలను కొని ఒక గదిలో వుంచి, మిత్రులకు చూపించి వాళ్ళు మానసికంగా సంతోషపడ్తూ వుంటారు" అన్నాడతను.

ఆమె అతడివంక సూటిగా చూసింది.

"నేను కూడా అమెరికాకు పోవడం మంచిదేమో!" అందామె.

"గుడ్ ఐడియా! యూ ఆర్ బ్యూటిఫుల్! మిమ్మల్ని మా దేశంలో పూజిస్తారు. మీరు నాతో అమెరికాకు వచ్చేయండి" అన్నాడతను.

"నా భర్తను యిక్కడ వదిలేయాలి! ఆయన్ని ఎవరు చూస్తారు?"

"అతడినీ తీసుకుపోదాం. అక్కడ పెద్ద డాక్టర్లు వున్నారు. అతడు అక్కడ బాగుపడొచ్చు."

"అమెరికా స్వర్గంలా అగుపిస్తోంది" అందామె.

## 3

లక్ష్మి అతని చేతుల్లో వుంది. అతడామెను బలంగా ముద్దెట్టుకున్నాడు. ఆమె కళ్ళల్లోకి నవ్వుతూ చూశాడు.

"లక్ష్మి, ఐ లవ్ యు! నిన్ను నాతో అమెరికా తీసుకుపోతాను. అక్కడికెళ్ళాక మనం పెళ్ళి చేసుకుందాం" అన్నాడతను.

ఆమె మౌనంగా వుండిపోయింది.

"నీ భర్త గురించి ఆలోచిస్తున్నావా?"

ఆమె తలాడించింది.

"డోంట్ బాదర్! అతడు నీకు ఏ విధంగానూ వుపయోగపడడు. అతడిని యిక్కడే వదిలేద్దాం. సర్వైవల్ ఆఫ్ ది ఫిటెస్టు!"

"అంటే?" ప్రశ్నించిందామె.

"ఈ లోకంలో బలమైన వాళ్ళు బతుకుతారు. బలహీనులు చితయిపోతారు."

"నిజమే."

"అమెరికాకు మనం వెళ్తున్నట్లు నీ భర్తతో చెప్పకు. అంతా రహస్యంగా వుంచు."

"వుంచుతాను" అందామె.

అతడు ఆమెవైపు సూటిగా చూశాడు.

"మనం వెళ్ళేముందు ఆ విగ్రహాన్ని అపహరించాలి. అమెరికా వెళ్ళాక అది అమ్మితే వచ్చే డబ్బుతో మనం సుఖంగా జీవించవచ్చు."

"నాకు భయంగా వుంది!"

"నాకు భయంలేదు. నీ కోసం ఏదైనా నేను చెయ్యగలను. అమెరికాలో నువ్వు రాణిలా బతకాలి."

"అదెలా సాధ్యం?"

"సాధ్యంకానిది యీ లోకంలో లేదు."

"ఏం చెయ్యాలో మీరే ఆలోచించండి."

"నీతో వచ్చి గదంతా చూశాను. నేనొక ప్లాన్ తయారుచేస్తాను. ఆ ప్లాన్ ప్రకారం ఆ విగ్రహం మనకు లభిస్తుంది. అటుపైన అమెరికాకు వెళ్ళిపోదాం."

"క్షేమంగా వెళ్ళగలమా?"

"గోవాకు పోదాం. అక్కడ నుంచి తిన్నగా దుబాయ్ వెళ్దాం. దుబాయ్ నుంచి తిన్నగా అమెరికాకు పోవచ్చు."

"ఆ విగ్రహం కోసం పోలీసులు వెతుకుతారు. గోవా చేరుకునే ముందే మన్ని అరెస్టు చేస్తారు" అందామె.

కోన్ గంభీరంగా నవ్వాడు. గ్లాసులో విస్కీ పోసుకుని సోడా కలపకుండా తాగేశాడు.

"లక్ష్మీ, నా గురించి నీకింకా తెలియదు. గత ఐదేళ్ళుగా పన్నెండు దేశాల్లోని పోలీసులు నా కోసం వెతుకుతున్నారు. పూర్ ఫెలోస్!"

అతడివైపు ఆశ్చర్యంగా చూసింది.

"అమెరికాలో మీరు చేసే బిజినెస్ ఏమిటి?"

"పురాతనమైన విగ్రహాలను సంపాదించి అమ్మడం."

"ఈ వ్యాపారంలో మీరు పోలీసులకు చిక్కిపోతే నా గతి ఏమవుతుంది? అమెరికాలాంటి దేశంలో ఎలా బతగ్గలను?" అందామె.

"లక్ష్మీ, అమెరికాలో యెవరైనా సులువుగా బ్రతకొచ్చు. అక్కడ డబ్బుంది కాని యీ దేశంలోలా మనుషులు లేరు. ఏ చిన్న పని చేసినా నీకు యెక్కువగా ఆదాయం వస్తుంది. అందువలన నువ్వు భయపడ నవసరం లేదు."

"మీతో వస్తాను."

"లక్ష్మీ, ఆ గుడిని గురించి మరికొంత సమాచారం నాకు కావాలి," అన్నాడతను.

"అడగండి."

"రాత్రిళ్ళు ఆ గుడిని ఎన్నింటికి మూసేస్తారు?"

"తొమ్మిదింటికి."

"తాళం చెవులు ఎవరిదగ్గర వుంటాయి?"

"గుడి పూజారి రామశాస్త్రి దగ్గర."

"నువ్వు ట్రస్టి మెంబరువుగా, అతడు నీకు బాగా తెలుసా?"

"తెలుసు. ప్రతి శుక్రవారం గుడి మూశాక యిక్కడికి వొచ్చి ప్రసాదం నా కిచ్చి యింటికి పోతాడు."

"ప్రయిడే! ఫైన్!" అన్నాడతను వుత్సాహంగా.

## 4

జోన్ ఎంతో హుషారుగా వున్నాడు. ఎంత తాగినా విస్కీ ప్రభావం అతడిమీద ఎక్కువగా లేదు. ఆమె టైమ్ చూసింది. పన్నెండు కావస్తోంది. "భోజనం చేద్దాం" అందామె.

"గుడ్ అడియా! భోజనం తర్వాత నా ప్లాన్ నీకు చెప్తాను" అన్నాడతను.

ఆమె లోపలకు వెళ్ళింది. పక్కగది గుమ్మంలో నిలబడి పరుపువైపు చూసింది. శాలువా పూర్తిగా కప్పేసుకుని భర్త నిద్రపోతున్నాడు.

పెద్ద ట్రేలో ప్లేటు పెట్టి, పదార్థాలను వడ్డించి ఆమె పడగ్గదికి చేరుకుంది. ఒక టేబులుమీద ప్లేటను పెట్టింది. రెండు కుర్చీలను బల్ల పక్కనే వేసింది.

గ్లాసులోని విస్కీని తాగేసి అతడు సోఫాలోంచి లేచాడు. ఆమె నడుంచుట్టూ చెయ్యిని పోనిచ్చాడు.

ఓరగా ఆమెవైపు చూసి, అమాంతంగా ఆమెను ఎత్తి, పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"మైడియర్, యూ ఆర్ లవ్లీ! ఇండియాలో నీలాంటి ప్రియురాలు దొరుకుతుందని నేను కల్లో కూడా అనుకో

లేదు. ఇదంతా వినాయక్ మహిమ. అందుకే వినాయక్‌ని అమెరికాకు తీసుకుపోవాలి" అన్నాడతను.

పక్క పక్కనే కూర్చొని యిద్దరూ భోజనాలు చేయడం ప్రారంభించారు.

"ఇదేమిటి?"

"వడ. తినిచూడండి. బాగుంటుంది" అందామె.

"ఫైన్ టేస్ట్!" అన్నాడతను.

స్పూన్ వాడకుండా ఆమెలాగే చేత్తో తిన్నాడతను. సాంబార్, రసమ్ అతడి కెంతగానో నచ్చాయి.

"అమెరికాలో యివన్నీ నువ్వు చెయ్యాలి," అన్నాడతను.

డిన్నర్ పూర్తయ్యాక అతడు సిగరెట్ వెలిగించాడు. ఆమె తన పనులు పూర్తి చేసి పడగ్గదిలోకి తిరిగి వచ్చింది.

"లక్ష్మీ, హోటల్‌కి పోవాలి," అన్నాడతను.

"ఇక్కడే పడుకోవచ్చు. పొద్దుటే వెళ్ళొచ్చు."

"నీతో చాలా సేపున్నాను."

"మీ ప్లాన్ గురించి చెప్పాలిగా!" అందామె.

గది తలుపు మూసిందామె. ఇద్దరూ పరుపుమీద పక్క పక్కనే పడుకున్నారు.

"లక్ష్మీ, శుక్రవారం ఆ పూజారి ఇక్కడకు ఎన్నింటికొస్తాడు?"

"పదింటికి వస్తాడు."

"పదింటికి నేను టాక్సీలో వస్తాను. పూజారి దగ్గర నుంచి అతడికి తెలియకుండా తాళంచెవులు తీసుకుని, టాక్సీలోవున్న నాకు నువ్వు యివ్వాలి. నేను గుడికి వెళ్ళి ఆ విగ్రహాన్ని అపహరిస్తాను. మళ్ళా ఇక్కడికొచ్చి

తాళంచెవులు నీ కిచ్చి వెళ్ళిపోతాను. తాళంచెవులు యిక్కడే వున్నాయని భావిస్తూ ఆ పూజారి తనింటికి పోతాడు."

"మీరు వచ్చిందాకా పూజారితో యేం చేయను?" అడిందామె.

"గుడిలో ఆ పూజారిని చూశాను. అతడు యవ్వనంలో వున్నాడు. ఈ గదిలోకి రమ్మని నువ్వు తీయగా నవ్వితే పిచ్చాడిలా గెంతుతాడు. అతడిని నవ్విస్తూ యీ గదిలోనే వుంచు. నేను తిరిగొచ్చాక అతడికి బై బై చెప్పొచ్చు."

"అటు పైన ఏం చెయ్యాలి?"

"నేను హోటల్ గది ఖాళీచేసి యిక్కడికి వస్తాను. నువ్వు నీ బాగ్ తో తయారుగా వుండు. అదే టాక్సీలో యిద్దరం బెంగుళూరు పోదాం."

ఆమె అతడి కళ్ళలోకి చూసింది.

"నా వస్తువులు ఎన్నో వున్నాయి యిక్కడ...."

"లీవ్ దెమ్! నీ భర్త ఆ వస్తువులను చూసుకుని సంతోషిస్తాడు. ముఖ్యమైనవి మాత్రం పట్రా."

"ఓ.కె. అలాగే" అందామె.

తెల్లవారేలోపల అతడు లేచాడు. పరుపుమీద పడుకొని వున్న ఆమెవంక నవ్వుతూ చూశాడు.

లక్ష్మి శరీరం బంగారంలా మెరుస్తోంది. ఆమె ప్రశాంతంగా నిద్రపోతోంది. మెల్లగా అతడు కిందకు దిగి తన దుస్తులు ధరించాడు.

ఆమెను లేపాడు. కళ్ళు తెర్చి ఆమె అతడివైపు నిశితంగా చూసింది.

"మన ఫస్ట్ నైట్ వండ్రఫుల్ గా వుంది," అని అత

డామె పెదిమలను ముద్దాడాడు.

"మెడియర్, నేను హోటల్‌కి వెళ్తున్నాను. తర్వాత నాకు ఫోన్ చేయి," అన్నాడతను.

అతడి మాటలు ఆమెకు స్పష్టంగా వినబడలేదు. ఆమె నిద్రలోకి జారిపోయింది.

కోన్ గదిలోంచి బయటకు నడిచాడు.

## 5

శుక్రవారం!

రాత్రి పదింటికి రామశాస్త్రి నవ్వుతూ హాల్లోకి వచ్చాడు. ఆమె యేదో పనున్నట్లు పడగ్గదిలోకి వెళ్ళి పోయింది. అతడు గుమ్మంలో బయట నిలబడి ఆమెను పిల్చాడు.

"లక్ష్మిగారూ! అమ్మా!"

"లోపలకు రండి," అందామె.

అతడు లోపలకు వెళ్ళాడు. అతడివైపు ఆమె నవ్వుతూ చూసింది. రామశాస్త్రి వయస్సు 28 సంవత్సరములు వుంటుంది. అతడికింకా పెళ్ళి కాలేదు. తెల్లటి పంచ ధరించి పైన కండువా కప్పుకున్నాడు. వంటినిండా బొచ్చు కనిపిస్తోంది. గిరిజాల జుత్తు. వెనక చిన్న పిలక. నుదురుమీద విభూది, ఎర్రటి బొట్టు. మెళ్ళో రుద్రాక్ష మాల.

"కూర్చోండి శాస్త్రిగారూ" అందామె.

అతడు సోఫాలో కూర్చుని పెద్ద పాకెట్‌ను టీపాయి మీద వుంచాడు.

"మీకు ప్రసాదం యిచ్చిపోదామని ఇలా వచ్చాను!" అన్నాడతను.

అద్దం ముందు నిలబడి ఆమె మేకప్ చేసుకుంటోంది,

"కూర్చోండి, వస్తున్నా" అని ఆమె మెల్లిగా అతడి ముందుకు నడిచింది.

సెంటు వాసన గదిలో గుప్పున కొడ్తోంది. బయట నుంచి టాక్సీ హారన్ వినపడింది.

"శాస్త్రిగారూ, బాత్‌రూమ్‌లోకి వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కురండి టిఫిన్ యిస్తాను" అందామె.

రామశాస్త్రి తాళంచెవుల గుత్తిని టీపాయిమీద పడేసి బాత్‌రూమ్‌లోకి నడిచాడు. తాళంచెవుల గుత్తిని తీసుకుని ఆమె బయటకు పరుగెత్తింది. తొందరగా తిరిగి వచ్చింది. కండువాతో మొహం తుడుచుకుంటూ శాస్త్రి వచ్చి సోఫాలో కూర్చున్నాడు.

"ఆ పాకెట్ అంతా మీకేనమ్మా" అన్నాడతను.

"ఇదంతా మీరు తినాలి" అందామె ఒక ప్లేటు అందిస్తూ.

ప్లేటులోని స్వీట్స్, హాట్స్ చూసి అతడు తృప్తి పడ్డాడు.

"ఇవన్నీ తింటే యీ రాత్రి భోంచేయలేనమ్మా."

"భోజనం రోజూ తినేదేగా!"

"ఇంతకీ యివాళ యేమిటి విశేషం?"

"మా పెళ్ళి రోజు, అందుకే తినమంటున్నాను."

అతడు తినడం ప్రారంభించాడు. అతడి యెదురుగా మరో సోఫాలో ఆమె కూర్చుంది. అప్పుడప్పుడు టైమ్ చూస్తోంది. నిమిషాలు దొర్లుతున్నాయి. ఆమె కోన్ గురించి లోలోపల ఆలోచిస్తోంది.

కోన్ తిరిగి వచ్చిందాకా రామశాస్త్రిని గదిలో వుంచాలి!

చటుక్కున ఆమె పమిట కిందకు జారింది. శాస్త్రి

ఆమెవైపు చూశాడు. ఆమె నవ్వుతూ పమిటను సర్దుకుంది.

"శాస్త్రిగారూ మీకింకా యెందుకు పెళ్ళికాలేదు?" నవ్వుతూ అడిగిందామె.

"నా అన్నకి యింకా పెళ్ళికాలేదు. వాడు నాకంటె రెండేళ్ళు పెద్ద" అన్నాడతను.

"మన గుడికి యెందరో యువతులు వస్తూ వుంటారు. అనేకమంది మిమ్మల్ని ప్రేమిస్తూ వుండాలి!"

"అలా అనకండమ్మా! స్కూలుకు పంపడం మాన్పించి నా తండ్రిగారు వేదాలూ, ఉపనిషత్తులూ చదవమని ప్రోత్సహించారు. ఈ రోజుల్లో అవి ఎవరికి కావాలి?" అన్నాడు శాస్త్రి.

"శాస్త్రి గారూ, బి.ఎలమీద మోజు పోయింది. వేదాలు చదువుకున్న మీలాటి వాళ్ళను యీనాటి యువతులు ప్రేమిస్తారు!"

"ఏమో! ఇంతవరకూ యే అమ్మాయీ నన్ను ప్రేమిస్తున్నట్లు నాతో చెప్పలేదు!"

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"శాస్త్రిగారూ, ఆడపిల్లలకు హృదయంలో ప్రేమున్నా చెప్పుకునే ధైర్యం వుండదు. మొగాడు కొంచెం ముందుకు వెళ్తే ఆడపిల్ల అతడి చేతుల్లో పువ్వులా రాలిపోతుంది" అందామె.

"మీరు నన్ను బాగా యేడిపిస్తున్నారు" అన్నాడు శాస్త్రి అమాయకంగా.

ఆమె ఆలోచిస్తోంది. కోన్ ఇంకా ఎందుకు రాలేదు? యెవరేనా అతడిని అడ్డగించారా?

రామశాస్త్రి ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"మీ రింత చెప్పాక మీ సలహో అడగాలని వాకు

అనిపిస్తోంది."

"అడగండి" అందామె.

"ఒకమ్మాయి తల్లితో గుడికి వస్తూ వుంటుంది. ధన వంతుల బిడ్డలా వుంది. ఒక రోజు అర్చన చేయించింది. ఆమె పేరు లలిత. ఆమెకు నేనంటే చాలా యిష్టం అని పిస్తోంది. రోజూ రెండుసార్లు ఆమె గుడికి వస్తుంది. పొద్దుట ఒంటరిగా వస్తుంది. రాత్రి తల్లితో వస్తుంది. నన్ను చూసి మహా సిగ్గుపడుతుంది."

"శాస్త్రిగారూ, ఆమె మిమ్మల్ని ప్రేమిస్తోంది."

"నేను యేం చెయ్యాలో చెప్పండి! వినాయకుడి గుడిలో పూజారిగా వుంటూ నేను అవనీతికరంగా ప్రవర్తిస్తే అందరూ నామీదకు చెప్పులు విసుర్తారు. నా పనికూడా పోవచ్చు!"

"శాస్త్రిగారూ, ఆ వినాయకుడిని పూజించి మీరు ధైర్యం చేయండి. లలిత మీదవుతుంది" అందామె.

"ఏ ప్రమాదమూ లేదంటారా?"

"ఏమీ వుండదు. మీకు ధైర్యం లేకపోతే ఆ అమ్మాయిని నేను కల్సుకుని మాట్లాడతాను. ఆమె హృదయం మీమీద వుందో లేదో కనుక్కొంటాను" అతడు ఆమెకు నమస్కారించాడు.

"అలా చేస్తే బాగుంటుంది. కాని నన్ను యేవిధం గానూ యిరికించకుండా ఆమె ఉద్దేశం తెలుసుకోండి."

"రేపే అంతా కనుక్కొంటాను. ఆమె అడ్రెసు చెప్పండి."

లలిత గురించి అన్ని వివరాలూ రామశాస్త్రి ఆమె కిచ్చాడు.

"నాకొక సందేహం, అమ్మగారూ! నాలాటి పూజారికి

ఆ అమ్మాయి తలిదండ్రులు పిల్లను యివ్వడానికి ఒప్పుకుంటారా?" అడిగాడతను.

"ప్రతి నెలా మీకెంత ఆదాయం వస్తోంది?"

"వెయ్యిపైన వస్తోంది."

"మీకు మంచి ఆదాయం వుంది. పూజారి పని గౌరవనీయమైనది. బాంకుల్లో పని చేసే గుమస్తాలకు అదే ఆదాయం వుండొచ్చు. పూజారికి కూతుర్ని వాళ్ళు ఎందుకివ్వకూడదు?" అందామె.

బయటనుంచి కారు హారన్ వినపడింది. ఆమె బయటకు పరుగెత్తింది. వెనక కూర్చున్న శోన్ వైపు ఆశ్చర్యంగా చూసింది. యేదో అడగబోయింది. అతడు మాట్లాడవద్దని సౌజ్ఞ చేశాడు. తాళంచెవుల గుత్తిని ఆమెకిచ్చాడు.

"అరగంటదాకా హోటల్లో వుంటాను. ఫోన్ చేసి నాతో మాట్లాడు" అన్నాడు అతను.

టాక్సీ వెళ్ళిపోయింది. ఆమె లోపలకు నడిచింది. రామశాస్త్రి ప్లేటును ఖాళీచేశాడు.

"చేతులు కడుక్కోండి" అందామె.

అతడు బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు. తాళంచెవుల గుత్తిని ఆమె టీపాయిమీద పడేసింది.

రామశాస్త్రి తిరిగొచ్చాడు. ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"కాశీ అన్నపూర్ణలా టిఫిన్ పెట్టారు. మీకు నా ధన్యవాదాలు. మీరు ఆ పిల్లతో మాట్లాడి నాకు సహాయపడండి."

"శుభవార్త రేపు మీకు చెప్తాను" అందామె.

అతడు తాళంచెవుల గుత్తి తీసుకుని, ఆమెకు నమస్కరించి వెళ్ళిపోయాడు.

కాన్సెపయ్యాక ఆమె బయటకు నడిచింది. ఒక మందుల షాపునుంచి అతడి హోటల్‌కి ఫోన్ చేసింది.

"హలో, కోన్ స్పీకింగ్!" అన్నాడతను.

"నేను లక్ష్మిని."

"హలో మైడియర్, అంతా సవ్యంగా జరిగింది."

"నీ పూజారి వేషం బాగుంది" అందామె.

"ఆ వేషంలో యెవ్వరూ నన్ను అనుమానించరు. గుడి తెర్చాక ఒక ప్రమాదం నాకు ఎదురైంది. కొత్తగా పెళ్ళయిన దంపతులు లోపలకు వచ్చారు. వాళ్ళకు ప్రసాదం యిచ్చి పంపేశాను. వాళ్ళు నన్ను అనుమానించలేదు."

"ఆ గుడికి వెళ్ళడం వాళ్ళకు ఇదే మొదటిసారేమో!" అందామె నవ్వుతూ.

"డార్లింగ్, అక్కడున్నావా?"

"ఇక్కడే వున్నాను."

"మైడియర్, ఆ పూజారి వెళ్ళిపోయాడా?"

"బాగా టిఫిన్ పెట్టి పంపించాను."

"గుడ్, యూ ఆరే జీనియస్! లక్కీ, రెడీగా వుండు. సరిగ్గా 11-30కి నేను అక్కడికొస్తాను."

"పన్నెండింటికి రండి. రెడీగా వుంటాను."

"మన సెకండ్ నైట్ టూరిస్టు టాక్సీలో గడుపుదాం" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

వేగంగా ఆమె యింటికి వెళ్ళింది. తొందరగా భోజనం చేసింది. తన చీరలు, నగలు తోలుపెట్టెలో పెట్టింది.

పడగ్గదిలో పచార్లుచేస్తూ వుండిపోయింది. నిముషాలు గడుస్తున్నాయి. పన్నెండు అయింది. ఆమె ఇంటిముందుకు

వెళ్ళి నిలబడింది.

కార్లు రోడ్డమ్మట పోతున్నాయి. యే కారూ తన యింటిముందు ఆగలేదు. అతడు భోజనం చేస్తున్నాడేమో!

వెయ్యి కళ్ళతో అతడి రాకకోసం ఎదురుచూస్తోంది. అనుకోకుండా ఒక అమెరికన్ తనకు దొరికాడు. అతడితో హాయిగా అమెరికాలో జీవించవచ్చు!

వాచ్ వైపు చూసింది. ఒంటిగంట దాటింది. అయినా అతడి టాక్సీ యెక్కడా పత్తా లేదు.

ఆమె బయటకు నడిచింది. ముందు తలుపులు దగ్గరగా మూసింది.

రోడ్డమ్మట వేగంగా నడవసాగింది. రోడ్డుమీద జన సంచారం లేదు. వీధి కుక్కలు మొరుగుతున్నాయి.

చాలా దూరం నడిచాక ఆమెకొక టెలిఫోన్ బూత్ కనిపించింది. లోపలకు దూరి ఆమె గాజు తలుపు మూసింది.

రిసీవర్ ఎత్తి హోటల్ మేరిస్ నంబరు తిప్పింది. యాభై పైసలు చిల్లులో పడేసింది.

"హలో. హోటల్ మేరిస్" అందో యువతి.

"మిష్టర్ కోన్ ప్లీజ్" అందామె.

"ఆయన గది ఖాళీచేసి వెళ్ళిపోయారు."

"ఎప్పుడు?"

"11-30కి."

మరేమీ అడక్కుండా ఆమె రిసీవర్ని పెట్టేసింది. బూత్ లోంచి బయటికొచ్చి ఆమె యింటివైపు మెల్లిగా అడుగులు వేసింది.

తనను ఉపయోగించి, తన సహాయాన్ని పొంది కోన్

పారిపోయాడు. తనకి ఎన్నో ఆశలు చూపించి అతడు మాయమయ్యాడు.

ఆమె పళ్ళు పటపట కొరికింది. నిస్సహాయంగా ఏడుస్తూ ఇంటిదాకా నడిచింది. హాల్లోకి వెళ్ళి ముందు తలుపులు మూసింది.

మెల్లిగా పడగ్గదిలోకి నడిచింది. అమాంతంగా పరుపుమీదపడి ఏడ్వసాగింది.

ఎప్పుడో ఆమెకు నిద్రపట్టేసింది.

# 6

అనేకమంది వినాయకుడి గుడిచుట్టూ నిలబడ్డారు. గుసగుసలాడుతున్నారు.

XYZ కారు రోడ్డు వారగా ఆగింది. ప్రఖ్యాత డిటెక్టివ్ వాలి చుట్ట పొగ పీల్చి బయటకు దిగాడు. గిరి దిగి కారు తలుపు మూశాడు.

ఇన్‌స్పెక్టర్ బాండ్ నవ్వుతూ వాలికి నమస్కరించాడు.

“వాలిగారూ, ఫోన్ చేయగానే వచ్చినందుకు థాంక్స్” అన్నాడు బాండ్.

చుట్ట కాలుస్తూ వాలి నలువైపులా చూశాడు. వెయ్యిమందిపైన ప్రజలు గుమిగూడారు.

“రండి, లోపలకు వెళ్దాం” అన్నాడు బాండ్.

ఇన్‌స్పెక్టర్ బాండ్ ఒక కానిస్టేబులుతో గుడివైపు కదులుతున్నాడు. వాలి, గిరి వెనకనే వెళుతున్నారు.

ప్రజలు పక్కకు కదిలి దారిస్తున్నారు. ముందుగుమ్మం దాటి వాలి లోపలకు వెళ్ళాడు. ఏడుస్తూ పూజారి రామశాస్త్రి వాళ్ళవైపు వచ్చాడు.

“ఈ గుడికి యీయన పూజారి, వాలిగారూ” ఇన్

స్పెక్టర్ బాండ్ పరిచయం చేశాడు.

పూజారివంక వాలి పరీక్షగా చూశాడు.

"అబ్బాయి, నీ పేరు?" అడిగాడు వాలి.

"రామశాస్త్రి అని పిలుస్తారండి."

"ఏమైందో చెప్పు!"

"ఎనిమిదింటికి వచ్చి తాళాలు తెర్చాను. గర్భ గుడిలోని వినాయకుడి విగ్రహానికి నమస్కరించి పని ప్రారంభించడం నాకు అలవాటు" అన్నాడతను.

వాలి మరికొంచెం ముందుకు వెళ్ళాడు. లోపలకు చూశాడు. వినాయకుడి విగ్రహం లేదు!

వాలి వెనక్కి తిరిగాడు. గాభరాపడుతున్న పూజారి వైపు చూశాడు.

"ఆ విగ్రహం బం గా రం తో చేయబడిందా?" ప్రశ్నించాడు వాలి.

"ఆరు కిలోల బంగారంతో తయారుచేశారు, సార్. ధగధగ మెరుస్తూ వుండేది."

"ఈ గుడితాళం చెవులు ఎవరి దగ్గర వుంటాయి?"

"నా దగ్గర, సార్!" అని రామశాస్త్రి ఒక స్టీలు రింగుకి వేళ్ళాడుతున్న కొన్ని తాళంచెవులను చూపించాడు.

"రాత్రి ఎన్నింటికి మూస్తావు?"

"తొమ్మిదింటికి, సార్. ఎక్కువగా భక్తులు వుంటే మరో 10, 15 నిమిషాలు తర్వాత మూసి, తాళాలు వేస్తాను."

చుట్ట పొగ పీల్చి వదుల్తూ వాలి తీవ్రంగా ఆలోచించసాగాడు.

"అబ్బాయి, నువ్వు వచ్చి తాళాలు తెర్చానన్నావు.

అంటే ఎవ్వరూ తాళాలను పగులగొట్టలేదు!"

"అవును, సార్."

"తాళాల్ని పగలగొట్టకుండా లోపలకు ఎలా వెళ్ళగల్గారు?" ప్రశ్నించాడు వాలి.

"అదే ఆశ్చర్యంగా వుంది" అన్నాడు పూజారి.

అతడివైపు సూటిగా చూశాడు వాలి.

"నువ్వు ఎంతకాలంనించి ఇక్కడ పనిచేస్తున్నావు?"

"ఐదేళ్ళనుంచి, సార్."

"నిన్న నువ్వు యీ గుడికి తాళాలువేసి తిన్నగా యింటికి పోయావా?"

రామశాస్త్రి వెంటనే జవాబివ్వలేదు. కొంతసేపు మౌనంగా వున్నాడు.

"అబ్బాయి, చెప్పు!"

"లక్ష్మిగారి యింటికి వెళ్లానండి."

"ఎవరామె?"

"ఈ గుడి ట్రస్టీ మెంబరు. 800 సంవత్సరాల క్రితం ఆమె పూర్వీకులు యీ గుడిని నిర్మించారు. ప్రతి శుక్రవారం ఆమెకు ప్రసాదం పట్టుకెళ్ళి యిస్తూంటాను. నిన్న వెళ్ళి ఆమెకు ప్రసాదం యిచ్చాను."

"ఆమె యింట్లో ఎంతసేపున్నావు?"

"అరగంటపైన వున్నానండి."

"అంతసేపు ఏం చేశావు?"

"నిన్న ఆమె పెళ్ళయిన రోజుట. ఆమె టిఫిన్ యిచ్చారు. అది తిని తర్వాత యింటికి వెళ్ళిపోయాను."

"అప్పుడు తాళం చెవులు నీ దగ్గరే వున్నాయా?"

"పక్కనున్న టీపాయిమీద పడేశాను. వెళ్ళేముందు వాటిని తీసుకున్నాను."

గర్భగుడి ముందు వాలి అటూ యిటూ తిరిగి పరీక్షగా చూశాడు. తాళాలు తెరవకుండా ఎవ్వరూ లోపలకు రాలేరు!

"గిరీ, లక్ష్మి అడ్రెసు తెల్సునా!" అన్నాడు వాలి.

గిరి సమీపంలో వున్న పూజారివైపు కదిలాడు.

"వాలిగారూ, యే ముఠావాళ్లో ఆ బంగారం విగ్రహాన్ని దోచుకుపోయి వుండాలి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ బాండ్.

వాలి జవాబివ్వలేదు. గిరి అతడి పక్కకు వచ్చాడు.

"ఆమె యిల్లు సమీపంలోనే వుంది" అన్నాడు గిరి.

"వెళ్దాం పద!" అన్నాడు వాలి.

## 7

ఒక యింటిముందు కారు ఆగింది. వాలి కిందకు దిగాడు. ముందు తలుపులు తెర్చి వున్నాయి. వాలి, గిరి గుమ్మం ముందు ఆగారు. గిరి తలుపును తట్టాడు.

లక్ష్మి గబగబ వచ్చి వాళ్ళవైపు చూసింది. పొడుగ్గా, బలంగా బుగ్గమీసాలతో వున్న వాలివైపు ఆమె భయంతో చూసింది. అతడి నోట్లో పొడుగాటి చుట్ట వుంది.

"ఏం కావాలి మీకు?" అందామె.

"అమ్మాయి, నువ్వే" అన్నాడు వాలి.

"రండి, లోపలకు రండి" అందామె.

హాల్లో వున్న సోఫాలు పాతవి. సోఫా కవర్లకు అక్కడక్కడ మరకలున్నాయి.

"కూర్చోండి" అందామె.

"ఈయన వాలిగారు" అన్నాడు గిరి.

మళ్ళా వాలి వంక ఆమె గాభరాగా చూసింది.

"వాలిగారూ, నమస్కారం" అందామె.

అందరూ సోఫాల్లో కూర్చున్నారు.

"అమ్మాయి, సమీపంలో వున్న వినాయకుడి గుడికి నువ్వు ట్రస్టీ మెంబరువని తెలిసింది" అన్నాడు వాలి.

"నేనొక్కతెనే కాదు. మరో ఐదుగురు ట్రస్టీ మెంబర్లు" అందామె.

ఆమెవైపు వాలి సూటిగా చూశాడు.

"అమ్మాయి, నిన్న రాత్రి పూజారి రామశాస్త్రి యిక్కడకు వచ్చాడా?"

"ఇదంతా ఎందుకు అడుగుతున్నారు?" అడిగిందామె.

"రాత్రి వినాయకుడి విగ్రహాన్ని యెవరో ఎత్తుకు పోయారు" అన్నాడు వాలి.

ఆమె ఉలిక్కిపడింది క్షణకాలం. ఆమె నోటమ్మట మాట పెగల్లేదు.

"నా ప్రశ్నకు జవాబివ్వలేదు!"

"రామశాస్త్రి వచ్చాడు. కాస్సేపు కూర్చుని వెళ్ళి పోయాడు."

"ప్రతి శుక్రవారం అతను యిక్కడకు వస్తాడా?"

"వచ్చి ప్రసాదం యిచ్చి వెళ్ళిపోతాడు."

"నిన్న అలాగే వెళ్ళిపోయాడా?"

ఆమె తలాడించింది.

"అతను ఇక్కడ చాలాసేపు వున్నాడని విన్నాను!"

"అదా. నేను టిఫిన్ యిస్తే తిని వెళ్ళాడు."

"నీ పెళ్ళిరోజని విన్నాను. నీ భర్త ఎక్కడ?"

ఆమె విచారవదనంతో వాలికేసి చూసింది.

"ఆయన ఆరోగ్యం బాగా లేదు. పక్షవాతంతో

ఆయన కాలూ, చెయ్యీ పడిపోయింది."

"అమ్మాయి, చాలా విచారిస్తున్నాను."

ఆమె కళ్ళు తుడుచుకుంది. ఆమెవైపు గిరి జాలిగా చూశాడు.

"అమ్మాయి, రామశాస్త్రి ఎటువంటివాడు?"

"అతడు చాలా మంచివాడు. అమాయకుడు. యెవ్వరికీ హాని చేయడు" అందామె.

లోలోపల కోన్ గురించి ఆమె ఆలోచిస్తోంది. ఆ దుర్మార్గుడు తనను నమ్మించి మోసం చేశాడు.

"అమ్మాయి, ఆరు కిలోల బంగారంతో ఆ విగ్రహం చేశారని విన్నాను. దాని విలువ పదిలక్షలు పైన వుంటుంది. ఎవరో తాళాలు తెచ్చి ఆ విగ్రహాన్ని తీసుకుపోయారు. ఆ తాళంచెవులు ఎప్పుడూ రామశాస్త్రి దగ్గర వుంటా యని విన్నాను. నిన్న రాత్రి యిక్కడకు వచ్చినపుడు తాళంచెవులు అతడి దగ్గర వున్నాయా?"

ఆమె కాసేపు ఆలోచించింది.

"వున్నాయి, సార్. వెళ్ళేముందు టీపాయిమీదున్న తాళంచెవుల గుత్తిని ఆయన తీసుకున్నారు. అది నాకు గుర్తుంది."

అమాంతంగా వాలి సోఫాలోంచి లేచాడు.

"నీ భర్త యే గదిలో వున్నాడు?"

ఆమె ఒక గదిలోకి వెళ్ళింది. గుమ్మం బయట నిలబడి వాలి లోపలకు చూశాడు.

"ఆయన నిద్రబోతున్నారు" అందామె.

వాలి మెల్లిగా లోపలకు వెళ్ళాడు. పరుపుమీద వెల్లకిలా పడుకున్న వ్యక్తివైపు చూశాడు.

"లేపనా?" అడిగిందామె.

ఆమెవైపు విచిత్రంగా చూసాడు.

"గాఢనిద్రలో వున్న వాళ్ళను లేపడం ధర్మంకాదు!" అన్నాడు వాలి.

అందరూ హాల్లోకి వచ్చారు.

"అమ్మాయి, నీ భర్త ఎడంకాలూ, చెయ్యీ పక్షవాతం మూలంగా దెబ్బతిన్నాయా?"

"అవును, సార్."

"తనే గడ్డం గీసుకుంటూ వుంటాడా?"

ఆమె ఆతిడివైపు ఆశ్చర్యంగా చూసింది.

"ఆయన షేవ్ చేసుకోలేరు. ఆయనకు ట్రీట్ మెంట్ యిచ్చే డాక్టర్ ప్రసాద్, నా భర్త ప్రాణమిత్రులు. డాక్టర్ ప్రసాద్ షేవ్ చేస్తూ వుంటారని విన్నాను" అందామె.

"డాక్టర్ ప్రసాద్ రోజూ వస్తాడా యిక్కడకు?...."

"ఏదో టైమ్‌లో వచ్చిపోతారు."

"డాక్టర్ ప్రసాద్ అడ్రసేమిటి?"

"ఆయన రాయపేట హాస్పిటల్లో డాక్టర్‌గా వుంటున్నారని విన్నాను. ప్రయివేట్‌గా ఆయన ఎవ్వరికీ మందులివ్వరు. స్నేహం మూలంగా నా భర్తకు యిస్తున్నారు" అందామె.

"నీలాంటి భార్య, డాక్టర్ ప్రసాద్‌లాంటి మిత్రుడు వుండటం నీ భర్తకు మంచిదే" అన్నాడు వాలి.

వాలి, గిరి బయటకు వెళ్ళారు. గుమ్మంలో నిలబడి ఆమె బయటకు చూస్తోంది.

ఏదో ఆలోచన తట్టినట్లు వాలి వెనక్కు నడిచి ఆమె వైపు చూశాడు.

"అమ్మాయి, నీ భర్త యెప్పుడూ, యెక్కడకూ వెళ్ళడా?" ప్రశ్నించాడు.

"నా భర్త రాజన్ కదల్లేరు" అందామె.

వాలి వెళ్ళి కార్లో కూర్చుని తలుపు మూశాడు. గిరి కారును పోనిచ్చాడు.

# 8

గుడి ముందు యిప్పుడు ప్రజలు యెక్కువగా లేరు. పోలీసు జీపు యింకా అక్కడే వుంది.

ఇన్‌స్పెక్టర్ బ్రాండ్ కారు దగ్గరకు వేగంగా వచ్చాడు. కారులో కూర్చున్న వాలి కోడ్ను యిరువైపులా చూస్తున్నాడు.

"వాలిగారూ, ఏదేనా తెలిసిందా?"

"బ్రాండ్ భాయ్, సెల తప్పగానే పిల్ల పుడ్తుందా? పరిశోధన సాగుతోంది. సకాలంలో నిజం తెలుస్తుంది" అన్నాడు వాలి.

కారు దిగి సమీపంలో వున్న టీ షాపు దగ్గరకు వాలి వెళ్ళాడు.

"ఏం కావాలి?" అడిగాడా షాపువాడు.

"రాత్రి నీ కొట్టు యెంతవరకూ తెర్చివుంటుంది?"

"ఒంటిగంట దాకా, సార్."

షాపు దగ్గర నుంచి గుడి యెర్ర తలుపులు కనిపిస్తున్నాయి.

"ఆ గుడి తలుపులు నిన్నరాత్రి మూయడం నువ్వు చూశావా?" ప్రశ్నించాడు వాలి.

"తొమ్మిదింటికి మూసి పూజారి వెళ్ళిపోయాడు, సార్" అన్నాడతను.

ఎందుకో షాపు యజమాని తల గోక్కుంటూ వుండి

పోయాడు.

"ఏదేనా గుర్తు వస్తోందా?"

"అవును, సార్."

"ఏమిటో చెప్పు!"

"తొమ్మిదింటికి గుడి మూయడం గుర్తుంది. కాని పది తర్వాత పూజారి మళ్ళా తెర్చాడు. కాస్సేపట్లో మూసి పూజారి వెళ్ళిపోయాడు" అన్నాడతను.

"ఎవరా పూజారి, రామశాస్త్రి?"

"గుడి ముందు దీపాలు లేవు సార్. రామశాస్త్రి కాదో నేను చెప్పలేను. పంచ, కండువా, పిలక, చేతిలో ఏదో సంచి, అవి గుర్తున్నాయి."

"నువ్వా గుడికి వెళ్తూవుంటావా?"

"రోజుకు రెండు, మూడుసార్లు వెళ్తూ వుంటాను, సార్."

"అబ్బాయి నీ పేరు?"

"గజపతి సార్."

"నువ్వు చెప్పింది వుపయోగపడ్తుంది. చాలా థాంక్స్" అని వాలి గుడివైపు నడిచాడు.

రామశాస్త్రి నీరసంగా వున్నాడు—కళ్ళు ఎర్రబడ్డాయి. వాలి అతడి భుజంమీద చెయ్యి వేశాడు.

"అబ్బాయి, పదింటికి నువ్వు లక్ష్మి ఇంట్లో వున్నావు. అదే సమయంలో ఎవరో గుడి తలుపులు మళ్లా తెర్చారు. విగ్రహాన్ని సంచిలో పెట్టుకొని, తాళాలు వేసి వెళ్ళిపోయారు. తలుపులు తెర్చిన వ్యక్తి నీలా వేషం వేసుకొన్నాడు" అన్నాడు వాలి.

"నేను యిక్కడకు రాలేదు, సార్" అన్నాడు పూజారి గాభరాగా.

"దొంగతనం చేసేవాళ్ళు గుడికి అనేకసార్లు వచ్చి అంతా ముందుగా స్టడీ చేస్తారు. ప్రత్యేకంగా అలా గుడికి వచ్చినవాళ్ళెవరైనా నీకు గుర్తున్నారా?"

"లక్ష్మిగారు ఒక తెల్లవాడిని ఓ రాత్రి గుడికి తీసుకొచ్చారు. తర్వాత అతను ఒంటరిగా చాలాసార్లు వచ్చాడు. గుడి నలువైపులా తిరిగి అతడు చూసేవాడు."

"అతడి పేరు?"

"లక్ష్మిగారికి తెలిసుండవచ్చు, సార్."

"అబ్బాయి, నువ్వు టిఫిన్ తినే సమయంలో లక్ష్మి నీతోనే వుందా?"

"నా ఎదురుగా ఆమె సోఫాలో కూర్చుంది, సార్. కారు హారన్ చప్పుడు విని ఆమె బయటకు వెళ్ళింది" అన్నాడు పూజారి.

వాలి గబగబా వెళ్ళి కారులో కూర్చుని తలుపు మూశాడు. ఇన్‌స్పెక్టర్ బాండ్‌తో వున్న గిరి కారువైపు పరుగెత్తాడు.

"వాలిగారూ, యెక్కడికి కెళ్దాం?" అడిగాడు గిరి.

"లక్ష్మితో మరోసారి మాట్లాడాలి" అన్నాడు వాలి.

గిరి కారును వేగంగా పోనిచ్చాడు.

## 9

హాల్లో కొచ్చిన వాళ్ళవైపు లక్ష్మి గాభరాగా చూసింది.

"మళ్ళా వచ్చారా!" అందామె.

"రావలిసి వచ్చింది" అన్నాడు వాలి.

"ఏం కావాలో చెప్పండి" అందామె.

"నీవు ఒక తెల్లవాడిని గుడికి తీసుకెళ్ళావట. ఎవ

రతను?"

"అతని పేరు కోన్. అతడు అమెరికా దేశస్థుడు" అందామె.

"అతడు గుడికి ఒంటరిగా చాలాసార్లు వెళ్ళాడట!"

"వెళ్ళుండొచ్చు. అతడికి మన గుళ్ళన్నా, విగ్రహాలన్నా చాలా యిష్టమని నాతో అన్నారు."

"అతడితో నీకెలా పరిచయమైంది?"

"ఒకరోజు నేను హోటల్ మేరిస్‌కి వెళ్ళాను. అక్కడతడు నన్ను పలకరించాడు, తర్వాత నేను అతడిని గుడికి తీసుకెళ్ళాను."

"అతడు అదే హోటల్లో వుంటాడా?"

"నాకు తెలియదు. తర్వాత నేనతడిని కల్సుకోలేదు" అందామె.

వాలి ఆమెవైపు సూటిగా చూశాడు.

"అమ్మాయి పూజారి వేషంలో వెళ్ళి ఎవరో గుడి తలుపులను పది తర్వాత తెర్చాడని తెలిసింది. మన పురాతన విగ్రహాలకు అమెరికాలో విపరీతంగా డిమాండ్ వుంది. ఆ అమెరికన్ని మనం అనుమానించాలి!"

అమ్మె మాట్లాడలేదు. వాలి బయటకు నడిచాడు. కారు మూసుకుపోయింది.

ఒకచోట కారు ఆగింది. వాలి పక్కనున్న గిరివైపు చూశాడు.

"గిరీ, ఫోన్ చేసి హోటల్ మేరిస్‌లో కోన్ వున్నాడేమో కనుక్కో. అలాగే రాయపేట హాస్పిటల్‌కి ఫోన్ చేసి డాక్టర్ ప్రసాద్ గురించి తెల్సుకో" అన్నాడు వాలి.

కారు దిగి గిరి సమీపంలో వున్న మందులషాపు దగ్గ రకు వెళ్ళాడు.

చుట్టపాక పీల్చి వదుల్తూ వాలి తీవ్రంగా ఆలోచిస్తు న్నాడు. ఇండియాలో దొంగిలించిన విగ్రహాలెన్నో విదే శాల్లో కనబడ్డాయి!

కాస్సేపట్లో గిరి కారు దగ్గరకు వచ్చాడు. "వాలి గారూ, లోన్ నిన్నరాత్రి 11-30 కి మేరీస్ హోటల్లోని గదిని ఖాళీచేసి వెళ్ళిపోయాడు. రాయపేట హాస్పిటల్లో డాక్టర్ ప్రసాద్ అనే పేరుతో యే డాక్టరూ లేడు" అన్నాడు గిరి.

"గిరీ, నిజానికి దగ్గరవుతున్నాం" అన్నాడు వాలి గంభీరంగా.

# 10

పోలీస్ జీపు వెనకే XYZ కారు ఆగింది. ఇన్ స్పెక్టర్ బాండ్ కారుదగ్గర కొచ్చాడు.

వాలిగారూ, శవాన్ని బయటకు తోయించాను. ఈ దేశంవాడు కాదు" అన్నాడు బాండ్.

వాలి కారు దిగి బాండ్ తో వెళ్ళాడు. మేన్ హోల్ మూత రోడ్డుమీద పడుంది. డ్రెయినేజ్ పైపులోంచి పైకి తీసిన శవం మూతపక్కనే కనిపించింది.

వాలి శవాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు. అతడు సూటులో వున్నాడు. కోటునిండా రక్తం మరకలు. ఛాతీమీద అనేకచోట్ల కత్తితో పొడిచి అతడిని ఎవరో హతమార్చారు.

"అతడి జేబుల్లో వున్నవి చూశావా?" అడిగాడు వాలి.

"ఇప్పుడే శవం బైటకొచ్చింది" అన్నాడు బాండ్.

ఒక కానిస్టేబుల్ శవం జేబులోని పాస్‌పోర్టును ఇన్‌స్పెక్టర్‌కి యిచ్చాడు. పేజీలను తిప్పి చూశాడతను.

"వాలిగారూ, ఇతడు అమెరికన్. పేరు రోనాల్డ్ విన్‌సెంట్. న్యూయార్కు నుంచి వచ్చాడు. టూరిస్టుగా మన దేశం వచ్చాడు. వయస్సు 50 ఏళ్ళు" అన్నాడు బాండ్.

"ఇదిగో బిల్ సార్...." అని కానిస్టేబుల్ యిచ్చాడు.

"వాలిగారూ, హోటల్ మేరిస్ బిల్లు, వెయ్యి నాలుగొందలకు. బిల్లు ఆర్. కోన్ పేర రాసివుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఆ పేరు విని వాలి తృళ్ళిపడ్డాడు. "గిరీ!" అని అరిచాడు.

గిరి దగ్గరగా వచ్చాడు.

"గిరీ, వెంటనే వెళ్ళి లక్ష్మిని ఇక్కడకు తీసుకురా!" అన్నాడు వాలి.

గిరి కారు దగ్గరకు పరుగెత్తాడు.

ఇన్‌స్పెక్టర్ బాండ్ ఓరగా వాలివైపు చూశాడు. "వాలిగారూ, లక్ష్మిగారు యెవరు?" అడిగాడతను.

"త్వరలో అంతా నీకే తెలుస్తుంది. తొందరపడి నీ బుర్ర పాడు చేసుకోకు!" అన్నాడు వాలి నవ్వుతూ.

అతడి జేబులో మరే కాయితాలూ లేవు. నలిగిపోయిన రూపాయి నోట్లు, కొంత చిల్లర వుంది.

"మొత్తం పది రూపాయల ఎనభై పైసలు. ఇంత తక్కువ డబ్బుతో ఇతడెలా ప్రయాణం చేస్తున్నాడో!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"బాండ్ భాయ్, అతడి దగ్గరున్న డబ్బును హంతకుడు

పట్టుకుపోయి వుండాలి. కాని పాస్‌పోర్టునూ, హోటల్ బిల్లునూ హంతకుడు మనకు వదిలేశాడు. వాటి ఆధారంగా రోనాల్డ్ విన్సెంట్ అనే అతను హోటల్ మేరిస్‌లో మారు పేరులో, ఆర్. కోన్ అనే పేరుతో గది తీసుకొన్నాడని తెలుస్తుంది" అన్నాడు వాలి.

"అవును, సార్" అన్నాడు బాండ్.

కానిస్టేబుల్ గిరి లక్ష్మిని అక్కడకు తీసుకువచ్చాడు. వాలి ఆమెవైపు చూశాడు.

"అమ్మాయి, నువ్వు గదికి తీసుకువెళ్ళిన కోన్ యితనేనా?"

వాలి పక్కకు జరిగాడు.

నేలమీద పడున్న శవంవైపు ఆమె సూటిగా చూసింది. భయంతో ఆమె అర్చింది.

ఆమె భుజంమీద వాలి చెయ్యివేశాడు. ఆమె లోలోపల గాభరా పడుతోంది. తను యీ కేసులో ఇరుక్కోవలసి వస్తుందేమో!

"అమ్మాయి, నిన్నరాత్రి ఎవరో ఇతడిని చంపి, మేన్ హోల్ మూతతీసి డ్రెయినేజి పైపులో శవాన్ని పారేశారు. ఇతడు హోటల్ ఖాళీచేసి వెళ్తూంటే యిదంతా జరిగింది" అన్నాడు వాలి.

ఆమె మాట్లాడలేదు. ఆమెను కారుదగ్గరకు వాలి తీసుకెళ్ళాడు. సమీపంలో ఎవ్వరూ లేరు."

ఆమెవైపు సూటిగా చూశాడతను. "అమ్మాయి, యితడి గురించి నీకు తెలిసినదంతా చెప్పు! నీతో గదికి వచ్చిన వ్యక్తి నీతో చెప్పకుండా వెళ్ళిపోడు. వెళ్ళే ముందు అతడు నిన్ను కలుసుకుని వుండాలి!"

"నన్ను కలుసుకోలేదు. ఫోన్ చేయాలంటే మా ఇంట్లో

ఫోన్ లేదు" అందామె.

"అమ్మాయి, హోటల్ మేరిస్‌కి వెళ్ళి కనుక్కుంటే అంతా నాకు తెలుస్తుంది. ఎవరెవరు అతడిని కలుసుకున్నారో, ఎవరెవరు అతడికి ఫోన్ చేశారో తేలిపోతుంది."

ఆమె ఏడుస్తూ వాలి వంక చూసింది.

"వాలిగారూ, మీకు నిజం చెప్తాను. నన్ను కాపాడండి" అందామె.

"నిర్దోషులను నేను ఎల్లప్పుడూ రక్షిస్తాను" అన్నాడు వాలి సగర్వంగా.

"నిన్న రాత్రి రామశాస్త్రి మా యింటికొచ్చాడు. అతడికి టిఫిన్ యిచ్చి రహస్యంగా తాళంచెవులను నేనే టాక్సీలో బయటనున్న కోన్‌కి ఇచ్చాను. అతడు వినాయకుడి విగ్రహాన్ని దొంగిలించి తిరిగొచ్చి నాకు తాళం చెవులు యిచ్చేశాడు. వాటిని టీపాయ్‌మీద పడేశాను. ఇదంతా రామశాస్త్రి గుర్తించలేదు."

"ఇదంతా ఎందుకు చేశావు?"

"అతడు నాకు ఆశలు చూపించాడు. నన్ను తనతో అమెరికాకు తీసుకుపోతానన్నాడు. నన్ను పెళ్ళాడ్తానన్నాడు. రాత్రిళ్ళు అతడు నాతో గడిపేవాడు. అతడిని నమ్మి, బానిసయ్యాను" అందామె.

"కోన్ ఆ విగ్రహాన్ని దొంగిలిస్తున్నట్లు మరెవరికేనా తెలుసా?"

"తెలియదు. నేను చెప్పలేదు."

"అమ్మాయి నీ భర్తకు యిదంతా తెలుసా?"

"ఆయనకేమీ తెలియదు."

"నీ భర్తా నువ్వూ అన్యోన్యంగా జీవిస్తున్నారా?"

"పక్షవాతం అంటే నాకు భయం. రోగులంటే నాకు అసహ్యం. ఆయన దగ్గరకు నేను వెళ్ళను."

"అమ్మాయి, రాయపేట హాస్పిటల్లో డాక్టర్ ప్రసాద్ అనే డాక్టరు లేడు!"

"నా భర్త చెప్పింది మీకు చెప్పాను."

"అమ్మాయి, నీ యింట్లో పరిస్థితి విచిత్రంగా వుంది."

"నా ఖర్మ" అందామె.

అతడు గిరిని పిల్చాడు.

"గిరీ, ఈమెను తీసుకెళ్ళి యింట్లో దింపేసి రా!" అన్నాడు వాలి.

ఆమె కారులో కూర్చుంది. గిరి కారును పోనిచ్చాడు.

## 11

గదిలోంచి జీరోవాట్ బల్బు డిమ్‌గా వెలుగుతోంది. లక్ష్మి భర్త గాఢ నిద్రలో వున్నాడు. ఉలిక్కిపడ్తూ అతడు లేచాడు.

ఏవో జంతువులు అతనిమీద నుంచి దూకుతున్నాయి. ఇటూ అటూ పరుగెత్తుతున్నాయి.

పక్కనున్న స్విచ్ అతను ఆన్ చేశాడు. గదిలోని లైట్ వెలిగింది. అతడు గది నలువైపులా చూశాడు. ఎలుకలు గదిలో యిటూ, అటూ, పరుగెడ్తున్నాయి. ఇన్ని ఎలుకలు తన గదిలో కెలా వచ్చాయి?

అతడు కిందకు చూశాడు. రెండు ఎలుకలు అతడి మీదకు దూకాయి. అతడు కంగారుగా గుమ్మంవైపు పరుగెత్తాడు. తలుపులు తెర్చాడు.

బయటకు పరుగెత్తాలి! అతడు గుమ్మం దాటాడు. హఠాత్తుగా ఆగిపోయాడు.

ఎదురుగా నిలబడ్డాడు వాలి!

"అబ్బాయి. ఎలుకల్ని చూసి భయపడ్డావా?" అన్నాడు వాలి.

"మీరెవరు?" అర్చాడతను.

"ఇవాళ పొద్దుట మీ గదిలోకొచ్చాను. నువ్వు నిద్ర నటిస్తున్నావు. నీ కనురెప్పలు కదులుతున్నాయి! నువ్వు నిద్రపోవడం లేదని, నిద్ర నటిస్తున్నావని నేను గ్రహించాను. కాని పాపం నీ భార్య నువ్వు పడుకున్నావని నాతో అంది. నేను వెళ్ళిపోయాను" అన్నాడు వాలి.

"మీకేం కావాలి?" అడిగాడతను.

"నాకు నువ్వే కావాలి!" నీ ప్రాణమిత్రుడు డాక్టర్ ప్రసాద్ కావాలి!" అన్నాడు వాలి.

అతను మౌనంగా వుండిపోయాడు.

"మిస్టర్ రాజన్, పక్షవాతంతో నీ కాలూ, చెయ్యీ పోయినట్లు నువ్వు నటిస్తున్నావు. నీ గదిలోకి నేను పంపిన ఎలుకలు నీకు పక్షవాతం లేదని నిరూపించాయి. నువ్వెందుకు ఇలా నటిస్తున్నావు?" అడిగాడు వాలి.

"నా భార్యను దూరంగా వుంచాలని," అన్నాడతను.

"ఆమెను దూరంగా వుంచాలని యెందుకు నిశ్చయించావు?"

"ఆమె కులట. ఒక మొగాడితో ఆమె జీవించలేదు. ఆమెకు రోజూ కొత్తమనుషులు కావాలి. ఆమె ఒక నింఫోమానియాక్!" అన్నాడతను.

వాలి అతడివైపు సూటిగా చూశాడు.

"రాజన్, నిన్నరాత్రి నువ్వు ఎక్కడున్నావు?"

"నా గదిలో పడుకున్నాను."

"క్లోన్ వినాయకుడి విగ్రహాన్ని దొంగలించబోతున్నా

డని నీకు తెలుసా?"

"తెలియదు."

అతడివైపు వాలి కోపంగా చూశాడు.

"రాజన్, నీ భార్య గదిలో నువ్వు రహస్యంగా మైక్ పెట్టావు. ఆమె యేం మాట్లాడినా నీకు తెలుస్తుంది. ఇదుగో ఆ మైక్!" అన్నాడు వాలి.

రాజన్ మైక్ వైపు భయంలో చూశాడు.

"నా భార్య లక్ష్మి, కోన్ మాట్లాడినదంతా నేను విన్నాను" అన్నాడతను.

"రాజన్, నువ్వు హోటల్ మేరిస్‌కి వెళ్ళావు. కోన్‌ని హత్య చేసి డ్రెయినేజి పైప్‌లో శవాన్ని పారేశావు" అన్నాడు వాలి.

"మీరు అంతా వూహిస్తున్నారు. నేను నా గదిలో వున్నాను రాత్రి పన్నెండు ప్రాంతంలో నా భార్య గుమ్మంలో నిలబడి నన్ను చూసింది."

ఏదో వాలి మెదడులో టార్చిలా మెరిసింది.

"రాజన్, నీ గదిలో నీ పరుపుమీద పడుకున్నది నువ్వు కాదు, నీ మిత్రుడు ప్రసాద్!" అర్చాడు వాలి.

"అది మీకెలా తెలుసు?"

వాలి కళ్ళు ఎర్రబడ్డాయి.

"డాక్టర్ ప్రసాద్ అడ్రసు చెప్పు!"

"ప్లీజ్, అంతదాకా మీరు వెళ్ళొద్దు. కోన్‌ని నేనే హత్య చేశాను. అమెరికా నుంచి వచ్చి, నమ్మించి, నా భార్యతో సుఖం అనుభవించాడు. అందుకే అతడిని పొడిచి పొడిచి చంపాను."

"డాక్టర్ ప్రసాద్ అడ్రెసు చెప్పు!"

"చెప్పను. ప్రాణం పోయినా చెప్పను."

వాలి చెయ్యి పైకి లేచింది. అమాంతంగా అతడి మెడమీదకు దిగింది. రాజన్ నేలమీద పడ్డాడు.

"డాక్టర్ ప్రసాద్ అడ్రెసు చెప్తాను" అరిచాడు రాజన్.

అతడు అడ్రెస్ చెప్పాడు. వాలి పక్కనున్న గిరివైపు చూశాడు.

"గిరీ, నువ్వు యిక్కడే వుండు. రాజన్ పారి పోకుండా చూడు. నేను కాస్సేపట్లో వస్తాను" అని వాలి బయటకు నడిచాడు.

కారును వాలి శరవేగంతో పోనిచ్చాడు, తేనాం పేటలో ఒక యింటిముందు కారాపి దిగాడు. పైకి చూశాడు. నాలుగంతస్తుల భవనం.

లిఫ్ట్ లేదు. మెట్లెక్కి మూడో అంతస్తు చేరుకున్నా డతను. ఫ్లాట్ నంబర్ E-2 ముందుకి నడిచాడు. తలుపు మీద తట్టాడు.

"ఎవరు?" అందో యువతి కంఠం.

"రాజన్" అన్నాడు వాలి తన కంఠాన్ని మారుస్తూ.

తలుపు తెరవబడింది. వాలి ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు—ఆమె మేక్సీలో వుంది. కాని తను పెట్టు కున్న మీసాలను తీసేయడం మర్చిపోయింది.

"ఎవరు మీరు?" అందామె.

వాలి లోపలకు జొరబడి తలుపు మూశాడు.

"డాక్టర్ ప్రసాద్, వినాయకుడి విగ్రహం ఎక్క డుంది?" అరిచాడు వాలి.

"వినాయకుడి విగ్రహం ఏమిటి? మీ రెవరు? బయ టకు పొండి, లేకపోతే పోలీసులను పిలుస్తాను" అరిచిం

దామె.

వాలి గంభీరంగా నవ్వాడు.

"అమ్మాయి, పోలీసులు నీ గదిబయట వున్నారు. తలుపు తెరిస్తే వాళ్ళు లోపలకు వస్తారు" అన్నాడు వాలి.

ఆమె మౌనంగా వుండిపోయింది. వాలి గదులన్నీ వెతికాడు. ఒక సంచిని తెరిచి ధగధగా మెరుస్తూన్న వినాయకుడి విగ్రహాన్ని వాలి బయటకు తీశాడు.

ఆమెవైపు సూటిగా చూశాడు.

"అమ్మాయి, యీ విగ్రహంతో మవ్వూ, రాజన్, ఎక్కడికో పారిపోదామనుకున్నారా?"

ఆమె తలాడించింది. వాలి ఆమె వంక నవ్వుతూ చూశాడు.

"అమ్మాయి, వినాయకుడు మోసాన్ని సహించడు. అతడి విగ్రహాన్ని దొంగిలించినవాళ్ళు ఎన్నడూ విజయాన్ని సాధించలేరు" అన్నాడు వాలి.

ఆమె మౌనంగా వుండిపోయింది.

"అమ్మాయి, మీసాలు నీ అందాన్ని తగ్గిస్తున్నాయి. వాటిని తీసేసి నాతో రా," అన్నాడు వాలి.

అద్దం ముందుకు వెళ్ళి ఆమె మీసాలను తీసేసింది.

"అమ్మాయి, నీ పేరు?"

"రాధ" అందామె.

"లెటస్ గో" అన్నాడు వాలి.

—: సమాప్తం :—

# వనభోజనాలు

## బి. రాజేశ్వరి

"ఈ ఆదివారం ఎలాగైనా మనం గార్డెన్ పార్టీ పెట్టుకోవాలి!" అన్నాడు సీతారాం మిత్రులతో.

"నాకు యిన్‌స్పెక్షన్ తగిలింది బ్రదర్ ఆఫీసులో. ఈ సారికి నన్నొదిలేయండి" అన్నాడు రఘు.

"అదేం కుదరదు. భగవంతుడిచ్చిన సెలవురోజును యిన్‌స్పెక్షన్ పేరుతో దుర్వినియోగపరిచే ఆ ఆఫీసరు ఎవడోయ్!" గంగాధరం చాలా కోపంగా రఘు ఆఫీసరుని శాపనార్థాలు పెట్టడం మొదలెట్టాడు.

రఘు నిస్సహాయంగా చూశాడు.

"ఇది ఆఖరి వారం. కార్తీక మాసంలో ఆనవాయితీగా మనం కుటుంబాలతో వన భోజనాలు చేస్తున్నాం. ఇలా అయినా మన మిత్రులందరం కుటుంబాలతో ఒకచోట చేరటం, ఓ చక్కటి మరపురాని అనుభవం. మధురానుభూతి. ఏమంటారు?" సీతారాం మిత్రుల్ని కలియ చూస్తూ ఉపన్యాస ధోరణిలో అన్నాడు.

"మా మాటకేంగాని దివాకర్ ఏం మాట్లాడటం లేదేమిటి?" అన్నాడు గంగాధరం.

అంతవరకు మౌనంగా వున్న దివాకర్ అప్పుడే ఆ ప్రతిపాదన విన్నవాడిలాగా అందరివంకా కలియజూసి, "మీరన్నదానికెన్నడైనా నే కాదన్నానా? మీరందరు ఎస్సంటే ఎస్సు, వద్దంటే మిస్సు!" అన్నాడు.

"మరి నన్ను మీతోబాటు రానిస్తే ఆనందంగా మీకు కంపెనీ యిస్తాను!" అన్నాడు సురేంద్ర. అతను బ్రహ్మచారి. ముదిరిన బ్రహ్మచారి. భగ్న ప్రేమికుడు. ప్రేయసి యెవర్నో పెళ్ళిచేసుకుని వెళ్ళిపోవటంతో ఆజన్మాంతం బ్రహ్మచారిగా వుండిపోవటానికి నిర్ణయించుకున్న ఆదర్శ ప్రేమికుడు. అతను, గంగాధరం ఒకే ఆఫీసులో పనిచేస్తున్నారు.

"ఎంతమాట! మీరొస్తానంటే కాదంటామా? మాకు ఓ ఫ్రెండ్ కూడా వెతుక్కోనక్కర్లేకుండా రెడీమేడ్‌గా దొరుకుతుందంటే మాకూ ఆ నం ద మే!" అన్నాడు సీతారాం.

సురేంద్రతో అందరికీ చెప్పుకోదగ్గ స్నేహం లేక పోయినా, అందరు అతనంటే అభిమానంగా వుంటారు. అతను పెద్దమనిషి తరహాగా వ్యవహరించటమే అందుక్కారణం! అందరికీ పేకాట పిచ్చి వుంది. సురేంద్ర చక్కటి ఆటగాడు.

సురేంద్ర వెంటనే, "అయామ్ సారీ! మీరందరు భార్యాపిల్లలతో వెళ్తూంటే మధ్య నాలాంటి వంటరివాడు తలదూర్చటం నాకే భావ్యంగా వుందనిపించటం లేదు, మీరు వెళ్ళండి!" అన్నాడు.

తక్కిన నలుగురు, "భలేవారే, మీరు వంటరివారెలా అవుతారు? మేమందరం లేమా? ఇంకా మా పిల్లల అల్లరు భరించే శక్తి మీకుండాలిగాని, మీరు రావటం మాకు ఆనందదాయకమే!" అన్నారు, సురేంద్ర నొచ్చుకోకుండా.

"సరే, స్పాట్ చెప్పలేదు! యెక్కడ ఫిక్స్ చేసుకుందాం?" అన్నాడు గంగాధరం.

"అదే, మీరెవరైనా సజెస్టు చేయండి! మనం ప్రతి సారి ఓ, కొత్త స్థలం ఎన్నిక చేసుకుంటున్నాం. వెరైటీ యీజ్ బ్యూటీ!" యీసారి దివాకర్ అన్నాడు.

"అక్కడ ఉసిరిచెట్టు వుండాలా?" రఘు అన్నాడు.

"ఉంటే సంప్రదాయ బద్ధంగా వుంటుంది. లేక పోయినా అడ్జస్టు అయిపోవచ్చు!" అన్నాడు గంగాధరం.

"అదేవన్నమాట! కార్తీక మాసంలో వన భోజనాలేమిటి, ఉసిరిక లేకపోవటమేమిటి? ఉండి తీరాలి!" అన్నాడు సీతారాం.

"సీతారాం చెప్పాడంటే అది రూలే! అలా అయితే రామచంద్రపురం రోడ్డున తోటలున్నాయి. అక్కడ ఉసిరిచెట్లుకూడా వున్నాయి!" అన్నాడు రఘు.

"బి.హెచ్.యీ.ఎల్‌కి పోయే రూట్లోనా? అవునండి. నేనూ యిదివరకోసారి అటు వెళ్తూ చూశాను. తోటలున్నాయి!" అన్నాడు సురేంద్ర.

"అయితే రేపోసారి వెళ్ళి ఆ తోట యజమాని యెవరో ఓసారి కల్సుకుని పర్మిషన్ అడుగుదాం!" అన్నాడు సీతారాం.

# 2

ఆదివారం ఉదయం ఆరుగంటలకే అందరు అనుకున్న ప్రకారం కంట్రోల్ రూం ఎదురుగా వున్న సిటీ బస్టాపు దగ్గర పబ్లిక్ గార్డెను మెయిన్ గేటువద్ద కలుసుకున్నారు. అందరు సిటీలోని వివిధ ప్రాంతాలనుంచి అయిదు గంటలకే తెమిలిపోయి, పిల్లలతో బస్సులు కొందరు, ఆటోలు కొందరు పట్టుకుని అక్కడకు చేరుకున్నారు. చివర్లో, యిక రాడనుకుంటున్న సమయంలో ఆరున్నరకు దివాకర్ భార్యతోను, యిద్దరు పిల్లల్తోను ఆటోలో వచ్చాడు.

రాగానే అందర్నీ క్షమించమన్నట్టు చూసి, "బస్ కోసం ప్రయత్నించాను. ఆదివారంకదా తేలిగ్గా దొరుకుతాయికదా అనుకున్నాను. కాని దిల్ కుష్ నగర్ నించి రావటమంటే యింత కష్టమని ఈరోజే తెల్సుకున్నాను" అన్నాడు దివాకర్.

ఆడవాళ్ళు ఒకరినొకరు పలకరించుకున్నారు.

"సురేంద్ర నిన్న రాత్రే వెళ్ళి అన్ని యేర్పాట్లు తోటలో చేసివుంచుతానన్నాడు. అతనుండేది సంజీవ రెడ్డి నగర్లో. పైగా బ్రహ్మచారి, బాదరబందీ లేదు. అందుకే నిన్న అతన్ని ప్రొవిజన్స్ అన్ని తీసుకు వెళ్ళమని వర్కు ఎలాట్ చేసేశాను!" అన్నాడు గంగాధరం.

సీతారాం, రఘు అతనివంక ప్రశంసపూర్వకంగా చూశారు. "కాని మనం నలుగురం వుండి, మనకి కొత్తగా ఫ్రెండయిన సురేంద్రగార్ని యీ పనికి నియోగించటం అంత బావుండలేదేమో!" అన్నారు.

"ఫరవాలేదు, అతను మా ఆఫీసులో నా కొలీగ్. అతనలా అనుకునే మనిషయితే చెపుతానా? మీకు

తెలీదుగాని, సురేంద్ర చాలా మంచివాడు. స్ట్రెయిట్ ఫార్వర్డు. ఉన్నతమైన వ్యక్తిత్వం. కొన్నాళ్ళు పోతే బడితే అతని గురించి మీరే చెపుతారు!" అన్నాడు గంగాధరం.

రామచంద్రపురంపోయే బస్ వచ్చి ఆగింది. ఖాళీగానే వుంది.

# 3

తోటలో సురేంద్ర అప్పటికే వంటవాళ్ళతో ఉడి పప్పు వేసిన కమ్మటి ఉప్మా తయారు చేస్తున్నాడు. తోటలోకి ప్రవేశించిన జనాలకు ఆ కమ్మటి సువాసనలకు కరకరమంటూ ఆకలి పుట్టుకొచ్చింది.

సీతారాం, రఘు, దివాకర్ తమ భార్యల్ని సురేంద్రకు పరిచయం చేశారు. గంగాధరం భార్య పూర్ణిమ సురేంద్ర కిదివరకే తెలుసు.

దివాకర్ భార్యనుచూసి సురేంద్ర ఒక్క_క్షణం నివ్వెరపోయినట్టు కనిపించినా వెంటనే తన తొట్రుపాటును కప్పిపుచ్చుకున్నాడుగాని, సునంద వెంటనే ఈ లోకంలోకి రాలేకపోయింది.

"నమస్తే చెప్పవేం, బావుండదు చెప్పు!" అని భార్యను దివాకర్ మోచేత్తో పొడిచాకగాని సునంద తేరుకోలేదు. "వీళ్ళిద్దరూ మా పిల్లలు. అబ్బాయి పెద్దవాడు. అమ్మాయి చిన్నది!" అన్నాడు దివాకర్ పిల్లల్ని చూపించి.

సురేంద్ర నమ్రతగా నమస్తే చెప్పి, పిల్లల చెక్కిళ్ళు పుణికాడు. రఘు భార్య రేవతికూడా సురేంద్రను చూసి ఆశ్చర్యపోయినట్టు కనిపించింది.

"చాలా బాగా చేయించారు సురేంద్రగారూ, ఉప్మా.

నిజంగా జన్మ తరించిపోయింది" అన్నాడు సీతారాం ఉప్మాను, సురేంద్రను తెగ మెచ్చుకుంటూ.

"అసలు, ప్రపోజ్ చేసిన నువ్వేమో అందరితోను గెస్టులా వచ్చావు. మా సురేంద్ర అన్ని యేర్పాట్లుచేస్తే నువ్వు హాయిగా ఉప్మాను తింటు మెచ్చుకొంటు న్నావు!?" ఛలోక్తిగా అన్నాడు గంగాధరం.

సురేంద్ర పొడిగా నవ్వాడు. తన తడబాటును బహిర్గతం కాకుండా చాలా ప్రయత్నం చేస్తున్నాడతను. సునందవైపు చూడకూడదనుకుంటూనే రెండుమూడుసార్లు చూశాడు. సునంద అతని చూపుల్ని యెదుర్కోలేక కళ్ళు వాల్చేసుకున్నది.

రఘు చకచక చాపలు పరిచేసి, పేక దస్తాలు బయటకి తీశాడు. "సీతారాం, దివాకర్, రండి రండి! ఓయ్ గంగాధరం, నీక్కూడా బొట్టుపెట్టి పిలవాలా, రా,రా!" అంటూ హడావిడి పడిపోతున్నాడు.

గంగాధరం వంటవాళ్ళ దగ్గర కూచుని బంగాళా దుంప కుర్మా చేయిస్తున్న సురేంద్రను కేకపెట్టి పిలిచాడు.

సురేంద్ర అక్కడ్నుంచే జవాబిచ్చాడు. "సారీ, ఇక్కడ నే నీ పనులు చూస్తుంటాను, మీరు కానివ్వండి. చిక్కటి స్ట్రాంగ్ కాఫీ పంపిస్తాను. కాఫీయా, టీయా?" అన్నాడు.

గంగాధరం సురేంద్ర దగ్గరకు పరుగెత్తికెళ్ళి రెక్క పట్టుకొని గాడిపొయ్యిల దగ్గర్నించి లేవతీసి, "భలే వాడివే! ఉన్నది లింగులింగుమని అయిదుగురం. అందులో ఓ హేండ్ మిస్సయితే ఆడటం అనవసరం! ఈ గార్డెన్ పార్టీ వెలాతెలాపోతుంది" అన్నాడు. "పూర్ణిమా మీ ఆడవాళ్ళు దగ్గరుండి వంటపనులు చూసుకోకూడదా?

అక్కడ చేరి కబుర్లతో కాలక్షేపం చెయ్యకపోతే!?"
అంటూ భార్యను కేకేసి పిలిచాడు.

పిల్లలందరు తోటలో కేరింతలు కొడుతూ ఆడుకొంటున్నారు. వాళ్ళవంక అపురూపంగా చూసుకుంటూ లోకాభిరామాయణంలో పడిన ఆడవాళ్ళు గంగాధరం కేకతో, నవ్వుకుంటూ వంటవాళ్ళున్న చోటికి చేరుకున్నారు. ఆపాటికి గంగాధరం సురేంద్రను లాక్కుపోయి పేకాటముందు కూలేశాడు.

"ఇంకోదఫా జీడిపప్పు ఉప్మా లాగిస్తే బావుండునోయ్" అన్నాడు రఘు, సీతారాంతో.

అరటి ఆకుల్లో మళ్ళీ ఉప్మాలు వచ్చేశాయి. గంగాధరం భార్య పూర్ణిమ కేన్‌తో మంచినీళ్ళు, గ్లాసులు పట్టించుకొని వచ్చింది.

రఘు ఉప్మా నోట్లో వేసుకొని, "వేడిమీద తింటే ఓ రకం రుచీ, చల్లారాక యింకోరకం టేస్టూ ఉప్మాకే చెల్లిందోయ్ గంగాధరం!" అన్నాడు.

"సరే, పలమారేవు. శుభ్రంగా తినేసి మాట్లాడు!" అన్నాడు రఘు మంచినీళ్ళ గ్లాసు అందిస్తూ.

సరిగ్గా అదే సమయానికి ఆడవాళ్ళు యేదో గోలగా అరిచారు. సురేంద్ర బాణంలా దూసుకుపోయాడు. సునంద కొంగు అంటుకొని మండుతోంది. సురేంద్ర చేతుల్లో కొంగును నులిమి, మంట ఆర్పేశాడు. సిగ్గుతోను, భయంతోను సునంద వళ్ళంతా చెమట్లు పోశాయి. గుండె వేగం హెచ్చింది. సురేంద్ర చేతులు బొబ్బలెక్కాయి.

ఆపాటికి మగవాళ్ళందరు వంటపొయ్యిల దగ్గరకు చేరుకొన్నారు.

"అమ్మగారు వెనకపాటున నించుని వున్నట్టున్నారు బాబూ, చటుక్కున కొంగు అంటుకున్నది. బాబుగారు బాగానే అందుకున్నారు. మేము నీళ్ళు తీసుకురావటానికి నుయ్యి దగ్గరకు వెళ్ళాం! కేకలు విని పరుగెత్తుకొచ్చే లోపల యీ బాబుగారు మంట నార్పేశారు, చాలా అదృష్టవంతులం!" అన్నారు వంటవాళ్ళు.

"చాలా థాంక్స్ సురేంద్రగారూ!" అన్నాడు దివాకర్ కృతజ్ఞతగా.

"ఇట్సాల్ రైట్!" అంటూ వెనుతిరిగి వచ్చేశాడు సురేంద్ర. గంగాధరం ప్రశంసాపూర్వకంగా అతని చేతిని నొక్కాడు.

## 4

టేప్ రికార్డర్ నుంచి బాలుపాడిన, యే దివిలో విరిసిన పారిజాతమో..శ్రావ్యంగా వినిపిస్తోంది. రఘు తెచ్చాడు, టూయిన్ వన్ స్టీరియో రికార్డరు.

ఈ సంఘటన తర్వాత ఆట అంత యింటరెస్టుగా సాగటం లేదు. "చాలా ప్రమాదం తప్పిపోయింది. బలవంతంచేసి యీ ప్రోగ్రాం ఫిక్సు చేసినందుకు ఏదైనా జరిగితే అదంతా నా తప్పే అయివుండేది!" అన్నాడు సీతారాం.

"ఇందులో నీ తప్పేముంది? ప్రతి యేడూ మనం గార్డెన్ పార్టీ పెట్టుకోవటం లేదా. అలాగే యీ సంవత్సరమూను, అనుకోకుండా యిలా ప్రమాదమెదురవుతుందని ఊహించలేం కదా!" అన్నాడు దివాకర్.

పూర్ణిమ వచ్చి, "భోజనాలు సిద్ధంగా వున్నాయి. చేసేస్తారా?" అనడిగింది.

ఆట యెలాగూ రసవత్తరంగా లేకపోవటంతో ఆమె

వచ్చి చెప్పగానే పేకలు ఓ పక్కగా పడేసి లేచి పోయా రందరూ.

మోటారు బావివద్ద చల్లటి నీళ్ళతో చేతులు కడు క్కోగానే బడలికంతా తీరిపోయి చాలా హాయిగా వున్నట్టనిపించింది, ప్రతి ఒక్కరికీ. పిల్లలందరు గుడ్డల నిండా యిసకపోసుకొని కేరింతలు కొడుతూ తల్లుల కందకుండా యేడ్పిస్తున్నారు. చివరికి యెలాగైతేనేం, అందరు పెద్ద ఉసిరిచెట్టు కిందికి చేరారు. ఆ తోటలో ఉసిరిచెట్లు విస్తారంగా వున్నాయి. ఓ పక్కగా నూతి పక్కగా చేర్చి అరటిచెట్లు దట్టంగా పెరిగివున్నాయి.

రైతు నడిగి లేత అరటి ఆకులు కోసుకొని వచ్చాడు గంగాధరం. పూర్ణిమ అతనికి ఆ పనిలో సాయంచేసింది.

సీతారాం వాళ్ళిద్దరివంకా మురిపెంగా చూస్తూ "మీ భార్యాభర్తలు చాలా శ్రమతీసుకొని ఈ వన భోజనాలని రసవత్తరంగా నిర్వహించటం కన్నుల పండువుగా వున్నది!" అన్నాడు.

"ప్రతిసారీ నువ్వు సతీసమేతంగా యీ డ్యూటీ తీసుకునేవాడివి కదా, యీసారి మేం తీసుకొన్నాం. రఘుకూడా తీసుకుంటాడు మధ్యాహ్నం టిఫిన్ సెక్షను!" అన్నాడు గంగాధరం.

"ఆల్ రైట్! అయిదు గంటలకి మనం వైండప్ చేసెయ్యాలి! ఓ.కే!?" అన్నాడు సీతారాం.

వంటలు చాలా బాగా కుదిరాయి. పులిహోర అందరు మారు వడ్డించుకున్నారు. బూరెల్లో కమ్మటి నెయ్యి కొత్త రుచిని సంతరించుకొంటే బంగాళదుంప కుర్మా, బఠాణీ కలిసిన వంకాయ కూర ఘుమఘుమలు చిందిం చాయి. కొబ్బరి పెరుగు పచ్చడి గోంగూర పచ్చడితో

పోటీ పడింది.

అందరు సురేంద్ర మేనేజిమెంటును పొగిడారు. అతను సిగ్గుపడ్డాడు.

"మరీ అంతగా పొగిడెయ్యకండి, గర్వం వచ్చెయ్య గలదు! నేను చేసిందేం లేదు, అజమాయిషీ తప్ప!" అన్నాడు.

కడుపునిండా తిన్నాక కంటినిండా నిద్రపోవాలని పించటం సహజం!

సీతారాం, రఘు, దివాకర్, గంగాధరం వరసగా పచ్చని చెట్టుకింద చాపలమీద వెల్లకిలా పడుకుని కబుర్లు చెప్పుకుంటున్నారు. సురేంద్ర మాత్రం ఒంటరిగా ఓ పక్కగా కూచుని ఓ కాగితంమీద ఏదో లిస్టు రాసుకుం టున్నాడు.

దూరంగా పిల్లల కేరింతలు వినపడుతున్నాయి. ఓ పక్కగా తోట కాలువ పాలేర్లు యిద్దరు భోజనాలు చేస్తున్నారు. మిగిలిపోయిన ఆహారపదార్థాలని పాలేళ్ళను పిలిచి సురేంద్ర పెట్టెయ్యమన్నాడు. రైతును అంతక్రితం తమతో భోంచెయ్యమంటే, ఆయన మొహమాట పడి పోయాడు. సురేంద్ర ఆయనకు విడిగా పంపించాడు మోటార్ షెడ్ దగ్గరకు. రైతు సాధారణంగా ఆ షెడ్లోనే భోజనం చేస్తుంటాడు.

## 5

సాయంత్రం నాలుగున్నర అయింది.

పూర్ణిమ తెచ్చిన వార్త క్షణాల్లో అక్కడి వాతా వరణాన్ని స్తంభింపచేసింది!

సునంద, యిద్దరు పిల్లలు కనిపించటంలేదు!

మొగవాళ్ళందరు ఉలిక్కిపడి లేచారు.

"ఏమిటి, అసలేమయింది పూర్ణిమగారూ!" అంటూ దివాకర్ లేచి చెప్పులు వేసుకుంటుంటే, తక్కినవాళ్ళు కూడా చకచక లేచి కూచున్నారు.

అరగంట క్రితం వాళ్ళ చిన్నపాప లెట్రిన్‌కి పోతానంది. సునంద ఆ పాపను తీసుకొని మోటార్ షెడ్‌కు దూరంగా కూచోబెట్టడానికి వెళ్ళింది. షెడ్ దగ్గర్నుంచి నీళ్ళుకూడా తీసుకువెళ్ళటం యిక్కడ్నుంచి మేం చూస్తున్నాం. తిరిగివస్తున్న జాడ కనపడకపోవటంతో పిల్లలు మళ్ళీ ఏం ఇబ్బంది పెడుతున్నారోనని రేవతి నేను వెళ్ళాం సాయం చేద్దామని! కాని అక్కడ సునందగాని, పాప, బాబుగాని లేరు. చుట్టుపట్ల అంతా వెతుకుతుంటే, రైతు యేమిటని అడిగారు. మేం చెప్పింది విని పాపం ఆయన కూడా కంగారుపడి, అంతటా వెతికించారు. కాని సునంద గాని, పిల్లలుగాని కనపడలేదు....!

కాసేపట్లోనే అక్కడి వాతావరణం విషాదంగా మారిపోయింది.

అరగంటసేపు అందరు తోటంతా కలియతిరిగారు. సురేంద్ర తోట నుంచి రోడ్ కనెక్షన్‌వరకు పోయి వచ్చాడు. అతని ముఖం చాలా వాడిపోయి వుంది. దివాకర్ వచ్చేడు. దుఃఖాన్ని అపుకుంటున్నాడు. రేవతి ఏడ్చెయ్యటానికి సిద్ధంగా వుంది.

రైతు, పాలేళ్ళుకూడా వెతికి తిరిగొచ్చారు.

"చాలా చిత్రంగా వుండాది బాబూ! ఇంతదాకా బుల్లెమ్మని నేను చూసాను. వున్నట్టుండి ఎటు వెళ్ళిందో!" అన్నాడు రైతు. ఆయన పేరు బాలయ్య.

ఆ పాటికి సురేంద్ర, దివాకర్, సీతారాం, గంగాధరం, రఘు తోటంతా నాలుగోసారి చుట్టివచ్చేశారు.

కాని సునంద జాడ, పిల్లలజాడ దొరకలేదు. పాలేళ్ళు, వంటవాళ్ళు మరో పక్కనుంచి తోట కలియతిరిగి వచ్చారు. ఆడవాళ్లు, పిల్లలు బిక్కచచ్చిపోయి అలాగే వున్నచోటనే వుండిపోయారు. తమతోడి స్నేహితురాలు అంతదాకా తమ మధ్య తిరిగిన సునంద అంతర్థానం కావటం వాళ్ళకు చాలా చిత్రంగాను, నమ్మశక్యం కాకుండాను వున్నది.

అనుమానంకొద్దీ రైతు షెడ్డును గాలించాడు. నూతిలోకూడా చూసివచ్చారు. యేదైనా విషపురుగు వంటిది కుట్టిందేమోనని అనుమానమున్న ప్రతిచోటా గాలించారు. కాని యెక్కడా సునంద జాడలేదు!" అప్పటికే చీకటి పడబోతుంది.

"ఇది చాలా విచిత్రంగా వుంది. తోటలో మనమధ్య వున్న మనిషి అకస్మాత్తుగా ఎక్కడికి వెళ్ళిపోతుంది? పైగా యిద్దరు పిల్లలుకూడా కనిపించటంలేదు. నాకేం అర్థంకావటంలేదు!" దివాకర్ గొంతు బొంగురుపోయింది. అతనికి తెలియకుండానే కళ్లు వర్షిస్తున్నాయి.

"నాకూ అదే అర్థం కావటంలేదు. అందరు ఇక్కడే వున్నారు. మనంకూడా విశ్రాంతిగా పడుకున్నామేగాని ఎవరమూ నిద్దరు పోలేదు. ఇంతమంది వుండగా బయట నుంచి యెవరో వచ్చి వాళ్ళను యెత్తుకుపోవటమనేది అసంభవం....! రఘు యేదో అంటుండగానే ఎవరో కీచుగా అరిచారు. "రేవతి కనిపించటంలేదు!" అని.

## 6

అందరు త్రుళ్ళిపడి చూశారు.

నిజమే! రేవతి లేదు ఎక్కడా.

రఘు పిచ్చిగా కేకవేశాడు. "ఇంతవరకు యిక్కడే

వున్నది కదా మీతో, ఇంతలోనే యేమయిపోయింది?" అన్నాడు.

మళ్ళీ ఆమె కోసం అన్వేషణ సాగించారు. రఘు మతి పోయిన వాడిలా తోటంతా తిరుగుతున్నాడు. బాలయ్య అయితే మరీను. తన తోటలో సరదాగా వన భోజనాలు చేసుకున్న బాబులకి యెంత కష్టమొచ్చింది అంటూ వాపోతున్నాడు. పాలేళ్ళను తరిమి తోటలో ప్రతీ అంగుళం వెతకమన్నాడు.

రేవతికి కూడా యిద్దరే పిల్లలు. తల్లి కనపడకపోవ టంతో వాళ్ళిద్దరు ఏడుపు మొదలెట్టారు. పూర్ణిమ, సీతారాం భార్య విమల పిల్లల్ని సముదాయించలేక సత మతమవుతున్నారు.

సురేంద్ర తోటచుట్టూ నిశితంగా పరిశీలించాడు. ఆ తోటకి ఎడమప్రక్క ఖాళీ స్థలం వుంది. కుడిపక్కగా మరొకరి తోట వున్నది. రెండు తోటలకి మధ్య చిన్న గేటుంది. తోటచుట్టూ ముళ్ళకంప కొట్టివున్నది.

సురేంద్ర పాలేళ్ళను పిలిచి అడిగాడు పక్కతోట గురించిన వివరాలు.

"అయ్యా, అది నర్సిమ్మ అనే రైతు తోటండి. నర్సిమ్మ కొడుకు యాదయ్య చూసుకుంటున్నాడు. ఉదయం అక్కడ కూడా వన భోజనాలయి నట్టుం దండి. యెవరో నలుగురు బాబులు సైకిలుమోటర్ల మీదొచ్చి మజా చేసుకుండారు" అన్నారు వాళ్ళు.

సురేంద్రకి యేదో తట్టింది. "మజా చేసుకోవట మంటే....? మందు వగయిరా?...." అన్నాడు.

పాలేళ్ళు తలూపి "అవునండయ్యా! యేదో సీసాలు దెచ్చుకున్నారండి. తాగి తందానా లాడేరు...."

అన్నారు.

"అయితే వాళ్ళెవరో యాదయ్యను, నర్శిమ్మను బాగా తెలిసేవుండాలి, అవునా?"

"తెలుసుంటదండి!" అన్నారిద్దరు.

"మీరు పోయి తండ్రీ కొడుకు లిద్దర్లో యెవరైనా వున్నారేమో చూసిరండి!" అన్నాడు సురేంద్ర.

"ఎవరూ లేరు బాబూ! ఇందాకనే ఓ గంట క్రితం సిటీకి పోనారంట. పాలేరు జెప్పాడు" అని కబురు తెచ్చారు వాళ్ళు.

"ఆ పాలేరు నోసారిట పిలు!" అన్నాడు సురేంద్ర.

పక్క తోట పాలేరు పరుగెత్తుకొచ్చారు.

"ఏమయ్యా, మీ తోటలో యింతదాకా యెవరో పార్టీ చేసుకున్నారటకదా, వాళ్ళెవరో నీకు తెలుసా?" సురేంద్ర అడిగాడు.

"అళ్ళు అయ్యగారి దోస్తులయ్యా. ఓ గంట క్రితమే అయ్యగారు, అల్లు కలిసి సిటీకి యెల్లిపోనారు" అన్నాడు పాలేరు.

"అయ్యగారి దోస్తులా? పెద్దయ్యగారికా, చిన్నయ్య గారికా?"

"చిన్నయ్యగారికే నండి. అప్పుడప్పుడు అల్లొచ్చి తోటలో గడిపేసి పోతంటారు."

"ఎంతమంది? వాళ్ళ పేర్లేమిటి?"

"ఆ రోకోసారి నలుగు రొత్తారండి. ఇంకోపాలి యిద్దరొత్తుంటారండి. పేరులు నాకు సరిగా తెలవదు బాబూ! మా చిన్నయ్యగో రొచ్చాక కనుక్కుని సెప్ప మంటే సెపుతా!"

"అదిసరే, వాళ్ళు పార్టీ ముగించుకుని అందరు వెళ్ళి

పోయారా? దేంట్లో వెళ్ళారు?"

"రెండు సైకిలు మోటర్లు వెచ్చారండి. మా సిన్నయ్య గోరికి స్కూటరుందండి. ఆయిదుగురు మూడింటిమీదా కూచుని ఎల్లిపోనారండి!" అన్నాడు పాలేరు.

"ఊఁ! యిటుపక్కగా ఎవరయినా ఆడపిల్లలు గాని చిన్నపిల్లలుగాని రావటం నువ్వు చూశావా?"

"లేదండి!"

సురేంద్ర హతాశుడై పోయినట్టు చూశాడు. చివరి ప్రయత్నంగా అన్నాడు. "మీ అయ్యగారితో గాని, స్నేహితులతో గాని ఆడవాళ్ళెవరైనా వెళ్ళారా?"

"అబ్బే, లేరు బాబూ!"

# 7

సురేంద్ర తిరిగి వచ్చేసరికి అక్కడి వాతావరణం చాలా గంభీరంగానూ, అంతకుమించి భయంకరంగాను వున్నది.

రఘు, దివాకర్ బోనుల్లో పడ్డ సింహాల్లా పచార్లు చేస్తున్నారు.

సురేంద్రను చూడగానే దివాకర్ కోపంగా అతని మీదికి దూసుకువచ్చి, "నా భార్యా పిల్లల్నేం చేశావు, చెప్పు" అన్నాడు.

సురేంద్ర నిర్ఘాంతపోయాడు.

"ఏమిటి మీర నేది? నాకేం తెలుసు? నేను మీతోనే వున్నాను కదా! వాళ్ళకోసమే యిప్పటిదాకా పక్క తోటలో ఎంక్వయిరీ చేసి వస్తున్నాను!"

"అబద్ధం! నువ్వే వాళ్ళనేదో చేసివుంటావు. నువ్వు సునందతోను, రేవతితోను ఏదో మాట్లాడటం వంటవాళ్ళు చూశారు! వాళ్ళతో నీకు ఏం పని? నీకు వాళ్ళెలా

తెలుసు? చెప్పు, ఎన్నాళ్ళుగా సాగుతోందీ నాటకం?"

దివాకర్ యేం మాట్లాడుతున్నాడో అతనికే తెలీటం లేదు.

"నన్ను పార్టీకి కావాలని ప్రత్యేకం చేసుకుంటున్నారు. భగవంతుడి సాక్షిగా వాళ్ళు, పిల్లలు ఏమయ్యారో నాకు తెలీదు!"

"నటించకు! ఇందాకా, అంటే భోజనాలకి ముందు వంటయిందా అని వంటవాళ్ళ నడిగే నెపంతో నువ్వు సునందతో యేదో మాటలాడటం, ఆమె యేడవటం, నువ్వు సముదాయించటం, రేవతి కూడా మీ ఇద్దరితోను యేదో మాట్లాడటం యివన్నీ వంటవాళ్ళతో పాటు పూర్ణిమగారు, విమలగారు కూడా చూశారట. కాని మీరేం మాట్లాడుకున్నారో వాళ్ళకి సరిగా వినిపించ లేదట!

దీన్నిబట్టి నీకిదివరకే రేవతితోను, నా భార్యతోను పరిచయముండివుండాలి! అందుకే కావాలని యీ పార్టీకి నువ్వు తయారవటమే కాకుండా, అన్నీ నీమీద వేసు కున్నట్టు నటించి మా అందర్నీ ఆకట్టుకున్నావు. ఏదో ప్లాన్ వేసుకొని, కావాలనే యీ స్నాబే ఎన్ను కున్నావు. చెప్పు, నా భార్యా పిల్లల్నేం చేశావో చెప్పు" ఆవేశంగా సురేంద్ర కాలర్ పట్టుకున్నాడు దివాకర్.

గంగాధరం కల్పించుకుని దివాకర్‌ని విడిపించి, "నువ్వు ఆవేశంలో యేం మాట్లాడుతున్నావో నీకే తెలి యటం లేదు—నీ భార్యను అవమానకరంగా మాట్లాడు తున్నావు, రఘు భార్యనీ అవమానిస్తున్నావు. నిజానిజాలు తెల్సుకోకుండా తొందరపడకు" అన్నాడు మందలిస్తూ.

రఘు కూడా ఆవేశంగా వున్నాడు.

"పోనీ అతనిలో ఎలాంటి దురుద్దేశం లేకపోతే నోరెత్తదేం? అదంతా నిజం కాదని ఒక్క మాట కూడా అనదేం?" రఘు అందుకున్నాడు.

"సురేంద్రగారూ! జరిగిన సంగతేమిటో చెప్పి వీళ్ళ అనుమానాలు నివృత్తి చెయ్యండి! మీరు అంత చీప్ వ్యక్తి కాదని నాకు తెలుసు! కాని వీళ్ళు భార్యలు కనిపించక ఆ దుఃఖంలో వుండి వాళ్ళేం మాట్లాడుతున్నారో వాళ్ళకే తెలీదు! ప్లీజ్, జరిగిన సంగతి చెప్పండి!" సీతారాం అభ్యర్థించాడు.

సురేంద్ర అవమానభారంతో దెబ్బతిన్న లేడిలా తలెత్తి అందరివంకా చూశాడు. అతని కళ్ళలో యేదో వీర నిశ్చయానికి వచ్చిన ఛాయలు తొంగి చూస్తున్నాయి.

"ఇప్పుడు నేనేం చెప్పినా అది మీరు నమ్ముతారనే నమ్మకం నాకు లేదు. దివాకర్ గారూ, మీరు ప్రస్తుతం అనుమానమనే పెద్ద పిశాచంపట్టి వున్నారు. మీ రిప్పుడు చేసిన ఆరోపణలు నిజం కాదని మీకూ తెలుసు. నిజానికి చెద పట్టదు, గుర్తుంచుకోండి!" అన్నాడు సురేంద్ర.

ఎవరూ మాట్లాడలేదు. దివాకర్ పళ్ళ బిగువున కోపాన్ని నిగ్రహించుకోవటం స్పష్టంగా కనిపిస్తోంది. గంగాధరం మిత్రుడివంక ఆర్ద్రత నిండిన కళ్ళతో చూస్తున్నాడు. సురేంద్ర నిజాయితీ అతనికి తెలిసినంతగా అక్కడ ఎవరికీ తెలియదు.

సూర్యుడు అస్తమించటంతో నలుమూలలా పూర్తిగా చీకట్లు కమ్ముకొన్నాయి.

బాలయ్య పాలేళ్ళచేత పైరు బయటికి లాగించి బల్బులు పెట్టే ప్రయత్నంలో వున్నాడు.

సురేంద్ర, గంగాధరాన్ని పిలిచి, "నువ్వొక్కడివే నాకు తెలిసినవాడివి, స్నేహితుడివి. నేను టార్చి తీసుకుని యీ చుట్టుపక్కల అంతా వెతుకుతాను. మీరందరు రెస్టు తీసుకోండి. సునంద, రేవతిగార్లను, పిల్లల్ని తీసుకు వచ్చి అప్పగించేవరకు నేను మీ కళ్ళముందు పడను. నా ముఖం చూపించను!" అన్నాడు చకచక ముందుకి అడుగులు వేస్తూ.

గంగాధరంతో చెప్పి, బాలయ్యవద్ద టార్చి తీసుకున్నాడు సురేంద్ర. వడివడిగా అడుగులు వేస్తూ వెళ్ళిపోయాడు.

# 8

సురేంద్ర పక్క తోటలోకి వెళ్ళాడు. పాలేరు ఒక్కడే వున్నాడు. అతన్ని చూడగానే దగ్గరగావచ్చి, "మీరా బాబయ్యా, మా దొరగారింకా రాలేదండి!" అన్నాడు.

"పెద్ద దొరా, చిన్నదొరా?"

"పెద్దొర యీ మద్దెన అసలు రావటం లేదండి. చిందొరే, యాదయ్య దొర!"

"తర్వాత, అంటే మీ దొర, ఆయన స్నేహితులు సైకిలుమోటార్ల మీద వెళ్ళిపోయాక, తోటలోకి యెవరైనా వచ్చారా?"

"ఎవ్వరూ రాలేదయ్యా!"

"నీ పేరేమిటన్నావు?"

"నాగయ్య దొరా!"

"చూడు నాగయ్యా, మాకు చాలా ముఖ్యమైన

సమాచారం కావాలి! మీ దొరగారితో వున్న స్నేహితులు యెక్కడుంటారో ఆ వివరాలేమయినా తెలుసునా?"

"నాకేటి తెలుస్తాది బాబూ, ఆ యిసయాలన్నీ మా దొరకే తెలుసు. కూలివాడికి చెపుతారా బాబూ?"

"సరే, మీ దొర మళ్ళీ ఎప్పుడొస్తారు?"

"రేపు తెల్లారినంకనే బాబయ్యా!"

"సరే! మీ దొర, ఆయన స్నేహితులు మజా చేసుకుంటున్న సమయంలో మా తోటలో నుంచి, అంటే బాలయ్యగారి తోటలో నుంచి యెవరయినా ఆడవాళ్ళు బయటకు వెళ్ళటంగాని, లేక యెవరయినా మగవాళ్ళు మరెవరో తోటలోకి ప్రవేశించటంగాని చూశావా?"

నాగయ్య కొద్ది క్షణాలు ఏదో గుర్తుచేసుకోవటానికి ప్రయత్నించాడు.

"ఇయ్యేల అలాంటివాళ్ళనెవర్నీ చూల్లేదు బాబయ్యా. నిన్న సందేల చూసేను" అన్నాడు.

"నిన్న సాయంత్రమా? నేను నిన్న సాయంత్రం యిక్కడే వున్నాను కదా!...." ఆశ్చర్యంగా అన్నాడు సురేంద్ర.

"అవును బాబూ! మీరొచ్చాకనే. మీరు ముందుగా వచ్చేసి, ఎనక ఆడంగులు, పిల్లలు యియ్యేల వొస్తారని సెప్పినారంట గందా, బాలయ్యగోరి పాలేరు కాంతయ్య సెప్పిందు దొరా!....మీరు లోపల బాలయ్య దొరతో మాట్లాడతన్నారు గందా, అప్పుడు సైకిలు మోటరుమీద ఓ ఆసామీ వొచ్చిందు. నన్ను పిలిసి, ఆ తోటలోకి ఆడోల్లెవరన్నా వొచ్చారా అనడిగారండి. నేను ఆయన గూడా మీ తాలూకేమో ననుకుని, యిగాయనే

వొచ్చారండి, రేపు పొద్దుగాలే అడంగులు, పిల్లలు వొస్తుండ్రంటని సెప్పిన. ఆయన సర్లె అనుకుంట బోయిండు."

సురేంద్ర ఆశ్చర్యంగా విన్నా డతని మాటలు. జేబు నుంచి ఏభై రూపాయల నోటు తీసి నాగయ్య చేతి కందించాడు. నాగయ్య తీసుకోవటానికి మొహమాట పడుతుంటే బలవంతంగా అతని జేబులో పెట్టి, "ఫరవా లేదు, నీ కిది బక్షీసు, వుంచుకో!" అన్నాడు.

నాగయ్య హుషారుగా సురేంద్రవంక తిరిగి, "అడ గండి బాబయ్యా, యింకా యేం గావాల్నో!" అన్నాడు.

"చూడు నాగయ్యా, అతన్ని మీ చిన్నదొరతో ఎప్పుడయినా కలిసివుండగా చూశావా?"

"లేదు బాబయ్యా. మా యజమాని సేయితులు నాకు యాదే బాబూ!"

"సరే, అతను ఏవైపు నుంచి వచ్చాడు? అటు సిటీ వైపునుంచా, లేక యిటు బి.హెచ్.యీ.యల్. కొద్దు నుంచా?"

"సిటీ ఏపునించే నండి."

"సరే, అతను నీకు మళ్ళీ కనిపిస్తే గుర్తుపట్ట గలవా?"

"నాకు యాదే బాబూ!"

"మంచిది. నేను నిన్ను యీ వివరా లడిగినట్టు యెవరికీ, చివరకి మీ దొర్లకు కూడా చెప్పకూడదు. సరేనా?"

"అయ్య బాబూ, నాకు తెల్దేటి బాబూ!"

సురేంద్ర ఆ తోటంతా గాలించాడు. కాని అనుమా

నించదగ్గది ఏదీ కనిపించటంలేదు. అక్కడ్నించి బాలయ్య తోటలోకి చూశాడు. ఏవో కిర్సనాయిలు దీపాలతో దివాకర్, రఘు తోటలో వెతుకుతున్నారు. బహుశా షెడ్డులో పాత హరికెన్ లాంతర్లున్నాయి కాబోలు, వాటి సాయంతో వెతుకుతున్నారు. ఇంకా ఆశ చావక తోట పరిసరాల్లోనే చూసిన చోటనే చూస్తూ, తిరిగిన చోటనే తిరుగుతున్నారు. వాళ్ళ వెంట సీతారాం, గంగాధరం వున్నారు! ఆడవాళ్ళు పిల్లలు, పాలేర్ల కాపలాలో షెడ్డు దగ్గర నించుని వున్నారు.

# 9

సురేంద్ర బయటనుండి బాలయ్య తోటచుట్టూ తిరగటం మొదలెట్టాడు.

బాలయ్య తోటకు ఓ పక్కగా సన్నటి కాలిబాట పోతోంది. అది సరాసరి తారురోడ్డుకి దారితీస్తోంది. తారురోడ్డు నుంచి తోటకు ఆ సన్నటి కాలిబాటే దారి!

అది దాదాపు ఓ ఫర్లాంగు దూరముంది. తారు రోడ్డు నుంచి తోటవరకు మోటరు సైకిలుకన్న పెద్ద వాహనం రావటానికి సరిపడే జాగాలేదు. అంటే ఏదయినా కారుగాని, జీపుగాని సునంద రేవతిలను దాటవెయ్యటానికి ఉపయోగించి వుంటే, అవి తారు రోడ్డుమీదనే నిలిపి వుండాల్సి వుంటుంది! వాళ్ళు యిద్దరు, పిల్లలు యిద్దరు. పట్టపగలు ఎవరైనా యెత్తుకుపోయి రోడ్డుమీద కార్లోకి చేరవేయటం అసంభవం!

కాబట్టి వాళ్ళను తోటనుంచి బయటకు చేరవేయటం జరగలేదు! అంటే బాలయ్య తోటలోనే యెక్కడో దాచిపెట్టారా, లేక .. ?

అప్పటికి రాత్రి తొమ్మిది దాటింది.

సురేంద్ర, బాలయ్య తోటకి యెడమ పక్కగానున్న ఖాళీస్థలంవైపు చకచక అడుగులు వేశాడు, టార్చిలైటు వెలుగులో.

అక్కడ దారి సుగమంగా లేదు. కంచె వేసిన కంప ముళ్ళు కాళ్ళకు అడ్డంపడుతున్నాయి. వేసుకున్నది చప్పల్స్ కావటంవల్ల, ముళ్ళు యథేచ్ఛగా కాళ్ళ మడమలకు గుచ్చుకుంటున్నాయి. అయినా సురేంద్ర లెక్కచెయ్య లేదు.

బాలయ్య తోటకు ఎడమపక్కగా కొంతవరకు ఖాళీ స్థలం వుంది. ఖాళీస్థలం పక్కనుంచి మరో తోట ప్రారంభమయింది. దానికిచుట్టూ కంచె వేసి వుంది. ఓ పక్కనుంచి చెట్టు పచ్చి కొమ్మలతో కట్టిన కర్రగేటుంది.

సురేంద్ర మెదడు తీవ్రంగా పనిచేస్తోంది. సునంద చిన్నపాపను లెట్రినుకు తీసుకొచ్చిన బాలయ్యతోట ఏ పక్కకు వచ్చిందో సరిగ్గా ఆ పక్కకే కర్రగేటుంది.

సురేంద్ర మెదడులో మెరుపులు మెరిశాయి. రెండు తోటలకు మధ్యన వున్న ఖాళీస్థలం అంతా యిసకతో కూడి వుంది. ఇసకలోకి టార్చి ఫోకస్ చేసి చూశాడు. అడుగుజాడలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. కలగా పులంగా వున్న అడుగుజాడలు! బాలయ్య తోటకు ఆవైపు కంచె పక్కకు లాగేశారు ఎవరో! అక్కడ దారిచేశారు. ఆ దారి సరాసరి బాలయ్య తోట నుంచి పక్కనున్న తోట కర్రగేటుకి దారితీస్తోంది!

అంటే, సునందను పిల్లల్ని ఆ పక్కనుంచే యీ ఎడమపక్క తోటలోకి ఆ గేటుద్వారా తీసుకుపోయి వుండాలి!

సురేంద్ర కర్రగేటును సమీపించి పరీక్షగా చూశాడు.

లోపల ఓ నిట్రాటకు, గేటుకు సన్నటి యినపతీగతో బంధించి వుంచారు. దాన్ని విప్పటని వెళ్ళటం కష్టం కాదు. మెలిక తిరిగిన తీగ!

సురేంద్ర చకచక మెలిక తిప్పి, తీగను విప్పేశాడు. తీగ రెండో కొన నిట్రాటకు కట్టబడి వుంది! సురేంద్ర గేటు తెరుచుకొని తోటలోనికి ప్రవేశించాడు.

తోటంతా నిశ్శబ్దంగా వుంది. కీచురాళ్ళ రొద భయంకరంగా వుంది. చుట్టూ చిమ్మచీకటి. టైం చూసుకొన్నాడు. రేడియం ముళ్ళు మెరుస్తూ ఎనిమిదిగంటల యిరవైనిమషాలు చూపిస్తున్నాయి. అక్కడికి రోడ్డున పోయే వాహనాల హెడ్‌లైట్ల వెల్తురు వుండీ వుండీ కనిపిస్తోంది.

నేలమీదకు మాత్రం టార్చి వెల్తురును ఫోకస్ చేసి, టార్చి వెలుతురకు చేతిని అడ్డంపెట్టి వెలుతురు చెదిరిపోయి, యెవరికి అనుమానం రాకుండా జాగ్రత్త తీసుకుంటూ నడుస్తున్నాడు సురేంద్ర.

దూరంగా యెక్కడో సన్నటి వెల్తురు పడుతోంది. అది బహుశా మోటరు ఆపరేట్ చేసే షెడ్డు కావచ్చునని ఊహించాడు సురేంద్ర!

షెడ్డువైపు అడుగులు వేస్తున్నాడు. చుట్టూ ఎలాంటి అలికిడీ లేదు. చీమ చిటుక్కుమంటే వినిపించేటంత నిశ్శబ్దంగా వుంది. అది నారింజ,నిమ్మ మామిడి మొక్కలు విస్తారంగా వున్న తోట!

కింద ఎండుటాకులు కాళ్ళ కిందపడి చప్పుడు చేస్తున్నాయి. శబ్దం రాకుండా సురేంద్ర చేస్తున్న ప్రయత్నం ఫలించటంలేదు! సాధ్యమైనంత మెల్లగా అడుగుతీసి అడుగువేస్తూ నడుస్తున్నాడు.

ఎక్కడినుంచో చిన్నపాప ఏడుపు సన్నగా ఒక్క సారి వినిపించి ఆగిపోయింది! ఎవరో నోరు నొక్కేసి నట్టుగా స్పష్టంగా తెలిసింది సురేంద్రకు!

అంటే....అంటే....సునంద, రేవతి, పిల్లలు ఇక్కడే యీ తోటలోనే యెక్కడో బంధింపబడి వుంటారు! సురేంద్రకు వేయి ఏనుగుల బలం వచ్చింది. ఈ సమయంలో చంటిపిల్ల రోదన స్వరం యీ తోటలో వినిపించిందంటే, అది సునంద పిల్లల గొంతే అయివుండాలి! లేదా ఆ తోటలో పనిచేసే వాళ్ళ పిల్లలైనా అయి వుండాలి.

వెలుగు దగ్గర పడింది. అది షెడ్డునుంచే వస్తోంది. నెమ్మదిగా షెడ్డు దగ్గరకు వెళ్ళాడు. లోపల్నుంచి ఎలాంటి అలికిడీ వినపడలేదు. షెడ్డుకు ఓ చివరగా వున్న ఖాళీ ప్రదేశంనుంచి ఆ వెల్తురు బయటకు కనిపిస్తోంది. తలుపు మూసివున్నది.

సురేంద్ర అడుగులో అడుగు వేసుకుంటూ షెడ్డును సమీపించి ఆ ఖాళీ జాగానుంచి లోనికి చూశాడు! లోపల ఎవరూ లేరు.

సురేంద్ర ఆశ్చర్యంగా అక్కడ్నుంచి పక్కకు కదిలాడు. మరి చిన్న పిల్ల ఏడుపు విన్నది ఎక్కడ్నుంచి?

అతనికి కొద్ది క్షణాలు ఏం చెయ్యాలో అర్థంకాలేదు! టార్చిని కిందుగా ఫోకస్ చేశాడు.

ఇంతలో అకస్మాత్తుగా మళ్ళీ చంటిపిల్ల యేడుపు, ఆ వెంటనే యెవరో నోరు నొక్కెయ్యటం మరింత దగ్గరగా, స్పష్టంగా వినిపించింది సురేంద్రకు.

ఆ శబ్దాన్ని ఆధారం చేసుకొని ఆ పక్కకు అడుగులు వేశాడు సురేంద్ర. దూరంగా తాటాకు కమ్మలతో కట్టిన

ఓ పాక అతని దృష్టిలో పడింది! ఏడుపు ఆ పక్కనుంచే వచ్చింది.

సురేంద్ర ఆ పాక దగ్గరకు చేరుకున్నాడు. లోపల ఏదో అలికిడి! బయటికి ఏదో సన్నటి గుడ్డి వెలుగు. బహుశా కొవ్వొత్తి వెల్తురో, హారికేన్ లాంతరు వెల్తురో కావచ్చు.

సురేంద్ర ఆ పాకను సమీపిస్తుండగానే అనుకోకుండా ప్రమాదం ఎదురైంది. ఎవరో వెనుకపాటున అతని తలమీద బలమైన కర్రతో కొట్టారు.

సురేంద్ర కుప్పలా కూలిపోయాడు. కిందపడిపోతూ పక్కకి చూశాడు. ఎవరో పొడుగ్గా వున్న వ్యక్తి ఆ మసకచీకట్లో అతనికి కనిపించాడు. అతని చేతిలో కర్ర వుంది.

అంతే. సురేంద్రకు స్పృహ తప్పిపోయింది.

# 10

అతనికి మెలకువ వచ్చేసరికి, పిల్లల రోదన స్వరాలు మిన్నుమిట్టుతున్నాయి. బహుశా ఆ గొడవకే తనకు మెలకువ వచ్చిందని గ్రహించాడు సురేంద్ర.

నేలమీద పడివున్నాడు తను. అది ఎక్కడో ఏమిటో, తనెందుకలా పడున్నాడో గుర్తొచ్చేందుకు కొంత సమయం పట్టింది. మెలకువ వచ్చినా ఏం ఎరగనట్టు అలాగే పడివున్నట్టు వుండిపోయాడు కాసేపు.

కళ్ళు మూసినా తెరిచినా ఒకలాగే వుంది. అంతా చీకటి! తను పాక బయటే పడున్నాడు. అక్కడే ఎవరో తనను తలమీద కర్రతో కొట్టారు. ఆ వ్యక్తినికూడా తను పడిపోతూ చూశాడు. ఎక్కడో చూసిన ముఖంలాగానే కనిపించింది. అదిప్పుడు గుర్తొచ్చింది.

ఆ రోజు తను, గంగాధరం కలిసి బాలయ్య తోటకు వచ్చి అతన్ని ప్రశ్నిస్తూ అడుగుతున్నప్పుడు, అతను బాలయ్య పక్కనే వున్నాడు! తాము బాలయ్యతో వన భోజనాలకి వస్తున్నట్టు, ఆదివారం వస్తామని, శనివారం రాత్రికే సామానుతో కొందరు వచ్చేస్తామనీ చెప్పటం, బాలయ్య అంగీకరించటం—అవన్నీ పక్కనే వున్న ఈ వ్యక్తి విన్నాడు! అయితే....?

సురేంద్రకి ఒక్కొక్క సంఘటనే గుర్తొస్తోంది. ఆడవాళ్ళతో వస్తున్న విషయం తెలిసి, ఆ సంగతి కాస్తా దుండగులకి తెలియజేసి ఆడవాళ్ళమీద అత్యాచారం చెయ్యటానికి సిద్ధమయ్యారా? ఆ వ్యక్తి బాలయ్యకి బాగా తెలిసిన వాడే అయివుండాలి! అంటే బాలయ్యకి యీ కిడ్నాపింగ్‌తో సంబంధముందనుకోవాలా? అదే నిజమయితే సునంద, రేవతి యీసరికి....?

భగవాన్, అలా జరక్కూడదు! అన్నెం పున్నెం ఎరగని సునంద మలినం కాకూడదు! ఆమె స్వచ్ఛమైన తెల్ల గులాబీ! ఆమెను ముట్టుకోవటానికి ఎవరికీ హక్కు లేదు!—ఒక్క దివాకర్‌కి తప్ప!

సురేంద్రకు తన కాలేజి రోజులు, ఆ రోజుల్లో సునందను తను ఆరాధించటం, కాలేజి బ్యూటీగా పేరు పొందిన సునంద కాలేజి అంతటికీ తనొక్కడినే అభిమానించటం, తను తమ మధ్యనున్న పవిత్ర ప్రేమను వివాహంగా మార్చుకోవాలని ప్రయత్నించటం, సునంద తండ్రి అంగీకరించకపోవటం, ఫలితంగా ఆమెకు దివాకర్‌తో వివాహం జరిగిపోవటం, తను భగ్నప్రేమికుడుగా, బ్రహ్మచారిగా మిగిలిపోవటం-అన్నీ సినిమారీళ్ళలా తిరిగాయి.

అన్నాళ్ళ పరిచయంలోను తను పొరపాటున కూడా

సునంద మునివేలు కూడా తాకలేదు! ఆమె కూడా ఎప్పుడూ హద్దులుమీరి ప్రవర్తించలేదు! తమ యిద్దరి ప్రేమకు మరో మూగసాక్షి రేవతి—సునంద స్నేహితు రాలు!

ఇన్నాళ్ళ తరవాత అనుకోకుండా యీ గార్డెన్ పార్టీలో ఆమెను చూస్తానని కల్లో కూడా అనుకోలేదు. కాని కల నిజమయింది. తన ఆరాధ్య దేవత తన కళ్ళ ముందు ప్రత్యక్షమయి మనసు అంతరాంతరాలలోని ప్రేమ వాహినిని కట్టలు తెంచింది.

కాని .... కాని ....ఆమె ప్రస్తుతం పరాయి స్త్రీ. దివాకర్ భార్యగా అతని యిద్దరు బిడ్డలకు తల్లిగా సమాజంలో ఉన్నతమయిన స్థానంలో వున్నది! తనో సామాన్య గుమాస్తాగా జీతం డబ్బుల్తో బతుకుతున్నాడు. ఆమె చేసిన పనే కరెక్టు! ఆఫీసరు భార్యగా చక్కటి అంతస్తును సంపాదించుకున్నది!

తనని చూడగానే ఆమె కళ్ళలో ఎన్ని కోట్ల మెరుపులు! ఎంత కాంతి! ఇన్నాళ్ళుగా మనసు పొరలి మధ్య పదిలంగా దాచుకున్న ప్రేమ అంతా ఆ కళ్ళలోనే ప్రతిఫలించింది! రేవతి కూడా తనని గుర్తించింది. కాని తను బయటపడితే, ఆమె జీవితం, బంగారు భవిష్యత్తు ఏమవుతాయి?

అందుకే....అందుకే...ఆమె అపరిచిత వ్యక్తి అన్నట్టు ప్రవర్తించాడు. దివాకర్ రెట్టించి అడిగినపుడు కూడా ఏమీ సమాధానం చెప్పలేదు. తను నిజంచెప్పి మరిన్ని అపార్థాలకు, అనర్థాలకు దారితీయకూడదనే ఏమీ చెప్ప కుండా మౌనం వహించాడు. తూటాల్లాంటి మాటలతో తనను తూట్లు పొడిచినా పెదవి కదపలేదు తను,

పక్కన అడుగుల చప్పుడు వినిపించి ఊపిరి బిగ బట్టాడు. వాడో స్తున్నాడు తను కదలకూడదు. బిగ దీసుకుని పడుకున్నాడు.

ఆ వచ్చిన వ్యక్తి వెంట మరో వ్యక్తి వున్నట్టు మాటల్నిబట్టి అర్థం చేసుకున్నాడు.

"ఒక్క దెబ్బతో నేల కరిచాడు. మన దొర ఇంకా రాలేదు కదా. వచ్చాక వీడి సంగతి చూద్దాం!" అంటు న్నాడు తనని గాయపరిచిన వ్యక్తి.

"అసలు చచ్చాడో బతికాడో చూశావా? వీడ్నింకా ప్రాణాలతో వదలటం ప్రమాదకరం! మన సంగతి తెలిసిన ఒకే ఒక సాక్షి వీడు!" అంటున్నాడు రెండో వ్యక్తి.

అతని మాటలు వినగానే సురేంద్ర ఊపిరిబిగబట్టాడు. ఏమాత్రం చలనం లేకుండా కర్రలా బిగుసుకుపోయాడు.

మొదటి వ్యక్తి సురేంద్ర ముక్కు దగ్గర చెయ్యి పెట్టి, "అరె, వీడు చచ్చాడు. మన పీడ విరగడయి పోయింది. వీడ్ని పక్కకు లాగేద్దామా?" అన్నాడు.

రెండో వ్యక్తి అటు యిటు కాలితో సురేంద్రను తన్ని, "అవును చచ్చాడు. వీడ్ని యిక్కడే వదిలేద్దాం. పక్కకి జరపటం కాదు, దొర వచ్చాక ఏకంగా పూడ్చి వేద్దాం!" అన్నాడు.

మొదటి వ్యక్తి, మన దొర ఎనిమిది గంటలకే వస్తా నన్నాడే, యింకా రాలేదేమిటి?" అన్నాడు.

"అదే అర్థం కావటంలేదు! ఇప్పుడు పదిన్నర కావస్తోంది. ఆ కుర్ర వెధవల్ని ఆపటం మన తరం కావటంలేదు. గోల పెట్టేస్తున్నారు. ఆ అమ్మాయిలిద్దరు శోషవచ్చి పడిపోయినట్టు నేల మీద పడున్నారు.

వీళ్ళని ఎంతసేపు కాచుక్కూచోవాలో నాకర్థం కావటం లేదు!"

"కుంట లిద్దరూ భలే అందంగా వున్నారు సుమా! నాకు వాళ్ళని అలా వదల బుద్ధి కావటంలేదు."

"ఆ ఆలోచనే రానివ్వకు! మనం వాళ్ళని ముట్టుకునే అర్హత లేదు. మన దొర ఆకలి నే పేగులు లెక్క పెట్టే రకం! ఆయన తలచినపిల్లను కన్నెత్తి చూసినా సహించడు! ఈ పిల్ల ఆయన కావాలని కోరుకున్నాడు!"

"మనల్ని యిద్దరు అమ్మాయిల్ని ఉంచమని చెప్పలేదు కదా! ఆ పిల్లల తల్లి నే కదా వుంచమని చెప్పాడు!?"

"రాత్రి బాస్ తోటకువచ్చి తోటప్రక్క కాపలా వాడ్ని అడిగి తెల్సుకున్నాడు—యింకా ఆడవాళ్ళు వస్తున్నారని తెల్సింది. ఇద్దర్ని వుంచమన్నాడు నాతో. అతని ఫ్రెండును కూడా తీసుకొస్తున్నాడు."

"కాని ఆ తోటలో యింకా మనుషులు తిరిగిపోలేదు. ఇంకా వెతుక్కుంటూనే వున్నారు!"

"వీడు వాళ్ళలో మనిషే కదా! అందుకే తగిన సన్మానం చేశాం. వీడు వెళ్తేనేగదా, మనం యిక్కడ అమ్మాయిల్ని దాచిన విషయం తెలిసేది? శాశ్వతంగా వీడినోరు మూత బడిపోయింది కదా! యిక ప్రమాదం లేదు!"

"చూడు, ఎక్కడో మోటారు శబ్దం వినిపిస్తున్నట్టుంది కదూ!...."

"...అబ్బే, అది యిటువచ్చే శబ్దం కాదు. రోడ్డున పోతోంది."

"దొర ఇక వచ్చేస్తాడులే! యీలోగా కాస్త మందు బిగించుకుందాం!"

ఇద్దరూ నవ్వుకున్నారు. మాటల సవ్వడి మారమయి పోయింది.

సురేంద్రకు వాళ్ళ మాటలలో పూర్తిగా పరిస్థితి అర్థమయిపోయింది. వాళ్ళిద్దరు యెవరో దొరకి నమ్మినబంట్లు! సునందను పట్టితెమ్మని వీళ్ళకు ఆ వ్యక్తి ఆజ్ఞాపించాడు. ఈ రాత్రికి యీ తోటకు వస్తానని చెప్పిపోయాడు. వీళ్ళు సునందను, రేవతిని బంధించి చెరపట్టి వుంచారిక్కడ. బహుశా ఆ దొర యెవడో యీ తోట యజమాని అయి వుండాలి! అతని అనుచరుడైన యీ వ్యక్తి యెవడో బాలయ్యకు తెలిసినవాడే అయివుంటాడు. అందుకే తాము గార్డెన్ పార్టీకి వస్తూన్న విషయం వివరాలు యీ వ్యక్తికి చెప్పేశాడు అనుమానించకుండా!

అయితే సునందగాని, రేవతిగాని మలినపడలేదు. ఎంత అదృష్టం! ఇలాంటి నరరూప రాక్షసుల చేతుల్లో పడినాక కూడా యింకా తన సునంద....మల్లెపూవు లాంటి, తెల్ల గులాబీలాంటి, సునంద - భగవాన్, నువ్వు దయామయుడివి! అనుకున్నాడు సురేంద్ర ఆనందంగా.

"అయితే ఆ దొర ఎవడు? సునందనే కోరుకున్నాడంటే సునందను తెలిసినవాడయి వుండాలి! ఆమెను నీడలా వెంటాడుతున్నవాడయి వుండాలి! అందుకే అవకాశం కోసం ఎదురుచూస్తూ యిప్పుడు, యిలా యీ తోటలో బంధించి....

సురేంద్ర తల విదిలించాడు. చాలా నొప్పిగా వుండి చుర్రుమన్నది. మాడు తడుముకున్నాడు. జిగటగా తగిలింది. చేతికి రక్తం అంటుకుంది. గాయం బాధగావుంది. తల దిమ్ముగా వున్నది.

చాలా పెద్ద దెబ్బే తగిలింది! అయినా ఫరవాలేదు.

తన శరీరంలో ప్రాణ మున్నంతవరకు, తన ఆఖరి రక్తం బొట్టు ఆవిరయిపోయే వరకు, సునందను రక్షించి తీరు తాను.

సురేంద్ర లేచి నిలబడ్డాడు. అదృష్టవశాత్తూ టార్చి లైటు వాళ్ళ దృష్టిలో పడలేదు! అదే యిప్పుడు తనకు మార్గదర్శి!

టార్చి అందుకున్నాడు. పాకలోనుంచి పిల్లలు ఏడ్చి ఏడ్చి నిద్రపోయినట్టున్నారు. ఎలాంటి సవ్వడీ వినరావటం లేదు. పాక వెనక్కి వెళ్ళాడు. పాక సందుల్లో నుంచి లోపలకు తొంగిచూశాడు. హరికేన్ లాంతరు వెలుగు గుడ్డి వెలుగును ప్రసరిస్తోంది.

లోపల పిల్లలిద్దరు నేలమీదపడి నిద్రపోతున్నారు. ఆ పక్కనే చేతులు, నోరు కట్టబడివున్న సునంద, రేవతి! దుఃఖంతో ముఖాలు పీక్కుపోయి, జుట్టు, చీరెలు, చెదిరిపోయి, కన్నీటి చారికలు ముఖంమీద నిరంతరం కారటం వల్ల జిడ్డు పట్టిపోయి, పది లంఖణాలు చేసినవాళ్ళలాగా వున్నారు

సురేంద్రకు వాళ్ళను ఆ స్థితిలో చూడగానే కడుపుల్లో దేవినట్టయింది. వాళ్ళను ఆ స్థితికి తీసుకువచ్చిన దుండగుల్ని నామరూపాలు లేకుండా నాశనం చెయ్యాలన్న పిచ్చి ఆవేశం వచ్చింది.

ఆ వ్యక్తులిద్దరు పాకకి అవలపక్కన చుట్టలు తాగుతున్నారు. పక్కనే బీరు సీసాలో, బ్రాందీ సీసాలో తెలీదుగాని, చీకట్లో మెరుస్తున్నాయి. బాగా తాగుతున్నారు. ఇదే మంచి అవకాశం!

సురేంద్ర చుట్టూ చూశాడు. ఇందాకా మోటారు షెడ్డువద్ద ఇనుపరాడ్ నొకదాన్ని చూశాడు. అదే

ప్రస్తుతం తన ఆయుధం!

చకచక అలవాటుపడిన కళ్ళు చికిలించుకుంటూ వెళ్ళి యినుపరాడ్ తెచ్చుకొన్నాడు. చప్పుడు కాకుండా వెనక పాటున వెళ్ళి ఓ వ్యక్తి తల పగలేశాడు. వాడు కిక్కురు మనకుండా నేల వాలిపోయాడు!

రెండోవాడు తేరుకొని లేచేలోపల వాడ్ని కూడా రాడ్‌తో బుర్ర పగలేశాడు. వాడుకూడా పెద్దగా అరిచి నేల వాలిపోయాడు.

సురేంద్రకు పిచ్చి సంతోషం వేసింది. ఒక్క ఉదుటన్న పాకలోకి వెళ్ళి సునందను, రేవతిని తాళ్ళు విప్పి లేవ దీశాడు.

"సురేన్, నువ్వా?" అన్నది నిశ్చేష్టపోతూ సునంద. రేవతి ఆనందంగా చూస్తోంది.

"కమాన్, మనం వెంటనే పారిపోవాలి! మనవాళ్ళు యింకా బాలయ్య తోటలోనే వున్నారు! పిల్లల్ని నేను ఎత్తుకుంటాను!" అన్నాడు సురేంద్ర ఇద్దరుపిల్లల్ని చెరో భుజంమీద ఎత్తుకుంటూ.

సునంద, రేవతి ఆనందంగా పాక బయటకొచ్చారు.

"ఈ టార్చి ఫోకస్ చెయ్యి సునూ, దారి కనిపిస్తూంది!" అన్నాడు టార్చి సునంద కిస్తూ.

తోటవున్న కర్రగేటును తీసుకుని బయటికొస్తున్న సమయంలో యెక్కడి నుంచో మోటారుసైకిలు శబ్దం, ఆ వెంటనే హెడ్ లైటు కాంతి వాళ్ళ కళ్ళకు కొట్టింది.

ఇద్దరు వ్యక్తులు దూసుకుంటూ వచ్చేశారు.

"అరేయి, వీళ్ళేరా, పారిపోతున్నారు, పట్టుకో!"

అన్నాడో వ్యక్తి. రెండోవాడు రేవతిని పట్టుకుంటే మొదటివాడు సునందను పట్టుకున్నాడు. సురేంద్ర పిల్లల్ని ఆ యిసుకలోనే దింపేశాడు. ఒక్కసారిగా వాళ్ళిద్దరి మీదకు లంఘించాడు.

ఈలోపల సునంద తనని పట్టుకున్న వ్యక్తి చెయ్యి కండ వూడివచ్చేలా కొరికింది. అతను ఆమెను వదిలేసి 'అబ్బా!' అంటూ రక్తం ఓడుతున్న చెయ్యిపట్టుకుని కూలబడ్డాడు. రెండో వ్యక్తి చేతిలో కత్తి మెరిసింది!

మరుక్షణం ఆ కత్తి సురేంద్ర నెత్తురు చవి చూసి వుండేది! కాని సురేంద్ర లాఘవంగా తప్పించుకుని ఆ వ్యక్తి చేతిలోని కత్తిని లాక్కుని అతని కడుపులో రెండుసార్లు పొడిచాడు. ఆ వ్యక్తి రేవతిని వదిలేసి నేల మీద కూలిపోయాడు.

సురేంద్ర ఆడవాళ్ళిద్దరి వంకా తిరిగి, "పారిపోండి, నేను వీడి సంగతి చూసివస్తాను!" అన్నాడు మొదటి వ్యక్తిమీదికి ఉరుకుతూ.

"రేయ్ రాఘవా! నువ్వా?" అన్నాడు సురేంద్ర.

రాఘవ! తన క్లాస్ మేటు! ఒకప్పుడు సునందచేత చెంపదెబ్బలు తిన్న రాఘవ!

"నువ్వా? నువ్వా యీ పాపానికి తలపెట్టింది?" సురేంద్ర అతనిమీదికి కత్తితో ఉరికే సమయానికి అకస్మాత్తుగా తన దగ్గిరున్న పొడవాటి కత్తితో సురేంద్ర పక్కలో పొడిచాడు ఆ వ్యక్తి—రాఘవ!

ఒకసారి కాదు, నాలుగుసార్లు!

సురేంద్ర ప్రాణం కడంటింది. కాని, మెరుపులా రాఘవమీదికి లేని ఓపిక తెచ్చుకుని తిరగబడ్డాడు. కసిగా రాఘవ గుండెల్లోను, పొట్టలోను పొడిచాడు.

అరుస్తూ నేలమీద పడిపోయాడు రాఘవ!

ఈలోపల సునంద, రేవతి వెళ్ళి అందర్నీ తీసుకొచ్చారు. సీతారాం, రఘు, దివాకర్, గంగాధరం, పూర్ణిమ, విమల, పిల్లలు అందరూ వచ్చేశారు!

నేలమీద పడివున్న సునంద పిల్లలిద్దర్నీ చూపించి, "మీ బిడ్డలు క్షేమంగా వున్నారు" అంటూ దివాకర్ వైపు తిరిగి, "సునంద ఏ తప్పూ చెయ్యలేదు. ఆమెను అనుమానించకండి!" అంటూ ప్రాణాలు విడిచాడు సురేంద్ర.

—:అ యి పో యి ం ది:—

సీరియల్

బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

"ఏ మొక్కయినా పెరగాలంటే తేమ, గాలి కావాలి కదా! అవి రెండూ అందుతున్నాయి కాబట్టే యిక్కడ చెట్లు పెరుగుతున్నాయి! .... గమనించావా, యిక్కడ సొరంగమార్గం చాలా విశాలంగా వుంది. ఓ మైదానం లాగా వున్నది!" అన్నాడు అభిలాష్.

అందరికీ, వింతగానే వున్నది. రాను రాను సొరంగ మార్గం మరింత విశాలమయి, ఓ సమతల ప్రదేశాన్ని చేరుకున్నారు.

అందరు పర్ణశాలవంటి ఆ కట్టడం దగ్గర ఆగి చుట్టూ చూశారు. ఎక్కడా మనుష్య సంచారంగాని మరేవిధ మైన అలికిడిగాని వినరావటంలేదు.

అక్కడ వెలుతురు ధారాళంగా ప్రసరిస్తోంది. ఎక్కడ నుంచి వస్తున్నదో కూడా తెలియటంలేదు. దూరంగా పచ్చటి వెలుతురు కాంతి తగ్గి చాలా అస్పష్టంగా కనిపిస్తోంది. రాత్రిళ్ళు ఎంత స్పష్టంగా కనిపిస్తోందో, ఇప్పు

డంతగా తేలిపోయింది!

వర్మ రివాల్వర్ పొజిషన్‌లో వుంచుకుని అశ్వనివంక కార్తీక్ వంక హెచ్చరిస్తున్నట్టు చూశాడు. వాళ్ళు కూడా తుపాకులు ఎలర్టుగా పట్టుకుని వున్నారు.

ముందుగా వర్మ ఆ వెంట కార్తీక్, అశ్వని, అభిలాష్, హిమవంత్ ఒకరొకరుగా తలుపులులేని ఆ పర్ణశాల లోపలికి ప్రవేశించారు.

లోపల దర్భాసనంలాంటి ఓ ఆసనంమీద ఓ వ్యక్తి కూర్చుని వున్నాడు. అతను కళ్ళు మూసుకుని వున్నాడు. గడ్డం బాగా పెరిగి నేలని తాకుతుంది. గోళ్ళు బాగా పెరిగిపోయి కత్తులను తలపిస్తున్నాయి.

జుట్టు అట్టలు కట్టుకుపోయింది. జుట్టు, గడ్డం బాగా తెల్లబడిపోయి వున్నాయి. ముఖంనిండా ముడతలు! అతని వయసు యెంతుంటుందో అంచనా వేయటం కష్టం. నూరేళ్ళుండవచ్చు!

వర్మతోబాటు అందరూ చుట్టూ విచిత్రంగా చూశారు. అక్కడ ఆ ముసలాయన తప్ప మరెవ్వరూ లేరు! లోపల యే మూల చూసినా బూజులు వేలాడుతున్నాయి. నేల మీద ఓ అడుగు మందాన దుమ్ము పేరుకుని వున్నది. నేలపైన అడుగు వెయ్యగానే వాళ్ళ పాదాలు ముద్రలు స్పష్టంగా అచ్చుతీసినట్టు పడ్డాయి.

కార్తీక్ వర్మ వంక చూసి, "ఇక్కడ ఈయనతప్ప మరెవ్వరూ లేరు. చాలా ఏళ్ళుగా యెవరూ యిక్కడ కాలుకూడా మోపలేదనటానికి ఈ బూజులు, దుమ్ము నిదర్శనం!" అన్నాడు.

"అవును, అలాగే కనిపిస్తోంది! ఇంత పండు ముసలి వ్యక్తిని చూడటం యిదే ప్రథమం!" అన్నాడు వర్మ.

"ఆయన్ని లేపిచూద్దామా?" అన్నాడు అశ్విని.

"ఆయన ఏదో ధ్యానముద్రలో వున్నట్టుగా వుంది! అచ్చం పురాణ కథల్లో చదివిన మునీశ్వరుడిలాగా వున్నాడీయన!" అన్నాడు హిమవంత్.

అభిలాష్ దీక్షగా ఆ ముసలాయనవంకే చూస్తున్నాడు. ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు జరగటంలేదని అతనికి అనుమానం వచ్చింది. దగ్గరగా వెళ్ళాడు. ఆయన ముక్కు వద్ద వేలుంచి చూశాడు.

అందరు అభిలాష్ చేష్టల్ని మౌనంగా గమనిస్తున్నారు.

అభిలాష్ అందరి వంకా తలతిప్పి, "ఈయన ఊపిరి పీల్చటంలేదు!" అన్నాడు.

అందరు ఆశ్చర్యంగా పోయి చూశారు.

నిజమే, ముసలాయన ఊపిరితీయటంలేదు.

వర్మ ఆయన్ని చేత్తో తాకాడు.

అంతే! అంతవరకు కూచుని వున్న ముసలాయన—ఒక్కసారిగా పక్కకి ఒరిగిపోయాడు!

అందరూ యీ వింతకు ఆశ్చర్యపడి తాకిచూశారు. నిజంగానే ముసలాయనలో చలనంలేదు! అయితే ఆయన ముఖంలో ఏదో దివ్య తేజస్సు కనిపిస్తోంది.

"అరె, ఏమిటిది? మనం లోపలికి వచ్చాకనే ఈయన ప్రాణం పోయి వుండాలి, అవునా?" అన్నాడు వర్మ ఆశ్చర్యంగా ముసలాయనవంకే పరీక్షగా చూస్తూ.

"అసలీ ముసలాయన ఒక్కడూ యిక్కడ ఏం చేస్తున్నట్టు? యెన్నాళ్ళుగా యీ తపస్సమాధిలో మునిగిపోయాడో అర్థంకాలేదు! ఇక్కడ ఏ విధమైన ఆహారం అందుబాటులో లేదు! పళ్ళుగాని, తత్సంబంధమైనవిగాని లేవు! అంటే ఈయన కేవలం గాలి భోంచేస్తూ ఇన్నాళ్లు

బతికున్నాడని అనుకోవాల్సి వస్తోంది!"

"కావచ్చు. వాయుభక్షకులుంటారని మునీశ్వరుల మహిమలే అందుకు కారణమనీ చెప్పుకోవటం విన్నాం. ఇది అటువంటి కేసే అయ్యుండాలి!"

"సరే, మనం చేసేదేముందిక్కడ? బయటికి పోదామా?" అన్నాడు వర్మ.

కార్తీక్‌కి ముసలాయన కూర్చుని వుండిన దర్భాసనం కిందినుంచి ఏవో రాగిపలకలాంటి రేకు బయటకి తొంగి చూస్తూ కనిపించింది.

కార్తీక్ రెండంగల్లో ముసలాయాన్ని సమీపించి దర్భాసనం కిందినుంచి రేకును బయటికి తీశాడు.

అది నల్లగా రంగు మారిపోయిన రాగి రేకు!

దానిమీద సంస్కృతంలో ఏవో అక్షరాలు లిఖించబడి వున్నాయి!

వర్మ కార్తీక్ భుజాలమీదుగా ఆ రాగి రేకులోకి చూశాడు. "ఏమిటది? ఏముంది అందులో?" అనడిగాడు.

కార్తీక్ అభిలాష్ వంక చూసి, "ఇది సంస్కృతంలో వున్నది. ఏమిటో చదివి చెప్పు!" అన్నాడు.

అక్కడున్నవారిలో అభిలాష్ ఒక్కడికే సంస్కృతం తెలుసు.

అభిలాష్ ఆ రాగిపలకలోని అక్షరాలను లోపల చదువుకుని తర్వాత పైకి యిలా చదివాడు. "ఇక్కడికి నాలుగు ఫర్లాంగుల దూరంలో నిక్షిప్తమై వున్న నిధులు కావాలంటే చిత్తశుద్ధితో ప్రయత్నించాలి!" అని రాయబడి వున్నది. దానికింద బాణం గుర్తులు, చుక్కలు, గీతలు ఉత్తర దక్షిణ ధృవాలు అన్నీ సూచించబడి వున్నాయి.

"ఈ రాగి పలక యిక్కడెందుకున్నది? ఈ ముసలాయన యెవరు?" అన్నాడు హిమవంత్ ఆశ్చర్యం ప్రకటిస్తూ.

"ఈయనకూడా రాజవంశంవారై వుంటాడు. అందుకే నిధికి సంబంధించిన రాగిపలక యీయన వద్ద వున్నది!" అన్నాడు కార్తీక్.

వర్మ రాగిపలకను అందుకొని తదేక దీక్షతో దాని వంకనే చూస్తున్నాడు.

కార్తీక్‌కి, తక్కినవాళ్ళకు ముళ్ళమీద నించున్నట్టుంది. దీప్తి యేమయిపోయిందో నన్న బెంగ పట్టి పీడిస్తోంది కార్తీక్‌ను. తక్కిన వాళ్ళకు దీప్తిని గురించి బాధగా వున్నా, తాము యిళ్ళకు తిరిగి క్షేమంగా చేరగలమా అన్న గుబులు, బెంగా మతిస్థిమితం లేకుండా చేస్తున్నాయి.

"సార్, పోదామా....?" అన్నాడు కార్తీక్, వర్మతో.

వర్మ తన దృష్టిని రాగి పలకమీది నుంచి తప్పించి కార్తీక్ వైపు అభావోకగా చూశాడు.

"ఎక్కడికి?" అన్నాడు పరధ్యానంగా.

కార్తీక్‌కి వర్మ అలా ప్రశ్నించటం వింతగా అనిపించింది. అయినా ఓపిగ్గా సమాధానం చెప్పాడు.

"ఆఁ, అవును—మిస్ దీప్తి విషయం వెరిఫై చేసుకుని తిరిగిపోదాం!" అన్నాడు వర్మ, రాగిపలకను తన దుస్తుల్లో భద్రపరుస్తూ.

కార్తీక్ నిశితమైన చూపులు అక్కడి ప్రతి అంగుళం భాగాన్ని పరీక్షగా తడిమాయి. పర్ణశాలవంటి ఆ చిన్న పాకలో రహస్యమార్గాలుగాని, గదులుగాని ఏవీ లేవు.

దీప్తిని — ఎవరు, ఎక్కడికి తీసుకుపోయారో అంతా అగమ్యగోచరంగా అనిపించిందతనికి.

అందరూ ముందుకి యాంత్రికంగా అడుగులు వేస్తున్నారు. మైదానంలాగా విశాలంగా వున్న ఆ ప్రదేశంలో దారి రెండుగా చీలిపోయింది.

కార్తీక్, వర్మవంక ప్రశ్నార్థకంగా చూశాడు.

వర్మ రాగిరేకు వైపు దీక్షగా చూస్తున్నాడు. దాని పైన వున్న గుర్తువంక పరిశీలనగా చూస్తూ కార్తీక్‌ని గమనించలేదు.

“వర్మగారూ, చూశారుగా, దారి రెండుగా చీలిపోయిందిక్కడ! ఎటు వెళ్దాం?” అన్నాడు కార్తీక్.

వర్మ తలెత్తి అందరివంకా ఓసారి చూసి, “నాతో ఎవరు ఫాలో అవుతారు?” అన్నాడు నెమ్మదిగా.

“అసలు ఏం చేద్దామంటారు? మీకు అందుకే ప్రత్యేకంగా చెప్పేది!” అన్నాడు కార్తీక్.

“మీరో దారి వెంబడి చూడండి. నేనో దారి వెంబడి పోయి చూస్తాను. మీ వెంట యెవరు కావాలో తీసుకు వెళ్ళండి సాయం! కావాలంటే అందర్నీ తీసుకుపోండి, నేనొక్కడ్నీ చాలు!” అన్నాడు వర్మ.

కార్తీక్, వర్మ మాటల ధోరణిలో వచ్చిన మార్పును గమనించాడు. అభిలాష్, అశ్విని, హిమవంత్ వర్మ మాటల్లోని అంతరార్థం యేమిటా అని ఆలోచిస్తున్నారు.

కార్తీక్ తనవాళ్ళవంక తిరిగి, “ఏంచేద్దాం? అందరూ ఒకే తోవన వెళ్ళేకన్న మీలో ఎవరైనా వర్మగారితో ఓ దారిన వెళ్తే తక్కినవాళ్ళం రెండో దారిన వెళ్తాం. ఏమంటారు?” అనడిగాడు.

హిమవంత్‌కి మొదట్నుంచీ వర్మపట్ల సదభిప్రాయం

లేదు. అతను కార్తీక్‌తోనే ఫాలో అవుతానన్నాడు. అశ్వని మంచి షూటర్. తను కూడా కార్తీక్‌తో వస్తానన్నాడు. అభిలాష్, వర్మతో వెళ్ళటానికి సిద్ధమయ్యాడు.

వర్మ, అశ్వని దగ్గర్నుంచి బుల్లెట్స్ తీసుకుని "ఈ రివాల్వర్ చాలు నాకు! మీరు రెండు తుపాకీలు మీతో వుంచుకోండి! మన యిరు వర్గాలు యీ దార్లు ఎంతదూరం వెళ్తే అంతదూరమూ వెళ్ళి, మళ్ళీ తిరిగి ఇక్కడే కల్సుకుందాం. ఓ.కే!" అన్నాడు.

వర్మ, అభిలాష్ వెళ్ళిపోయేంతవరకు అటే చూస్తూ వుండిపోయిన కార్తీక్, అశ్వని, హిమవంత్ రెండో దారిన బయలుదేరారు.

హిమవంత్ ఏదీ దాచుకోలేదు—వెంటనే అన్నాడు, "ఈ వర్మ తంతు చూడబోతే దశ్చాశ పట్టుకున్నట్టు కనిపిస్తోంది. ఆ రాగిరేకు దొరికాక అతని ఆలోచనల్ని పసికట్టాను!" అంటూ.

అశ్వని తనూ అతని మాటలు బలపరుస్తూ "అందుకే రాగి పలక మళ్ళీ మనకు తిరిగివ్వలేదు. సంస్కృతం తెలిసిన అభిలాష్‌ని తన వెంట తీసుకువెళ్ళటానికి అతను ఆసక్తి కనపర్చటం గమనిస్తే, జారేమనిపిస్తోంది?" అన్నాడు.

కార్తీక్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"అనుమానం వచ్చినప్పుడల్లా దాన్ని చదివించుకుని బాగా ఆకళింపు చేసుకుంటాడు. నన్నడిగితే అభిలాష్ ఆ రాగిపలకమీది పూర్తి వివరాలు వర్మతో చెప్పలేదనిపిస్తోంది. అతనికి తెలియకూడదనే కొంత కప్పిపెట్టాడనుకొంటున్నాను" అన్నాడు హిమవంత్.

"ఎందుకలా అనుకొంటున్నావు? అభిలాష్ స్వార్థం ఏముందిందులో?" కార్తీక్ అడిగాడు.

"అభిలాష్‌లో స్వార్థం లేదు. కాని వర్మకు తెలియకూడని వేమి వున్నాయో ఆ రేకుమీద? తర్వాత మనతో విశేషాలుంటే చెపుతాడు. అభిలాష్ సంగతి నాకు బాగా తెలుసు!" అన్నాడు హిమవంత్ మళ్ళీ.

"ఆల్ రైట్! అలాగే అనుకుందాం. మరి జాక్సన్ బృందం, రెండో బృందం టైగర్ హిల్స్‌మీద ఎందుకు తవ్వకాలు జరుపుతున్నట్టు? నిధి అంతా యీ లోపలే సంక్షిప్తమయి వున్నట్టు వాళ్ళకి తెలియదా?" అశ్విని అడిగాడు.

"తెలియదన్న మాటేకదా! తెలిస్తే వాళ్ళు బయటే తవ్వుతూ టైం వేస్టుచేసుకోరు! మొదట్లోనే సరాసరి యీ సొరంగం లోపల యీ గుర్తుల ప్రకారం తవ్వకుని యీపాటికి స్వంతం చేసుకుని వుండేవాళ్ళు!" అన్నాడు హిమవంత్.

అశ్విని యేదో చెప్పబోయాడు. ఇస్ అంటూ వారిం చాడు కార్తీక్. అక్కడ దారి సమతలంగా లేదు. అన్నీ ఎగుడు దిగుళ్ళు. రాళ్ళు రప్పలు.

కార్తీక్ దృష్టి కేంద్రీకరింపబడినవైపు తమ దృష్టిని సారించారు వాళ్ళిద్దరు.

అక్కడ ఓ అస్థిపంజరం పడివున్నది!

కార్తీక్ అస్థిపంజరాన్ని సమీపించి పరీక్షగా చూశాడు. చాలా పురాతనమైన అస్థిపంజరం. ఎముకలు ఎక్కడికక్కడ చితికిపోయి, చవుడు రాలిపోయినట్టు పొడి రాలిపోతున్నాయి. అస్థిపంజరం పక్కనే తుప్పు పట్టిపోయిన బల్లెం వున్నది!

"బహుశా యిది ఎవడిదో సైనికుడిదయి వుండాలి!" అన్నాడు కార్తీక్.

"అంటే యీ ప్రాంతాన్ని కళ్యాణవర్మ అనే రాజు పరిపాలించటం, నిధిని యిక్కడ నిక్షేపించటం నిజమే కావచ్చు!"

"ఇది సైనికుడిదే ఎందుకనుకోవాలి? ఇలాంటి బల్లాలు, శూలాలు మాంత్రికుడి శిష్యులు కూడా ప్రయోగించారు కదా!"

"అవి కొత్తగా వున్నాయి. ఇది బాగా పురాతనమైనదని చూడగానే తెలుస్తోంది— అస్థిపంజరం కూడా కొన్ని వందల యేండ్ల నాటిదని తేలిగ్గానే చెప్పవచ్చును...."

"రాగిపలకమీద రాసిన విధంగా అయితే మనం దాదాపు నాలుగు ఫర్లాంగులు నడిచి వచ్చేశాం కదా! మరి నిధి విషయం ఏమీ యింతదాకా ఆచూకీ దొరకలేదు."

"అది యీ దారో లేక వర్మ వాళ్ళు వెళ్ళిన దారో యెవరికి తెలుసు? అయినా ఆ బాణం గుర్తులు, అవీ మార్కు చేయబడిన రా గి ప ల క వర్మగారి దగ్గరుండిపోయింది. ఇప్పుడెలా వస్తుంది? అదీగాక మనం ప్రస్తుతం మిస్ దీప్తి గురించి అన్వేషణలో వున్నాం. నిధికన్న ఆమె ముఖ్యం మనకు!"

"కరెక్టు! నిధి నిక్షేపాలు భూమి అడుగున అంటే మన మున్నదానికన్న అడుగున—పాతిపెట్టి వుంటారు. మనం వాటిని తవ్వే ఉద్దేశంలో వుంటే అవి కనిపించవచ్చేగాని, అది మన బిజినెస్ కాదుగా!"

"ఇంతకీ మిస్ దీప్తి!" అశ్విని మాటలు పూర్తికానే లేదు ఎక్కడినుంచో విపరీత శబ్దాలు వినిపించాయి.

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

# "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

గాలిలో విపరీతమైన వేగం వచ్చింది. అంతదాకా గాలి సున్నట్టే తెలియని వాతావరణం ఒక్కసారిగా అనుకో ండా హోరున వీచటం మొదలైంది. ఎక్కడినుంచో ండుటాకులు ఎగురుతూ వచ్చిపడ్డాయి. గాల్లో ఎవరో కపక నవ్వుతున్నట్టు పెద్దపెట్టున శబ్దాలు! రణగొణ ్వనులు. తుఫాను వచ్చినపుడు వినిపించే వాతావరణ భత్సం క్షణాల్లో ఆ ప్రాంతాన్ని ఆవరించుకుంది!

అశ్విని తుపాకీని గురిచూసి పట్టుకున్నాడు. కార్తీక్ ాడా తన తుపాకిని గురిచేసి నించున్నాడు. హిమవంత్ ప్రేక్షకుడిలాగా చూస్తున్నాడు.

అకస్మాత్తుగా వాళ్ళముందు కొన్ని అస్థిపంజరాలు ప్రత్యక్షమయ్యాయి! అవి గాల్లో తేలూ వాళ్ళముందుకు చ్చాయి. ఒకటి రెండు కాదు. ఒకేసారి యరవై ుప్ఫయి అస్థిపంజరాలు వికృతమైన శబ్దాలు చేసుకుంటూ గాల్లో యెగురూ వచ్చాయి.

అశ్విని తుపాకీ పేల్చాడు. రెండు గుళ్ళు వ్యర్థ ంయ్యాయి. అస్థిపంజరాలు యింకా యింకా ముందుకి చ్చాయి. ఒకదానినొకటి చెట్టపట్టాలు వేసుకున్నట్టు లయాకారంగా ఏర్పడి, నృత్యంచేస్తూ పెద్దగా అరవ ాగాయి.

కార్తీక్ తుపాకీ పేల్చాడు. కాని ఉపయోగం లేక గోయింది. అంతకంతకు అవి దగ్గరగా నవ్వుతూ వాళ్ళ ాదికి వచ్చేస్తున్నాయి.

వికృతంగా నవ్వుతూ, నృత్యంచేస్తూ, గంతులువేస్తూ పెద్ద శబ్దాలుచేస్తూ, గాల్లో తేలూ అస్థిపంజరాలు వారి ుందుకు మరింత ముందుకు వచ్చాయి.

వాటి ఎముకలు ఎర్రబారిపోయాయి. ఎన్నో వందల

ంవత్సరాలనాటి అస్థిపంజరాలని వాటిని చూడగానే తెలిసిపోతోంది. అవి చేతులు చాచుకుని వాళ్ళను అందు కునేటంత దగ్గరగా వచ్చేశాయి!

* * *

"ఈ దారి మరీ యిరుగ్గా వున్నట్టుందే!" అన్నాడు శర్మ.

"ఇంతవరకు చాలా విశాలంగా కనిపించిన దారి ఒకేసారి సన్నబడిపోయింది" అన్నాడు అభిలాష్.

శర్మ రాగిపలక పైకితీసి, "ఈ గుర్తులు యీ దారినే సూచించటం లేదూ?" అన్నాడు.

అభిలాష్ శర్మవంక కొంత తీవ్రంగా చూసి, "శర్మ గారూ, మనం వెళ్ళేది యీ నిధికోసం కాదు. మిస్ దీప్తిని వెతకటానికి! ఆమె ప్రాణాలతో వున్నదో లేదో మనకు తెలియదు. అసలు యీపాటికి కనీసం టైగర్ గాల్స్ దిగిపోయి వుండేవాళ్ళం. ఆమె అంతర్ధానం కావ టంతో అంతా తారుమారయింది. ఆమె కనీసం ప్రాణాలతో మనకు దొరికితే మరో రెండు రోజులు ఆలస్యమైనా మేము సిద్ధమే! ప్లీజ్, ముందుకు పదండి!" అన్నాడు.

శర్మ కాసేపు మాట్లాడలేదు. "మీరు నన్నపార్థం చేసుకున్నట్టుంది! నేను మీ శ్రేయోభిలాషినని మీకు తెలుసు. మిస్ దీప్తి కనిపించకుండా పోయినందుకు నేను చాలా బాధపడుతున్నాను! పదండి వెతుకుదాం" అన్నాడు.

శర్మ ఓ చేతిలో రివాల్వర్ పట్టుకుని నడుస్తూనే రెండో చేతిలోని రాగిపలకను పరిశీలించి చూస్తూండటం అభిలాష్ గమనిస్తూనే వున్నాడు.

(సశేషం)

